శ్రీరస్తు

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# నల చరిత్రము

## (ద్విపద కావ్యము)

గ్రంథకర్త :
చక్రపురి రాఘవాచారి
షోళింగపురం

పరిష్కర్త :
వి. ఉదయశంకర్

ప్రకాశకులు :

ఎస్. వి. గోపాల్ అండ్ కో.
నెం. 18, గోపాలపురం, 8-వ వీధి,
మదరాసు-600 086.

స్థాపితము: 1915 ☎ 479 345



[వెల : రూ. 30-00

నల దమయంతుల గాథలను గూర్చి ప్రబంధములు, ద్విపద కావ్యములు అనేక రచనలు ఉన్నవి. నల దమయంతుల గాథ పరమ పవిత్రమైన పుణ్య కథ అని మహాభారతమందు చెప్పబడి యున్నది.

రామాయణములో సీత ఎంతటి ఉత్తమ ఇల్లాలో, దమయంతి కూడా అంతటి మహా పతివ్రత. సీత వలెనే ఈమె కూడా భర్తను విడబాసి కాలాంతరమున భర్తను దర్శించి అగ్నిప్రవేశం చేసి సమస్త దేవతలచే మహా సాధ్వీమణిగా ప్రశంసింపబడిన పుణ్య చరిత్ర.

ఇటువంటి మహిమాన్వితమైన పుణ్య కథను ఆంధ్ర భక్త కోటి తప్పక పఠించి భక్తి విముక్తిని పొందెదరని ఆశించుచూ ఈ ఉత్తమ పావన గ్రంథమును మీ కర కమలములకు అందజేయుచున్నాము.

—ప్రకాశకులు

# పీఠిక

సంస్కృత మహాభారతంలో వ్యాసులు ఈ నల దమ యంతుల గాథను వివరించారు. అట్లే ఆంధ్ర మహాభారతంలో నన్నయ్య 'నలోపాఖ్యానము' అను పేరున ఈ కథను చెప్పారు.

ఈ నల దమయంతుల గాథను ఇప్పటికి అనేకమంది కవులు ప్రబంధాలుగా, ద్విపద కావ్యాలుగా వ్రాయడం జరిగింది. నన్నయ్య మహాభారతంలో అరణ్య పర్వంలో నలోపాఖ్యానము, శ్రీనాథుని శృంగార నైషధంలోని నలుని గాథ విశేషించి చెప్ప దగ్గవి. ఐతే సంస్కృతంలో అగస్త్యుడు వ్రాసిన 'నల కీర్తి కౌముది' అనే ఒక ఖండ కావ్యం కూడా వున్నది.

తెలుఁగున నన్నయ్య, శ్రీనాథుల పిదప వా రిరువురి రచనల ప్రేరణతో రఘునాథ నాయకుడు వ్రాసినటువంటి నలచరిత్ర కూడా ఎన్నదగినదే.

ఆసూరి మతింగంటి సింగరాచార్యులు, 'నల యాదవ రాఘవపాండవీయము', గనుగుటూరి వెంకటకృష్ణయ్య 'నల రాఘవ యాదవ పాండవీయము', సంస్కృతమునందు వామనభట్టచార్యుని 'నలాభ్యుదయము', నీలకంఠ దీక్షితుని సంస్కృత 'నల చరిత్ర నాటకమ్', సిరిప్రెగడ సుబ్బారాయుడు రచించిన వ్యవహారిక భాషలోని 'నల నాటకం' చెప్పదగ్గవి.

ముఖ్యంగా ద్విపద రచనలో ఈ నలచరిత్రను వ్రాసిన వారిలో చక్రపురి రాఘవాచార్యులు, బట్టేపాటి తిమ్మయ్యలను పేర్కొనవచ్చు.

ఈ ఉభయులు రఘునాథ మహీపాలుని అనంతరము ద్విపదలో నలచరిత్రను వ్రాసిన కవులు.

చక్రపురి రాఘవాచారి రచించిన ఈ నలచరిత్ర నన్నయ్య భారతంలోని నలోపాఖ్యానాన్ని ప్రధాన యితివృత్తంగా గ్రహించి వ్రాయడం జరిగింది. ఐతే కథాంశ గమనంతో అచ్చటచ్చట చిన్న చిన్న స్వల్ప మార్పులు కన్పిస్తున్నాయి. నన్నయ నలోపాఖ్యానంలో దమయంతిని రాజకుమారులకు ఎవ్వరూ పరిచయం చేయరు. శ్రీనాథుడు శృంగార నైషధంలో దమయంతిని భారతీదేవిచేత పరిచయం గావిస్తాడు. ఈ కవి మాత్రం దమయంతిని రాజ పురోహితుడైన వసుదేవునిచేత పరిచయం చేయించాడు. ఈ రచన చక్కటి తెనుఁగు భాషా పుష్టితో సాగింది అని చెప్పాలి. తెనుఁగు దనపు సొబగులు, సోయగం బాగా గ్రహించిన వాఁడని తెలుస్తోంది ఈ రాఘవాచారి. ఐదు అధ్యాయాలలోను ప్రతి ఘట్టంలోనూ చక్కటి సాహితీ రస పోషణ కన్పిస్తోంది.

కథాగమనం అంతా రాజవీధిని వెళ్తున్నట్టుగా వుంది. పాఠకునికి చికాకు కలుగనీయకుండా నడిపించడం, పేరుకు ద్విపద కావ్యమైనప్పటికి నిండైన పదగాంభీర గల వచన సాహిత్యంలా ప్రవహించిన కవితాధార ఒక మాటలో చెప్పాలంటే "నవరస భూయిష్టమైన చక్కని రచన" యిది.

కవి తాను తిరువేంగడాచార్యుని తనయుడనని, విద్యావిశారదుడనని, రమణనే వరకవి అన్నది అతని మారుపేరు కాబోలు అని చెప్పుకున్నాడు. ఘటికాచలమందు (షోళింగర్) వేంచేసి యున్న నరసింహస్వామికి ఈ కావ్యాన్ని కవి అంకితం చేసినట్లు తెలుస్తోంది. ఈ కథ చదివిన, వ్రాసిన, వినిన "గలిమాయరహితులై కమలేశుకరుణ జను లాయుర్వృద్ధియు సంపదల్ నడసి ఘనులన దన ప్రఖ్యాతిని గాంతుర్" అన్న రాఘవాచార్యుని మాట సత్యము.

—ఉదయశంకర్

# విషయసూచిక

## నలచరిత్రము - పూర్వభాగము - అధ్యాయము 1

| విషయము | పుట సంఖ్య |
|---|---|
| వసుదేవుడు దమయంతికి స్వయంవరాగతులను వేర్వేఱ నెఱిగించుట | 77 |
| నలపంచకము | 78 |
| దమయంతి దేవతలను బ్రార్థించుట | 79 |
| దిక్పాలురు వరంబు లొసంగుట | 80 |
| నల దమయంతీ వివాహము | 81 |
| కలి యింద్రుని సభ కరుగుట | 83 |
| స్వయంవర వృత్తాంత మింద్రుండు కలి కెఱింగించుట | 84 |
| కలి కోపముతోఁ బ్రతిజ్ఞ నొనర్చుట | 85 |
| కలి విదర్భకేగి నలునియందుఁ బ్రవేశించుటకు సమయము వేచియుండుట | 88 |
| నలుఁడు నిషధకు భార్యతోడ నరుగుటకై మామ నడుగుట | 88 |
| భీమరాజు కొమార్తెకు ధర్మము లెఱింగించుట | 89 |
| దమయంతికిఁ దల్లి బుద్ధులు గఱపుట | 91 |
| నలుఁడు దమయంతితోడ నిషధ కేగుట | 91 |
| పౌరకామినులు దమయంతిని పొగడుట | 92 |
| దమనుఁడు పట్టణమున కేగుట | 93 |
| నల దమయంతి విహారము | 94 |

నలచరిత్రము - ఉత్తరభాగము - అధ్యాయము 3

| | |
|---|---|
| దమయంతి కుమారుని కనుట | 97 |
| కలిపురుషుడు చింతించుట | 99 |
| దమయంతి కుమార్తెను కనుట | 100 |

## అధ్యాయము 4

## అధ్యాయము 5

విషయసూచిక సంపూర్ణము.



శ్రీరస్తు

# నలచరిత్రము - పూర్వభాగము

## ద్విపద కావ్యము

---

### అధ్యాయము 1

క॥ శ్రీగౌరీ ప్రియపుత్రువి।
నాగమసం వైద్యులైన హరునిభవాని।
న్భోగీశ శయనులక్ష్మిని।
వాగీశుని వాణి మదిని బ్రస్తుతి సేతుఁ॥

శ్రీశారదాధీశుఁ జిరకృపావేశు
వాసవనుతవేషు వరభక్తపోషుఁ
బరమదయాకల్పుఁ బన్నగతల్పు
గరిరాజరక్షు శ్రీ కౌస్తుభవక్షుఁ
గౌరవకులశిక్షుఁ గంజదళాక్షు
వారిజాసనసేవ్యు వర్ణితదివ్యుఁ
బరిపూర్ణశుభగాత్రుఁ బరమపవిత్రు
బరమవైష్ణవ హృద్యుభగరోగ వైద్యు
దివిజకులాధారు దీనమందారు
భవపాపహరణు భూభామినీరమణుఁ
బతఁగ రాజతురంగుఁ బద్మాంతరంగు
సతతసద్గుణలోలు సత్యసంశీలు
దానవసంహారు ధర్మసంచారు
మౌనిమానసదీప్తు మహిసజ్జనాప్తు
నిరుపమజయబాణు నిత్యకల్యాణుఁ

గరుణాననోల్లాసు ఘటికాద్రివాసు
దేవాదిదేవు సందీప్త ప్రభావు
గోవిందనాథేంద్రు గొలిచి వేడుకను
క్షీరాబ్ధివరపుత్రి శ్రీజనయిత్రి
చారుబంధర వేణిసైకతశ్రోణి
కాముని తల్లి చక్కని కల్పవల్లి
రామాభిరామ నిర్భరపుణ్యధామ
అమిత గుణోపేతయఖిలైక మాత
అమృతవల్లెమ్మ మాయమ్మ పూబొమ్మ
చరణారవిందము ల్సన్నుతి చేసి
యిరవొంద భూతపురీశు యతీశు
శేషావతారు నంచితదయాకారు
పాషండకులదూరు పాపసంహారు
సరసనాసూరి కేశవగురుపుత్రు
చిరకీర్తి గంభీరు శ్రీభాష్యకారు
మతిలోన నుతియించి మఱి ప్రస్తుతించి
యతిభక్తితో మ్రొక్కియర్చించి గొల్చి
శ్రితజనాధారు నంచితకీర్తిహారు
సతతసద్గుణలోలు సత్యసంశీలుఁ
గంధర్వసంకాశుఁ గరుణానివేశుం
గందాళ గురుచంద్రు ఘనకీర్తిసాంద్రుఁ
బరమదయాకారు భక్తమందారు
సురనగసమధీరు సుజనవిహారు
వరపుణ్యచారిత్రు వాధూలగోత్రు
దురితఖండన శౌర్యుఁదొడ్డయాచారు
మరువక సేవించి మదిఁబ్రస్తుతించి

పరమయోగధ్యాన పరులైన మౌని
పరులకెల్ల నేను వరుసతో మ్రొక్కి
కరము పూర్వాచార్యగణముల గొలిచి
పరమవైష్ణవుల నేర్పడఁ బ్రస్తుతించి
సరసిజాసనురాణి జలజాతపాణి
సకల విద్యలమాత సద్గుణోపేత
ప్రకటిత శారదాంబను బ్రస్తుతించి
వ్యాసవాల్మీకాది వరమునీశ్వరుల
గనురమతితోడఁ బ్రస్తుతి చేసి
కవినాయకులనెల్లఁ గ్రమమునఁ దలంచి
దివిజపాలునకు సుస్థిరదయాళునకు
గమనవల్లభునకుఁ గమలనేత్రునకు
నమరారిహారునకు నాది దేవునకు
జలధివంద్యునకు భూజనసేవితునకు
నలువైన ఘటికాద్రి నారసింహునకు
నంకితంబుగఁ జేసి యవనిలోపలను
గొంకక యీకథఁ గోరిక సభల
వెలయ ప్రఖ్యాతిగా వేడ్కఁ జెన్నొంద
సలలితంబగు నాంధ్రశబ్ద సంగతులఁ
దెలిపెద నీకథ ద్విపద కావ్యమును
వలనొప్ప నలచక్రవర్తి చారిత్ర
విరచింతునా నేర్పు విధమున దెలియఁ
గరమొప్ప దత్కథాక్రమ మెట్టిదనినఁ
బరమపావనుఁడైన పాండునందనుఁడు
ధరనెల్ల నల్లజూదంబున నోడి
కౌరవాగ్రవుపాలు గావించి ద్వైత

ఘోరాటవులకుఁ బొక్కుచు నేగి యచట
దనతమ్ములను తాను దన కూర్మిసతియు
మునివేషములుదాల్చి మోదంబు రక్కఁన
విహరించుచుండిరి విధివశంబునను
మహిమతోడను భూతి మైనిండనలఁద
యురుదైన రుద్రాక్షహారముల్ వేసి
మెరయుక కెంజడలెల్ల నొగిఁజుట్టికట్టి
పరగఁ గృష్ణాజినాంబరమును దాల్చి
కరమునఁ జెన్నొందఁగా గమండలువు
ధరియించి జప మెన్నుదండఁ జేనుంచి
పరువడి వరయోగపట్టెను దాల్చి
ఘనతరంబుగ బాడుకలు వేడ్కఁ మెట్టి
మునినాథు లిరుపార్శ్వముల గొల్చి రాగ

## రాజ్యమోడిన పాండవులయొద్దకు బృహదశ్వుఁ డేతెంచుట

నరదార బృహదశ్వుడను మునీశ్వరుడు
కరుణతో వేంచేయఁగా జూచి పాండు
తనయుండు దమ్ములు దానును వేగ
చనుదెంచి యెదురుగా సంయమీశ్వరుని
చరణాంబుజములకుఁ జయ్యన మ్రొక్కి
యరుదు నర్ఘ్యపాద్యాది సత్కర్మ
వితతులఁ బూజించి వినతులు జేసి
యతిభక్తి గొనివచ్చి యర్హాసనమున
నునిచిచేతులు మోడ్చి గురుతరభక్తి
ననియె నమ్మునితోడ నారాజవిభుడు

పరమయోగధ్యాన పావనస్థాన
చిరదయానిధి మీకు క్షేమమే యనిన
విని మునీంద్రుఁడు ధరావిభున కిట్లనియె
జననాథ నీవంటి సత్య సంధుండు
గలుగుట క్షేమంబు గలుగునుగాక
నిల శ్రమమ్ములు మించి యేటికివచ్చు
ధరణీతరేశ నీతమ్ములు నీవుఁ
బరిణామమే యని పరికించి యడుగ
మనమునఁ జింతించి మతిపొందుసుతుఁడు
దనమది నొచ్చియత్తపసి కిట్లనియె
దేవ దయాసాంద్ర దేవేంద్ర వంద్య
యీవేళ మాసౌఖ్య మేమన వినుము
కపట జూదంబునఁ గౌరవేంద్రునకు
విపుల సంపదలెల్ల విడువఁగఁ గలిగె
నదియాదిగాగ నీయరణ్య భూమి
ముదమునుదక్కి యీ ముదితతోఁ గూడి
తమ్ములు నేనును దపసి వేషంబు
లమ్మల ధరియించి యిట్లుండఁ గలిగె
నాకఁటివేళకు నన్నంబు లేక
యాకులఁ గాయల నరసి భక్షించి
దినమొక్క యేఁడుగా దీనతబొంది
యెనసి యీ యడవిలో నిట్లుండఁ గలిగెఁ
బరతెంచి యష్టదిక్పతులను నైన
ధరలోన సాధింపఁ దగిన సోదరులు
శూరత్వములుమాని సుఖములు వదలి
ఘోరాటవులలోనఁ గూర్చుండఁ గల్గె

ద్రుపదనందన యిట్టి దుర్దశ నొంది
విపుల శోకంబున వేగింపఁ గలిగెఁ
జిత్రశయ్యలయందుఁ జెలఁగి నిద్రించి
పత్రశయ్యలయందుఁ బవళింప గలిగె
సంగీతవిద్యా ఘోషంబు లాలించి
సింగంపుగర్జనల్ చెవి వినవలసె
నలువైన సింహాసనమునఁ గూర్చుండి
కొలఁది కెక్కఁగ జాలఁగూర్చుండ గల్గె
నారామసీమల నలర వర్తించి
యారణ్యసీమల నడలంగఁ గల్గె
హితవుగ హితపురోహితులతోనుండి
మితిలేని మృగముల మెలఁగంగఁ గల్గె
వెలలేని కర్పూర వీడెముల్ చేసి
నలిసి యాకుల్ వేళ్ళు నమలంగఁ గల్గె
జాతిగంధము మేన సరవితోఁబూసి
భూతిగంధము మేనఁ బూయంగ గల్గె
నిటువంటి సుఖముల కిరవైతిమయ్యొ
కటకటాదయ లేక కౌరవాగ్రజుఁడు
మెఱుఁగక యిటుజేసె నే మనవచ్చుఁ
బరమయోగీంద్ర నాభాగ్యమిట్లుండెఁ
బట్టిపోయిన వారుఁ బుట్టినవారుఁ
బుట్టి బోయెడివారు భూలోకమునను
దాయాది వారిచే ధర నెల్లనోడి
పోయి మావలె వనభూమిలో నిట్లు
పొంది యీవెతలను బొందినవార
లెందైనఁగలరె మీ రెఱిగిన యెడల

ననవుడు మునిచంద్రుఁడా రాజుఁజూచి
ఘనకృపారస మొలుకంగ నిట్లనియె
ఇది యేమి జననాథ యింతగా నీవు
మదిలోన నిట్లాడ మరచితె నీతిఁ
బోపోమ్మ మఱియేమి బుద్ధులు మీకు
ప్రాప్తించె జింతింపఁబని లేదు వినుము
తొల్లి చేసినయట్టి దుష్టకర్మముల
నెల్లబొందక విధి యేల పోనిచ్చుఁ
గమలారిధరునకుఁ గమలగర్భునకుఁ
గమలేశునకు శతక్రతునకు నైన
గొన్నాళ్లు దుఃఖంబు కొన్నాళ్ళు సుఖము
కొన్నాళ్ళు లేమియుం గొన్నాళ్ళు కల్మి
వసుమతి సమముగా వర్తించుచుండు
వసుమతీశ్వర యింత వగపేల నీకు
నదిగాక యే దుఃఖ మందితి రిలను
ముదమొప్ప మావంటి మునులు మీకడకుఁ
జనుదెంచి నిత్యము సకల శాస్త్రములు
వినిపించెదరు మీకు వేర్వేఱ నింక
దమ్ములబాసితో తరుణిఁ బాసితివో
సమ్మతిగాని వేషమును జెందితివొ
కరిపురంబున నీవు గ్రమముతో నున్న
వరుసతో నచటికి వత్తుము మేము
పుణ్యవేళలయందుఁ బుణ్యతీర్థముల
బుణ్యుఁడై గ్రుంకుచుఁ బుణ్యముల్ చేసి
పితృ వేళల దనుబితృ కార్యములను
నతిభక్తితోఁజేసి యుఘములు ద్రోచి

లిటువంటి సుఖముల కిరవుగానుండి
కటకటా నీవు శోకముఁ జెందఁదగునె
వసుధనాపదఁ బడ్డవారలలోన
బొసగ నేయాపదఁ బొందితి విపుడు
జననాథ యింతటి సంతాప మేల
వినుము చెప్పెద నీకు విశదంబుగాను
నవనిలో నల నాముఁడగు రాజు కలఁడు
ప్రవిమల సత్యసంపన్నుఁడు ఘనుడు
వినుతికెక్కిన బాహువిక్రమోన్నతుఁడు
వినయ భూషణుడతి విమలమానసుడు
గురుభక్తినిరతుండు గుణవిశారదుడు
కరుణాపయోనిధి గాంభీర్యధనుడు
ధరణి షోడశమహాదాన వినోది
యరుదైన సకల శాస్త్రార్థకోవిదుఁడు
చిరపుణ్యమతి వీరసేనునిసుతుఁడు
తరణివంశజుండు కందర్పసన్నిభుండు
నిరుపమవిజయుండు నిషధేశ్వరుండు
పరమపావనుఁడు శ్రీపతి భక్తియుతుఁడు
సురరాజవిభుడు భూసురవర్ణనీయుఁ
డరిబలగహనమహానలుం డట్టి
నలుని కిల్లాలునై నలినాయతాక్షి
యలివేణి దమయంతి యనియెడియింతి
పరగుఁబతివ్రత బహుగుణాభరణ
కరిరాజగమన చక్కని చంద్రవదన
తనయుడు వంశవర్ధనుఁ డొక్కరుండు
తనయయొక్కతయు దగఁ గలరతఁడు

నిల నేడుదీవుల నేలెడురాజు
వల నొప్ప పుష్కర వసుధేశుతోడ
నవనీశ నీవలె నన్యాయజూద
మవిరళంబుగ నాడి యటమోసపోయి
పురవరం బెడఁబాసి భూములఁబాసి.
తురఁగంబులనుబాసి దొరలనుబాసి
ఘనరథంబులఁబాసి గజములఁబాసి
ధనములఁబాసి ప్రధానులఁబాసి
వరపుత్రులనుబాసి వనితనుబాసి
పరమాప్తులనుబాసి భటకోటిఁబాసి
సకల బంధులఁబాసి సకలంబుఁబాసి
చకితాటవులకేగి చానతోఁగూడి
కట్టఁబుట్టములేక కాంతపై గొంగు
కట్టుక నడవిలో గడుదుఃఖమంది
యాఁకలిచేఁ జాల నలబడిపడుచు
నాకులు కాయలు ఫలము భక్షించి
కలిరాజు పన్నిన ఘనమైనమాయ
దెలియకిద్దఱు రెండు తెరవులు భక్షించి
తరళాక్షి నెడఁబాసి ధరణీశుడెడల
ధరణీశునెడబాసి తరళాక్షియడలఁ
దమ్ముగొల్చినవారిఁ దాము సేవించి
యిమ్ములనుండిరి యిలగొంతకాల
మరిగిన విదప శ్రీహరి కృపచేత
మరురాజ్యసుఖమున నుండిరి తొల్లి
యందు సహస్రాంశ మైననుగలదె
యిందు వంశజనీకు నెనసినకష్ట

మనవు డనాశ్చర్యమంది యారాజు
ఘనభక్తి మునిరాజుఁ గనుఁగొని పలికె
వరమునినాథ నావలె నలాధిపుఁడు
ధరనెల్లఁ గల్లజూదంబున నోడి
యిటువంటియడవికి నెబ్భంగిఁబోయె
పలుకున నిట్టిజూదంబులుమున్ను
గలిగియుండుటఁజూనెఁ గౌరవాధిపుని
దలఁచిపల్మారు దూరఁదగదింక నలుని
చారిత్రమంత్రయు సాంగంబుగాను
గారవంబున వినఁ గడువేడ్కఁబుట్టె
వినిపింపు మనిన భూవిభుఁజూచి యపుడు
తనమదితో బృహదశ్వమహర్షి
యానందమునుబొంది యంబుజోదరుని
ధ్యానించి నలుని సత్కథఁ జెప్పఁదొడఁగె



# కథాప్రారంభము

## బృహదశ్వుడు పాండవులకు నలుని చరిత్రమును జెప్పుట

శ్లో॥ కర్కోటకస్య నాగస్య దమయంత్యా నలస్యచ।
ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలినాశనమ్॥

నిరుపమగతినొప్పు నిషధాపురంబు
అరయఁగ నుతికెక్కినట్టి పట్టణము
శ్రీకరనవహేమ చిత్రగేహములు
ప్రాకారగోపుర ప్రాసాదతతులు
కనకంపుమేడలు ఘనమండపములు
వినుతింపదగిపట్టి విఫణిమార్గములు
కోటలు యట్టళ్ళు కొలువుకూటములు
నాటకశాలలు నలినదీర్ఘికలు
కేళికావనములు కృతకాచలములు
బాలానిలంబులు బహుపుష్పతతులు
మహనీయ దేవతామండపంబులును
బహుచిత్రగతులచేఁ బరగుహర్మ్యములు
శృంగారవనములు చెఱకుతోఁటలును
సంగీతనిలయము ల్సరసులు మఱియు
రంగుమీరినయట్టి రజితశైలములు
చెంగావిటెక్కముల్ చిత్రశాలలును
క్రొమరారుముత్యాల గొడుగులు మఱియు
గమనీయవజ్ర సంగతకవాటములు
వారణశాలలు వాజిశాలలును

మేరుశైలముకన్న మించుతేరులును
పచ్చతోరణములు బహువిలాసములు
నచ్చుగా గొప్ప ముత్యములముగ్గులును
విమలభూషణముల విహరించుహారులు
నమరభూజములతో నమరినతరులు
వారాశి కిరవైనవరతటాకములు
చారురత్నంబుల సౌధవాటికలు
వేదశాస్త్రపురాణవిద్య లన్నిటికి
నాదియై వర్తించునట్టి భూసురులు
రాజులు బలపరాక్రములు రౌతులును
భూజనసుతులైన బుధులు బాంధవులు
ధనధునిపురినైన ధరయెల్లఁ జూఱ
గొని దాచఁగల వైశ్యకోటి చెన్నొంద
హరిభక్తి యుక్తులైనట్టి శూద్రులును
సరసులు సత్కవీశ్వరులు పాఠకులు
కాముకులును వారకాంతాజనంబు
కామితార్థము లెల్ల గలుగునంగళ్ళు
నానావినోదముల్ నడుపునాటకులు
మానితపతిభక్తి మతులైనసతులు
మదనుని మించినమగలును మిగుల
మదగజంబుల నిల్పుమల్లులు గలిగి
పురుహూతుఁడేలెడి పురమొక్కొయనగ
ధరణీదేవికి ముఖదర్పణంబనఁగఁ
బురములకెల్లను భూషణంబగుచు
నిరుపమగతి నొప్పు నిషధాపురంబు

ఆపురాధీశ్వరుఁ డమలమానసుఁడు
భూపాలచంద్రుడు భుజబలోన్నతుఁడు

సలుడు రాజ్యమేలుట

గర్వితరిపుగజ కంఠీరవుండు
సర్వజ్ఞుఁ డత్యంతసాహసోన్నతుఁడు
నాకేశనుతకీర్తి నలచక్రవర్తి
యేకచక్రంబుగా నిల నేలుచుండ
వారక నెల మూఁడువర్షముల్ గురియు
జారులు లేరనాచారులు లేరు
విరసంబు తిరిపెంబు వెతకినలేదు
పరుసతో గలహించువారును లేరు
అంగహీనులు లేరరసిచూడఁగను
సంగజాకైవడి సమరి యుండుదురు
నూఱుమాడలకు మున్నగ రూకవడ్డి
యేఱుకిర్యదినాలు గెద్దులుదున్నఁ
బదిహాళ్ళకొకపాలు పార్థివేంద్రునకుఁ
గొదుళతొమ్మిదిపాళ్ళు గొనుబంటకాపు
లొలయుచిఁ బుట్టికి నొకరూక పన్ను
గలిగివర్తించు నాకాలంబునందు
నిల నవగ్రహదోష మెన్నఁడు లేదు
పలుమారు మన్నశ పండువస్యములు
గోవులు పితుకక గురియుచునుండు
నేవేళభూమి పాశేలు గలిగి
గూర్చి సస్యంబులఁ గూడురహించి
ధర్మంబు నాల్గుపాదమ్ములనడుచు

హరిహరబ్రహ్మాదు లద్భుతంబంద
హరువుగా నేఁబదియాఱుదేశముల
ధరణీశ్వరులచేతఁ దగినపట్ణముల
నిరవొందగా కొని యిలనేడుదీవు
లెఱుగగాయక పురోహితులు నాశ్రితులు
పరమపావనులైన బ్రాహ్మణోత్తములు
మతిమంతులైనట్టి మంత్రిపుంగవులు
నతిభక్తితోఁ గొల్వ నా విష్ణుచక్ర
మరయుచు పంపుసేయ గనలాధిపుఁడు
చిరలీలరాజ్యంబుఁ జేయుచునుండె

## గోవ్యాఘ్రసంవాదం నలుని సత్యనిదర్శనము

అంతట నాదేశమందొక్క యెద్దు
వింతగా నడవిలో విహరించుచుండ
గనుగొనియొక్క వ్యాఘ్రంబోర్వలేక
మనమునఁగోపంబు మల్లడిగొనఁగఁ
బలికెనోహోయింత భయమునులేక
వెలయనాయడవిలో విహరించుటెట్లు
చెలరేగి యేను ఘర్జించితి నేని
యిలమృగసంఘంబు లెల్లభీతిల్లు
నీబాహుబలమెంత నీశౌర్యమెంత
నాబాహుబలిమికి నరులెంతవారు
కలగక నన్నింత గైకొనకీవు
నరెదు బలిమిమై యందులకేమి
ధారుణి నలుని సత్యంబునఁగాదె
యీరీతి గర్వించు టిదియెంత నాకు

వలరాజుసత్య మెన్నాళ్ళువర్ధిల్లు
నిల నిట్టిరాజేంద్రు లెందఱోతొల్లి
యేలిపోయినవార లీ నలుండెంత
కాలంబు రాజ్యభోగమున వర్తించు
నేవిధంబున నైననే నిన్నుఁబట్టి
వావిరిగోళ్ళచే వడిఁదాక్కాణించి
గొబ్బున గుత్తుకఁగొఱికి రక్తంబు
నుబ్బుచు మఱిగ్రోలకున్న నేపులికి
బుట్టినవాఁడనే పొందుగానీకు
బుట్టినవాఁడ నీపుడమిలోపలను
నని యిటుపులివల్క నంతలోపలను
ఘనవృషభేంద్రుండు ఘర్జించిపలికె
నోయి వ్యాఘ్రమ మనకు నుచితమా యిదియు
న్యాయంబుదక్కి యన్యాయవాక్యంబు
పలికితి నామది భయమేమి నాకు
నిలలోన నానలోర్వీశురాజ్యంబు
నేయంగ నిటువంటి నేతులునీకుఁ
బాయకపలుకంగఁ బంతమానాతో
నీయాస నిటువంటి నీతులు దప్పి
పోయెడివేళ కీబుద్ధి పుట్టించి
పలికించెనో విధి పాపంబునాక
నులికుల్కి పడనేల నుర్విలో వినుము
ఎలుకలుపిల్లలు నేనుగుల్ మఱియు
వలనొప్పిసింహముల్ వైరంబులేక
ఇచ్చవచ్చినచోట నీవనంబునను

మత్సరంబులులేక మహినివర్తించు
ననవిని వ్యాఘ్రంబు నంత గర్వించి
దినచాథుసాక్షిగా దిందు విన్నిపుడు
ఎన్నగా నీ సత్యమిప్పుడు వచ్చి
నన్నె మీ సేయును సమరంగ ననుచు
నాగ్రహంబున లేచి యావులించును
వ్యాఘ్రంబవృషభంబు సిద్ధించె మనకు
ననియెంచిపైరాగ నంతలోపలను
ఘనగిరు లదర దిక్కరులెల్ల బెదర
సురలరుదంద రక్షోతతి గుంధ
నరులు చింతిల్లఁ గిన్నరులు భీతిల్ల
దివిజులు వెరగంది దివినుండిచూడ
భువియెల్లగదల నంబుధులెల్లగలగఁ
ఘనుపర్యతోడ గంభీరంబుతోడ
వినువీథిఁబరతెంచి విస్మయంబుగను
నరగున నావిష్ణు చక్రంబు తొల్లి
కరిగాచి నక్రంబు ఖండించినట్లు
తక్కక వ్యాఘ్రంబు తలద్రుంచివైచి
గ్రక్కున గమలాక్ష కడకు నేతెంచె
నిటుగాన నారాజు నతుల సత్వమునఁ
బటుగతిదోషము ప్రబలంగనీక
యతివేడ్క రాజసూయాశ్వమేధాది
క్రతువులు చేసియుఁ గమలాసనాది
దేవతలెల్లఁ గీర్తింప శోభిలుచు
నీవిధంబున జగం బేలుచునుండె

## వసంతఋతు వర్ణనము

నంతటఁ గొన్నాళ్ల కతిచిత్రముగను
సంతతగతిని వసంతకాలంబు
చనుదెంచె మందార జంభీరములును
బనసపిప్పలనింబ పారిభద్రములు
చందన పున్నాగ సహకారములును
గుందకురంటక కోవిదారములు
లుంగలవంగ మాలూరవృక్షములు
సంగతఖర్జూర చంపకంబులును
సురపొన్నలును మంచిచూతపోతములు
కురువంకంబులు గేదగులు శోకములు
పుల్లమామిళ్ళుఁ గర్పూరవృక్షములు
నల్లని యరఁటులు నారికేళములు
నారద పాటలి నాగతింత్రిణులు
గోరెంటలరఁటులు కుటజభూరుహము
లాదిగాఁగలిగిన యారామభూమి
పొదుగా నప్పుడేర్పరుపంగ నాకు
రాలియొక్కట నతిరమ్యమైయుండి
యాలోనఁజిగరించె నంతలోఁగానె
పూచె ఫలించెఁబుప్పొడి చల్లగాలి
వీచె నేలను వ్రాలె వింతవింతగను

### హంసలు నేలకు వ్రాలుట

పరుమారు బలుమారుఁ బచ్చవిల్తుండు
అలరుపువ్వులచూపు లందందనేయఁ

బడపడంపుజాయఁ జొప్పడునాసికమును
నవహేమ మయమగు నవ్యపక్షము
విమలస్వరంబును విమలనేత్రములు
నమరంగ ధవళమయంబగు మేను
నరుదుగాఁ గనుఁగొని యవనీశ్వరుండు
సరసతోఁజేయు వసంతునిపూజఁ
గడువేడ్కతోఁజూడఁగా వచ్చెననఁగ
నుడుతతిదివినుండ నొల్లకయిపుడు
వసుమతిపై నుండవచ్చెనో యనఁగ
బౌసగసంబరలక్ష్మి పూనుముత్యాల
హారంబుజారెనో యవనికి ననఁగ
క్షీరాబ్ధితరగలఁ జెన్నువహించి
యాకాశముననుండి హంసలపిండు
భూకాంతుముందరఁ బొదలుచు వ్రాలె
వ్రాలినజూచి భూవరుడు హర్షాబ్ధిఁ
దేలుచు సదవుఁ బ్రీతిని నిట్టులనియె

నలుఁడు హంసను పట్టుట

నెందుండి వచ్చెనో యీరాజహంస
లందంబుఁజూచిన నతివేడ్కపుట్టె
నొకయంచ బట్టుక యూరక మనము
సకలంగతిని ముద్దాడుదమనుచు
నతివేడ్కలేచి యయ్యంచలకడకుఁ
గుతలేశుఁ దేగినఁగొబ్బున నెగసి
యవ్వలవ్రాలిన నపుడుపోనీక
యెవ్విధంబుననైన నేబట్టెఁ దనుచుఁ

గదసిమిక్కిలిగుతుకం బుల్లసిల్లఁ
బొదలినమతిఁబొంచి పొంచి పోవంగఁ
గనిపక్షులన్నియుఁగడు భీతిఁబొంది
చనియొక్క మ్రానిపైఁ జయ్యనవ్రాలె
వ్రాలినగతిఁ జూచి వసుధేశ్వరుఁడు
వీనిబట్టుట కెద్ది వెర వింకమనకుఁ
దలఁగకదొలఁగక దనరెడునేర్పు
దొలగక మ్రానెక్కితోలుము నీవు
పనుపడ నేనట్టె పట్టెద ననుచు
ననిన నాసచివుండు నాభుజమెక్కి
యనిరక్తిపక్షుల నదలింప నవియు
మనమున చెదరుచు మహిమీనవ్రాలె
వ్రాలినగనుగొని వసుమతీశ్వరుడు
పాలించి తన మంత్రివరు మోముజూచి
దిగివచ్చి నీ వొకదిక్కునసుండి
తగిలిన పులుఁగులఁ దయతోడ బుట్టు
మనవడుభూరుహ మాతండుడిగ్గి
గొనకొని యొక్కొక్కనసుండి దండి
యనురక్తిఁ బక్షుల కడ్డమైనిలువ
మనుజేశ్వరుఁడు వాని మఱిపోవనీక
యల్లనల్లన మహికరుదెంచి పొంచి
మెల్లన యొకదాని మెడఁబట్టుకొనియెఁ
గడువేగమున లేచి కడమరాయంచ
లడలుచు యొక భూరుహంబున వ్రాలె
జెలువంద నలరాజుచే జిక్కువడ్డ
పులుగులరాజు సొంపుడిగి భీతిల్లి

పలుమారు దలపోసి భావంబులోనఁ
గలఁగుచు మేము నిక్కడికి నేతెంచి
తటుకున వీనిచేఁ దగులందఁగలిగె
గటకటా యీరీతిగాఁ జేసినట్టి
బలువైన నా వ్రాత ఫలమునేమందుఁ
బలమున ననురాజసంబున నృపతి
యేమేమి సేయునో యెఱుగంగరాదు
యేమయిన మేలింక నేమనవచ్చు
నని హంస చింతచే నడలఁగానాతఁ
డనురక్తితో రాజహంసను జూచి
కౌనగోరదువ్వి మక్కువ ముద్దుఁబెట్టి
యొనరంగకన్నుల నొత్తిలాలించి
యక్కునఁజేర్చి తియ్యనిమాటలాడి
చెక్కులినొక్కి మచ్చికజేయుచుండ
గనుఁగొని సంతోషకర మగునట్లు
మనుజేశుతో హంస మధురతఁ బలికె
నవనీశ దమయంతి యనియెడికాంత
నువిదఁజేసెద నీకు నొగి నన్ను విడువు
తగు నీకు దమయంతి దమయంతి కీవు
తగుదువు నామాట దబ్బరగాను
సారసభవుఁడు నీ సౌందర్యములకు
ధీరున భువిదానిఁ బుట్టించెమున్నె
యేగతినైన నాయింతిని దెచ్చి
భోగదేవేంద్ర నీపాలతిఁ జేసెదను
తలకొని యీవేళ తగనట్టిమాటఁ

బలికి పోఁజూచెడి పక్షినిగాను
యీపక్షిచేత దాటనేమౌనటంచు
భూపాలచంద్ర నీబుద్ధినుంచకుము
నీచక్కఁదనమును నీవిలాసమును
నాచకోరాక్షికి నమరు భూనాథ
నామాట నిజముగా నమ్ముము మదిని
గామిని నీసొమ్ముగాఁ జేయనేర్తు
దమయంతి నీచక్కదనమునుఁ దలచి
సుమబాణవేదన స్రుక్కియుండియును
నీపాద పద్మముల్ నిరతంబు గొలువ
నాపద్మగంధి నీకతివఁజేసెదను
గమలాక్షునాన నాకన్నులయాన
దమయంతి నీయింత కప్పుదీమాట
నావుడు ముదమంది నరలోకనాథు
డావేళ నాశ్చర్యమంది యాపక్షి
నతివేగవిడిచి నెయ్యమున నిట్లనియె
నతివేడ్కతోడ నీవాడినమాట
వినఁగ నాచెవులకు విందయ్యె నేఁడు
నెనయ నాదమయంతి నేగతి నీవు
నెఱుఁగుదువిలలోన నేరాజపుత్రి
తెఱగొప్పవనములోఁ దిరిగెడి మీరు
రాజకన్యకరవర్తన మెఱుందుగురె
రాజసాంసోత్తమ రమణీలలామ
నెలమి నాయింతిగా నెట్లుజేసెదవు
తెలియంగజెప్పుమా తెరఁగెల్ల మాకు
హంసరూపంబున నరుదెంచి మున్ను

కంసారిజలజాక్షి గరుణించినట్లు
హంసరూపంబున నతివేడ్క నాకు
హంసవాననుగూర్ప నరుదెంచితివొ
పాలును నీరును వేర్పఱుపంగ నేర్పు
చాలినపక్షి రాజవుగావె నీవు
మనుజ భాషలరీతి మహిలోనఁబక్షి
కెనయంగ బలుకనే యెక్కడనైన
పక్షివిగావు నాపాలిదేవతవు
యీక్షితిలోన నాయేలనాగజనన
మంతయు నెఱింగింపు మనవుడు పక్షి
వింతగా నారాజవిభున కిట్లనియె.

దమయంతి చరిత్రమును హంస నలునికి కెఱింగించుట

దరణీశ వినుము విదర్భపురంబు
కరమర్థిజగతిఁ బ్రఖ్యాతమైయుండు
నాపురాధీశ్వరుఁ డమలమానసుఁడు
భూపాలచంద్రుఁడు పుణ్యవర్తనుఁడు
భీమభూపాలుఁ డభేద్యుడుత్తముఁడు
శ్రీమించరాజ్యంబు నేయుచునుండె
ధరణీశ్వరునకు సంతానంబులేక
ధరణీమరార్చనఁ దప్పకచేసి
తపమును జపములు తగిన దానములు
నుపవాసములు పెక్కు లొనరించి యలసి
కడలేని దుఃఖసాగరమున మునిఁగి
పుడమీశుఁడా స్థానమునకు నేతెంచి
యరుదైన రత్నసింహాసనోపరిని

నిరవొంద గూర్చుండి హితపురోహితుల
గాయక వందిమాగధ మంత్రివరుల
నాయతమఁజూచి యప్పు డిట్లనియె
వినుఁడు సంతాన మేవిధమునఁ గలుగు
నని భూసురావళి నఖిలధానముల
నొనరించితిని మఱి యుచితమార్గమునఁ
దనరియెందులను సంతతి లేకపోయె
నిరవొంద సంతానహీనుడై నట్టి
నటునకు దూరమౌ నాకేశపదవి
సుతులను బడసినఁజూచియందందఁ
బితృదేవతలు సంప్రీతి బొందెదరు
వసుధనీతనువు నెవ్వరు నమ్మినారు
పొసఁగిన యీరాజ్య భోగ్యంబుల లేల
మనమారఁ దనయుల మధుర వాక్యముల
వినగనేర్చిన యట్టి విమలాత్ముల కును
వీణామృదంగాది వివిధ స్వరములు
వేణునాదములైన విననింపుగాను
విడువ కిప్పుడు మునివేషంబు దాల్చి
తడయక నేను సంతానార్థినగుచు
దరుణితోఁగూడుక తపమున కరిగి
వరగంగఁబుత్రులఁ బడసి వచ్చెదను
మంత్రి కోవిదులార మహిమ నారాజ్య
తంత్రంబునడపుడు గత నేను వచ్చు
నందాక యని పల్కి యపుడు భూసురుల
నందర రావించి యతిభక్తి మ్రొక్కి
భటపరిచారక ప్రకరంబులకును

చటుకునఁ దనదు వృత్తాంతంబుఁ జెప్పి
పుడమిగాఁపులకు నేర్పడబుద్ధి సెప్పి
పడతియుఁ దానును బరమహర్షమున
జెలువు మీరఁగ నారచీరలు గట్టి
తెలిభూతిమైనిండ దిరముగా నలఁది
కురులెల్ల జడలుగాఁ గూడంగఁ జేసి
పురమువారెల్ల గుంపులుగట్టి చూచి
యౌరాయనంగ ఘోరారణ్యమునకు
ధారుణీభర్త మోదంబున నరిగి
ఫలములు దళములు భక్షించి కొండ
బిలముల నివసించి క్షితిల కిట్లు
కొన్ని దినంబులు ఘోరాటవులను
గ్రన్నన విహరింపఁగా నొక్కనాడు
తన శిష్యగణముతో దమనమునీంద్రుఁ
డనురక్తి మీఱఁగా నచటికి వచ్చె
వచ్చిన మునిఁగాంచి వసుమతీనాథుఁ
డచ్చుగా సాష్టాంగ మప్పుడర్పించి
పలుమారు మునినాథుఁ బ్రస్తుతిజేయ
దలపునమెచ్చి యాతపసి యిట్లనియె
నెక్కడ విహరింతు రెప్పుడు మిమ్ము
నిక్కాననంబున నెన్నడుఁ గానఁ
దలపోసి చూచినఁ దాపసవృత్తి
కలిగియున్నది రాజకళలు మీయందు
నమరియున్నది మీర లడవిలోనిట్లు
క్రమమున విహరింపఁగా నేలమీర
లెవ్వరో యనినఁ భూమీశుఁడా తపసి

కవ్విధంబంతయు నటుఁజెప్పఁ దొడగె
దాపసవర్య విదర్భపురంబు
నేపార మీదయ నేలెడువాఁడ
నీపద్మగంధి నాయింతియై మెలఁగు
నాపేరుధర భీమనరనాథుఁడండ్రు
పరగ సంతానసంపద లేక నాకు
ధరణిఁ బాలింపంగఁ దగదటుగానఁ
దపసి వేషముదాల్చి తరుణితోఁ గూడఁ
దపము సేయగమది దలఁచి వచ్చితిమి
నావుడువిని మునినాథుఁ డాభీమ
భూవల్లభునిజూచి పొలుపొంద బలికె
భూమీశ మానవంశునకు నేతెమ్మ
తామసింపక నేను దపముగావించి
వనజాసనాది దేవతలచే వరముఁ
గొనివచ్చి యిచ్చెదఁ గొదువ లేకుండ
ధరణీశయంత సంతానంబు వడసి
యిరవొంద పురమున కేగుడుగాక
యని తోడుకొంచు నిజాశ్రమభూమి
కనురక్తిఁజనుదెంచి యతిఘోరతపము
గావింపఁగా మెచ్చి కంజాతగర్భుఁ
డావేళఁ దనకుఁ బ్రత్యక్షమై నిలువ
మునికుల చంద్రుండు ముదమంది బ్రహ్మ
గనిసన్నుతులుచేసి కమలజుఁడనియె
నిదియేమి మునినాథ యింతగా నీవు
పదపడి ఘోరతపంబు గావింప
నేమి కార్యమువచ్చె నెఱింగింపుమనిన

భీమనాముండనఁ బ్రియశిష్యుఁడొకడు
లోకేశ గలఁడు భూలోకనాయకుడు
ప్రాకటంబైన సంపదలెల్లబాసి
సంతతి లేనివిచారంబుతోడ
నింతియుదాను మాయెడ కేగుదెంచె
సతనికి సంతాన మర్థితోనిచ్చి
యతివేడ్క రక్షింపు మనవుడు బ్రహ్మ
పొలుపుమీరఁగ నొక్కపుత్రి పుత్రుండు
ంరనిచెప్పి వేగంబున నరిగె
నంతటఁ దమనమహామునీశ్వరుఁడు
వింతగా భీమభూవిభుని వీక్షించి
కుతలేంద్రదనీకొక్క కూఁతురుకొడుకు
నతివేడ్కఁగల్గుదు రరుగుముపురికి
ననవుడు సంతోషమన్ది యారాజు
మునినాథునకు వేడ్క మ్రొక్కి యిట్లనియె
దమనమునీంద్ర నీదయచేత నాకుఁ
గ్రమముగ సంతతి కలిమియుంగలిగె
ననిసన్నుతులు చేసి యవనీశ్వరుండు
తన సతితోడను దన పురి కరిగి
ధర యేలు చున్న నాతదనంతరముల
బరువడి వారాజపత్ని గర్భంబు
ధరియించి ముందర దవయుని గాంచెఁ
దెఱం గొప్ప మఱికొన్ని దినముల వెనుక
తనయను గాంచె నా తారలాయతాక్షి
జననాథ చంద్రుఁడు సంతోషమంది

దమనాఖ్యుడను పేరు తనయున కొసగి
దమయంతియను పేరు తనయకు నొసగి
కొడుకన్నను ముద్దుకూతురిమీద
ఎడమీఱ దతివేడ్క బొలుపొందుచుండె
క్షీరాబ్ధికన్నియ చెలు వందిలెట్లు
మేరుభూధరపుత్రి మెలగుచున్నట్లు
తరుణి వర్ణించ సౌందర్యసంపదను
ధరణీశ యిబ్భంగి దమయంతి పుట్టు
నెఱుఁగుదు మున్నె నే నేగతిదయిన
నిరవొందదాని నీయింతిఁ జేసెదను
మానవాధీశ యామగువ నీసొమ్ము
నేనాడుమాటను నిజ మని నమ్ము
మని యంచ పలికిన దంతయు రాజు
విని మనంబుఁ జాలవిస్మయంబంది
వెలువిడినానంద బాష్పముల్ కనులఁ
బలుమారు దొరుఁగ నాపక్షి వల్లభుని
జేకొని కౌఁగిటఁజేర్చి ముద్దాడి
భూకాంతుఁ డప్పుడా పొలతిదగ్గరకు
నతివేగఁ బోయిరమ్మని వీడుకొలుప
శతపత్రములక్రీడ సలుపు హంసలను
దయమున నాహంసరాజుఁ గూడుకొని
పయనమై యాత్రోవబైనంబు నిలుపు
సేయకనలుని కాచెలఁగూర్చు తలపుఁ
బ్రోయరభూమి కాంతునిమీద భక్తి
బాయక యాకటఁబడి తమ్మితూండ్లు
మేయక నీడల మెలఁగవేగ

భూవలయంబునఁ బోలుపొందునట్టి
యావిదర్భాపురి కరుగుచునుండె
నచ్చట దమయంతి యతివలఁ దాను
విచ్చల విడివన వీధికివచ్చి

దమయంతి వనవిహారం బొనర్చుట

కలయంగ శుకశారి కలమయూరములు
పలుకుచుండగ వానిపలుకులు వినుచు
బూచికాచిన మంచి పుష్పవృక్షములఁ
జూచి యింతులకును జూపి నవ్వుచును
లలరులతేనియలంది గ్రోలుచును
నలరుపూఁజిగురుల నరసినవ్వుచును
నల్లనిగాలికి సంతోషపడుచుఁ
బిల్లవంటుల వెల్లఁ బరికించి కొనెడు
చెలులనోనమిటారి చిలికికటారి
చెలువులనంకి వాసనలపూ తెండి
చెలియల మేల్బంతి చిత్తజుదంతి
వలపులదొంతి సేమంతిపూబంతి
మరునిపట్టపుఁజిన్కా మరువంపుమొల్కా
యరుదుపుప్పొడిదిన్నె యమృతంపుగిన్నె
కమ్మ తావులరావుకళలకు నెలవు
కమ తేనియబావికపురంపుఁ గ్రోవి
సొగసువజ్రపుందళ్కు సొబగులబెళ్కు
పగడంపులకకూన పన్నిటి సోన
చిలుకలకొల్కి యాచిగురాకుములికి
కులకుముద్దులగుమ్మ గొజ్జంగిరెమ్మ

యని చాల గొనియాడ నన్నిఁట దగిన
వనజాక్షి శృంగార వనములోపలను
గదిసి కెంపులురవల్ కాంతులఁ జిమ్మ
నుదుట బంగరు సొమ్ములొడలన్దు మెరయ
లజ్జలోచన లగుసఖులున్గొలువ
నలరుచు దమయంతియతి వేడ్కమేను
దెలియని గతివినోదించుచు నుండఁ
గలహ నలవుడు వేగంబున వచ్చి

హంసలు దమయంతి ముందు వ్రాలగా
దమయంతి నలునిచేఁ బట్టువడిన హంసను పట్టుకొనుట

రమణులతోడ సంభ్రమకేళినుండు
దమయంతి యెదుట నన్దముగాను వ్రాలె
నెలఁతచేనడకల నేర్చుకోఁ దలచి
కలహంస లీరీతిఁ గదివెనో యనఁగ
వ్రాలిన యంచల వలనొప్పజూచి
మేలని దమయంతి మెల్యతలుదాను
నప్పుడు గనుఁగొని యాశ్చర్యమంది
యొప్పుల కుప్పలై యొప్పిచెలంగు
నారాజహంసల నపుడు పోనీక
బోరనఁదరుముక పోయి యందందఁ
బొలఁతులందఱు పొంచి పొంచి పోనీక
చలమున నన్ని యంచలఁ బట్టిరంత
యారాజనందన యారాజరాజు
కోరిపుట్టినయంచఁ గొబ్బునఁ బట్టి
యుక్కునఁగదియించి యొదలనిమిరి

చెక్కిలినొక్కి మచ్చిక ముద్దుబెట్టి
మెల్లన దువ్వుచు మృదులోక్తులాడ
యల్లనగనుగొని యాయంచపలికె

హంస దమయంతితో నలుని
రూపగుణాతిశయంబులఁ దెలుపుట

మానవభాషల మధురమై యలర
మానిని నీకొకమాటఁ జెప్పెదను
విడువుమీ నీకొక వేడుకగలుగు
పడఁతి నీరూపు సంపదఁ జూచి నాకుఁ
గడువేడ్కపుట్టె నిక్కువము. నామదికి
నుడుగక వినుము నీకొకటి చెప్పెదను
రంగైన నిషధాపురం బేలురాజు
శృంగారవంతుఁ డూర్జితసత్యధనుఁడు
నరలోకనుతకీర్తి నలచక్రవర్తి
కరమొప్పవిష్ణు చక్రముపంపునేసి
నిలనేడుదీవుల నేలెడు రాజు
నలకూబరుని కన్న నలువిల్తుకన్న
సరసిజభవుకన్న పలజాప్తుకన్న
హరికన్న బలిదైత్యహరుకన్న మించి
ధరణిఁ జెన్నొందును దరలాక్షి నీకు
సరిమైనవాఁడమ్మ సౌందర్యరేఖ
రమణ నేఁజూడని రాజులులేరు
రమణివో యటువంటి రాజునుగానఁ
గలకంఠి నీవంటి కామినీమణికి
వెలయంగ నలరాజు విభుఁడు కావలెను

నాకుఁజూడఁగనో నలినాయతాక్షి
చేకొను నలుని నీచెలువుఁడుగాఁగ
నలునికన్నను మంచి నాథుడులేడు
నలువరగఁ బదునాల్గులోకముల
వనితదబ్బర లాడువారముగాము
కనివచ్చి తిటకు నాకన్నులయాన
వారికిఁదగు దీవు వర్ణింపనేల
మానిని నీరూపము మహిమనుఁదగిన
వాఁడు గావున నిట్లు వర్ణింపవలసె
నేఁడు నీదగ్గర నెలఁతరో వానిఁ
బొసఁగిన బంగారు బొమ్మను దెచ్చి
మసిపాతకట్టుట మాకు సమ్మతమె
ధరలోన నోములుఁ దగి దానములు
చిరభక్తిపూజలు సేతురు మంచి
పతులు గావలె నంచు భామినీమిన్న
లతివరో నీదుభాగ్యమ్మన కేమి
కొదువ నీనాథుఁడీ కువలయాధీశుఁ
డదిగాక వినవమ్మ యవనిలోపలను
నలరాజు చక్కని వాఁడంద్రు జనులు
చెలియాయనంగు మించినవాడు నలుడు
కలికిమారుఁడు నీటుకాండను టింతె
తలపులోపలనాని దలంచి చూపనను
దురితకర్ముడు శివద్రోహి దుర్జనుఁడు
హరికుమారుఁడుగాన నతనికిఁ జెల్లె
నదిగాక వినవమ్మ యామహీశ్వరుఁడు
పదపడి హరిహర బ్రహ్మాదిసురులు

దీవింప నిల నేడుదీవుల నేలుఁ
గావున వాని చక్కఁదనంబుఁ దెలుప
నాపంకరుహ యోనికైన శక్యంబె
యోపద్మనయన నీ కొప్పునాఘనుండు
పతిఁగోరి యతివరూపమున జన్మించు
పతి వానిఁ బొందని జన్మమేమిటికి
నారాజవరున కిల్లాలివై తేని
యోరాజవదన నీయునికికిఁ దగును
అలివేణి యేగతి నైనను నలుని
వెలయంగ నీప్రాణవిభునిగాఁ జేతు
నని యివ్విధంబున నానలాధిపుని
వెనుకొన్న భక్తితో వేవేలగతులఁ
దలపోసి వర్ణింప దమయంతి యంచ
పలుకుల కానందపరవశ యగుచు
గన్నులభాష్పంపు కణములువొడమి
చన్నుగట్టులమీద జలజలఁదొరఁగ
దనమేను పులకించి దలయూచియూచి
యమరక్తితోడ నెయ్యమున నిట్లనియె
రాయంచరాజ యారాజదేవేంద్రు
డెమ్యోడలనుండు నీ వెట్లెఱుంగుదువు
పులుగులరాజవు భూపాలుఁ డతఁడు
తలపోయ నీకు నాతనికిఁ జుట్టరిక
మేగతిఁ గలిగె నాకింతయుఁదెలియ
వేగంబె చెప్పుమా వీనులు దనియ
ననవుడు రాయంచ యాయంచగమన

గనుఁగొని సంతోష కలితయై పలికె
వినవమ్మ చెప్పెద విశదంబుగాను
జనలోకసుతుఁడు సజ్జనలోక హితుఁడు
భానువంశంబున బలుడైనవీర
సేనున కుదయించి చిరకీర్తి వెలయ
రమణతో నిషధాపురంబుననుండి
కమలాయతాక్ష చక్రముపంపు సేయ
నెనయదీవుల నేడు నేలుచునుండి
మనుజేశుఁ డొకనాడు మంత్రులు దాను
వరుసతో శృంగారవనము లోపలను
జరియించుచుండి నాసఖులను నేను
భూమీశుముందటఁబోయి వ్రాలితిమి
యామీదమముజూచి యాచక్రవర్తి
కరుణారసము చిందగా నన్ను బట్టి
కరమొప్పరాలింపఁగా నామహీశు
నక్కడనంబును టన్యనం బతని
మక్కువ సుగుణసంపత్తి భాగ్యమును
జూచి నామనమున శుభము రెట్టింప
నీచక్కదనమున కిల్లాలు వలయు
ననుచు నీరాజున కనుకూలమై
వనిత దెచ్చెదనంచు వసుధపైనపుడు
తరుణిమణుల చక్కదనమెల్లఁజూచి
సరిపోవ కిచటికిఁ జనుదెంచి నీదు
వరరూపవిభవ లావణ్యసంపదలు
సరవిఁజూడఁగ మాకు సంతోషమయ్యె

పదిగాన నలుని వృత్తాంతంబు నెల్ల
విదితంబుగా నీకు వివరించి తిపుడు
నెలఁతయెట్టున్నదో నీచిత్తవృత్తి
తెలియఁగారాదమ్మ దేవసన్నిభుని
నలుని వరించి మన్నన గాంచితేని
నలరును బావియు నలరినట్లుండు
నరలోకమందు నా నరనాథువంటి
నరనాయకులు లేరు నరనాథపుత్రి
కల్లలు వలుక నా కన్నులయానఁ
బల్లవపాణి నీ పాదంబులాన
సత్యంబు నామాట సత్యంబుసుమ్ము
సత్యమే జయమని సకలయత్నముల
బలుకుదు రిలలోనఁ బావనమతులు
తలపోసి చూడు మోతరలాయతాక్షి
యనవుడు మదిరాక్షి యాపక్షిరాజుఁ
గని విస్మయానంద కలితయై పలికె

## దమయంతి హంసతోఁ దన మనోభిప్రాయము తెలుపుట

ఓపక్షిరాజేంద్ర యోదయాసాంద్ర
నాపాలి శ్రీరామ నాథుండ వీవు
రక్షింపఁగాఁదలచి రయమునవచ్చి
యాక్షితీశ్వరుని నర్యమకులాధిపుని
నలరాజచంద్రుని నానాథుఁగాఁగఁ
జెలువొందఁజేసి రక్షింపవే నన్ను
నిరవొంద నీమాట నే జవదాఁట

వరుదార నారూపమంతయు రాజ
వరునితోఁ బలుమారు వర్ణించి చెప్పి
పరస నీవిపటికిఁ జనుదెమ్మ బొమ్మ
చెలగి నీవింతగాఁ జెప్పుచుండఁగను
దలపోసి యేను నింతకు నొడంబడితి
నిక నొకమాట నీకెఱిఁగింతు వినుము
ప్రకటితగతి నేను ప్రతినొనర్చి
పలునొల్లెదను నొండె పలుఁ డొల్లననిన
వెలయ నీ ప్రాణంబు విడుచుటయుండె
ఘనతరబుద్ధి త్రికరణంబుగాను
బనిఁ బూని పలికితిఁ బరగ నీమాట
పూనికతో నన్యభూముల నేలు
మానవాధిపుఁగూడి మనుదానఁగాను
నెంతేసి పనులకు నెడముఁ గానీక
కంతునిశరముల గాసిల్ల నీక
కుసుమాస్త్రికేళికి గుందంగ నీక
వసుమతిపతికి నా వర్తమానంబు
తేట తెల్లంబుగాఁ దెలియంగఁ బలికి
మాటలు నీతిగా మఱికొన్ని సెప్పి
యేవిధినైన నా యినకులాధిపుని
వేవేగరా ప్రాణవిభునిగాఁ జేయు
మని ప్రియవాక్యంబు లందంద బలుక
వనితను జూచి యవ్వలఁబక్షిపలికె
కలకంఠియింత పల్కఁగనేలనీవు
దలఁపని కార్యమంతయు నాదిగాదె
వలనొప్ప నలచక్రవర్తికిఁదగిన

కలికి నెన్నఁడుజూడఁ గలుగునోయనుచు
తలఁచుచునుందునో తరలాయతాక్షి
పలుమారు నినుజూడ భాగ్యంబుగరిగె
నటుగానఁ బలుమారు నడలనేమిటికి
దటుకున ననులి నీధవుని జేసెదను
నొద్దికమీకార్య మొనఁగూర్చుదనక
నిద్దురయేడదే నెలఁతరోనాకు
వనితమేమటువంటి వారముఁగాము
మనమున గుందకు మనుజేశుఁగూర్తు
ననిచెప్పి తనవారి నందందవిడువు
మనినీవు విరహాగ్ని నడలంగవలదు
చనుదెంతుమరల నిచ్చటికంచుఁదెలిపి
వినువీథినరిగెనా విహగేంద్రు డచట
ధరణీశ్వరుఁడు భీమతనయను దలఁచి
విరులవిల్తునియంప వేదనకులికి
విరహాగ్నిచే గుంది వేసటనొంది
సురపొన్ననీడ భాసురముగనొక్క
చలువపూపందిలి సరగవేయించి
పొలుపొంద పచ్చకర్పూరంపుదిన్నె
పఱపించి దానిపై బన్నీరుచల్లి
పరుపుగాఁ జిగురాకు పాన్పుఁగావించి
క్రొత్తకస్తురిపున్గుఁ గూర్చినమంచ
మెత్తనిగంధంబు మెయినిండఁబూసి
తావిపన్నీడను దడిపినపచ్చ
సేమంతిపూసరుల్ చెచ్చెరఁ దాల్చి
మరుఘారికోర్వక మణిమణికలఁగి

పరతెంచి చూపాన్పుపైఁ బవ్వళించి
తనువెల్ల బొగులఁ జింతావార్ధిమునిఁగి
తనలోన నిట్లని తలపోయదొణఁగె
అంచలువోయిన యంతనుండియును
బంచబాణుఁడు నాకు బగదాయియయ్యె
నేమిసేయుదు నిఁక నిటమీద నేను
వామాక్షికడకు నెవ్వరిఁబంపువాఁడ
జలజారిభ్రమయింపఁ జాలినముద్దు
నలినాక్షిముఖము నెన్నడుచూడగల్గు
నుడుగక లేనియ లొలుకంగఁ బలుకు
పడతితో నెన్నఁడు భాషింపగలుగు
నలివేణితియ్యని యధరామృతంబు
నలతదీరఁగ నెన్నఁడానంగఁగలుగు
ముదమొప్ప మదిలోని ముచ్చటదీర
ముదిత యెన్నఁడు నాకు ముద్దిడఁగలదు
యులర నాచేతుల నాసలు దీరఁ
బొలతిబాలిండ్ల నెప్పుడు బట్టగలుగు
కవగూడి రతికేళి కాంక్షలుప్పొంగ
నువిదకౌఁగిట నెన్నఁడుండంగఁగలుగు
శ్రీనాథయను యిట్లు క్షితినాయకుండు
మానకయడలి క్రమ్మరసంచదలిచి
పొరలుచు నెక్కడ బోయెనో యంచ
సరసులఁగాంచ నొష్టమ్ముఁ గాంచి
మరగియంచటనున్న మదిలోనమరచి
యొరసిభక్షించుచు నున్నదోయంచ
యమరంగ తానేగినట్టి త్రోవలను

ఏమవారిఁగనినన్ను దలఁపదో యంచ
తొయ్యలిసిలో నేర్పుతోడ భాషించి
యొయ్యనవచ్చుచు నున్నదో యంచ
తరమిడినామీద దయనేగుచుండి
జరువడి యడవిలోఁ బడలెనో యంచ
యేమియుఁ దెలియరా దిందాకపక్షి
యేమరి యిపటికినేల రాకుండ
ననివెచ్చ నూర్చుచు హరమానాథ
యనిదలంచుచు నుండనప్పు డాయంచ

హంస దమయంతి లావణ్యాషును యామె
నిశ్చయంబును నలునితోఁ దెల్పుట

చనుదెంచి సఖులతోఁ జియ్యనవ్రాలి
ఘనభక్తి నలరాజుఁగనుఁగొని పలికె
నమరనీయానతి నచ్చోటికేగి
దమయంతిఁ గనుగొని మరలిమరలి వచ్చితిమి
దానిచక్కఁదనంబుఁ దలఁప నచ్చెరువు
భూనాథ వినుము నేర్పున విన్నవింతు
మెఱుఁగునీలపు సరుల్మించిన కురులు
పరిపూర్ణకళసోముఁ బడలించు మోము
తిలపుష్పములబెక్కు దెగడెడుముక్కు
నలినాస్త్రు విల్లాయల్ నవ్వుకన్బొమలు
హరిణంబుల జయించు నక్షులసంచు
మెరుటద్దముబోలుమించు చెక్కిళ్ళు
నలరుబింబమురీతి నణగించుమోవి
చెవులుశ్రీకారముల్ చెలియకర్ణములు

ఘనమైన శంఖంబు గవయుకంఠంబు
కనకంపుతీఁగెలగడవు బాహువులు
మృదుపల్లవంబుల మిగుల హస్తములు
కుదురుకల్వలమీరు గోరులతీరు
వలుచబంగరు చెండ్లు వనితపాలిండ్లు
చెలువైన నీలంపుఁ జికిలిరజంపు
నునువడితోఁబోరు నువిదనూగారు
ధరం బొన్న పూశోభితము సుమీనాభి
వసుధసింగముతోను వాదించుగాను
నిసుక దిబ్బలపొందు నెసఁగుఁపిరుందు
లరఁటికంబంబుల నరగించు దొడలు
మదననిషంగ సామ్యములు జంఘికలు
కెందమ్మిరేకుల గేరు పాదములు
నందంబు తాబేళ్ళ నడుచు మీగాళ్ళు
వనితకు నదియెల్ల వర్ణనగాదు
మనుజేశ యేఁ గొంతమాత్ర మెంచితిని
నీ రాజతేజంబు నీ ప్రతాపంబు
నీయేపవిభవంబు నీ విలాసంబు
నా మదిరాక్షకి నా మదవతికి
నా మోహనాంగికి నాసఖీమణికి
నా పద్మ గంధికి నా పుణ్యవతికి
నా పువ్వుఁబోణికి నా గుణవతికి
నా దమయంతి నందందయేను
మోదించి మదిలోన ముచ్చటదీర
వదున వేవిధముల వర్ణించి చెప్పి
తరుణికి నీమీద వలపుఁబుట్టించి

చెలిని నీ సొమ్ముగాఁజేసి వచ్చితిని
నెలమి రాజేంద్ర నీకికఁ జింత వలదు
నీకుఁ గావలెనంచు నీరజయోని
యాకంజలోచన నవనిఁ బుట్టించె
నింతయు నిజమని యెంచి భూనాథ
సంతోషమమర రాజ్యము సేయుమనుచు
బలికిహంసయు విదర్భకుఁ బోవుతరిని
దలఁపున దప్పు డా దమయంతికన్య
పలుమారు నలమహీపాలునిఁ దలచి
యలరు విల్తునిపువ్వుటమ్ముల కులికి
ఘనమైన మోహసాగరమున మునిఁగి
తన ప్రాణసఖులను దప్పకచూచి
రాయంచ యేలకో రాఁబడవాయె
నాయవనీశుఁడే మనియెనోగాక
పాయతదమజాతి పక్షులఁగూడి
పోయెనా కాకొలఁకులఁ బొందెనో లేక
యుపవనంబులలోన నున్నదోయంచుఁ
జపలాక్షియిట్లు విచారంబునొంద
నిదిమంచిసమయ మీయింతినీవేశఁ
గదసి నాపగఁదీర్తుం గడువడిననుచు
తమ్మితుపాకి కెందలిరాకువంకి
కమ్మనిదల్లి చెంగల్వనేజయును
జాజిపూబాకు గొజ్జకిపెద్దకత్తి
రాజిల్లు చిలుకల రథముపై నెక్కి
యలరుతుమ్మెదల సైన్యమును న్నెనడువం
బరుమారుపంతముల్ పలుకుకో వెలలు

పఱపుమీఱఁ జకోర బలములుగొలువ
మరుఁడుదండెత్తి యామానినిమీదఁ
జలమున జనుదెంచి సరగునగదసి
యలరువింటను బువ్వుటలుగు లెక్కించి
కరమునదెగఁదీసి కలికిపాలిండ్లు
గురిచేసి వడినేసె కోయనియూర్వ
నప్పు డాపూఁబోణి యంతరంగమున
ముప్పిరిఁగొను దాపమున కోర్వలేక
ధృతి దూలిమిగులఁగుందెడి తఱినంచ
యతిరయంబునవచ్చి యతివకిట్లనియె
ఓరాజవదన యాయుర్వీశుకడకుఁ
బోరనఁ బోయి నేర్పున నీగుణంబు
భావంబు రూపంబు భక్తియుం బ్రియము
వావిరివర్ణించి వర్ణించివాని
మనసున దయపుట్ట మాటలు సెప్పి
వనిత నీపై మేలువాని గావించి
వచ్చితినీవింక వరియింపు మతని
మచ్చిక సకలసామ్రాజ్యమై భవము
అనుభవించుచునుండు మతివేడ్కతోడి
వనిత మేమికబోయి వచ్చెదమమ్మ
మరువక దయయుంచు మామీదననుచుఁ
బరువడిఁ బలికి యాపక్షులు చనియె

నలుని విరహము

నంత నక్కడ నలుం డతివను దలఁచి
కంతుని శరముల గాసిల్లియులికి

యాహారముడిగి నిద్రాపేక్ష మాని
యాహారిఁ బాడుచు హాహారియనుచుఁ
మనలోన దమయంతి దమయంతి యింతి
యనుచు బలుకుచు వెరగంది చూచుచును
మంత్రులఁజూడక మహనీయరాజ్య
తంత్రంబు నడపక పనరెడుకొల్వు
కూటంబునకు రాక కూర్మిఁజెన్నొందు
హాటకరత్న సింహాసనోపరిని
నెర్మిఁ గూర్చుండక కొలుచువారలకుఁ
పేర్మిసంబళము లిప్పింపక జనుల
మనవులు వినక బ్రాహ్మణులకు ధర్మ
మొనరింపకను సభలోనఁగు క్రపంపు
విడియంబు సేయక వేటకై నగరు
వెడలక సంగీతవీణామృదంగ
నినదమ్ముల్ వినక చిచ్చెలవేశ్యలాడు
ఘనమగునాట్య సంగతిఁజూడకాతని
దమయంతి యతుల సౌందర్యంబుదలచి
సముచితగతి నాప్తజనులతో ముచ్చ
టాడక తానేర్చినట్టి పదంబుఁ
బాడక విరహతాపంబున నలుఁడు
దినమొక్క యేడుగా దీనతనొంది
యొనర వర్తించుచు నుండనవ్వేళ
సచివోత్తముఁడు మానసమునఁ జింతించి
యుచితవాక్కుల విభు నూరార్చిపలికె
నలధారుణీ తలనాథ నీ విపుడు
తలపున దమయంతి దమయంతి యనుచు

బలుమారు విరహతాపమునఁ గుందినను
నలిరేఁగి భూజనున్ నివ్వరే నిన్ను
నరనాథ సామాన్య నరునికై వడిని
దరలాక్షిఁ బలుమారు తలపంగ దగునె
వినుము నీవంటి భూవిభునకు నిట్లు
వనితకై ధైర్యంబు వదలింపఁదగునె
మదిలోన నీబుద్ధి మరవకీరీతి
సుపతికై పలుమారు శోకింపఁ దగునె
ఇది యెంతకార్యమే లప్పుఁడిచ్చోటు
కదలి భీమన్నృపాలు కడకేగి యతని
నడిగి యాదమయంతి ననుకూలపఱచి
కడువేగ వచ్చెదఁ గలగకుమింక
మచ్చికతో సభామంటపంబునకు
విచ్చేయుమని వేడి విభుని దోడ్కొనుచు
సంతసంబలర నాస్థానంబుంజేరె
నంత నక్కడ రాజహంసలు చనిన

దమయంతి విరహాము

యంత నుండియును భీమావనీశ్వరుని
సంతతిపుత్రి భూజననుతగాత్రి
దమయంతి మదనవేదనఁ జెంది
శమియింప నేరక సంతాపమంది
నలరాజచంద్రుని నరలోకవిభునిఁ
బలుమాఱుఁ బలుమాఱు భావంబులోనఁ
దలపోసి తలపోసి దలయూఁచి మేను
పులకించి పులకించి పొలతిమొందించి

తిలకించి తిలకించి తెలియవర్ణించి
చెలరేఁగి చెలరేఁగి చెలియ వేనోళ్ళ
వినుతించి వినుతించి వెలఁదులఁ జూచి
వనజాక్షులారా నావల్లభుఁ డిటకు
రాడాకో పెరై న రయమునఁబోయి
వేడుకోరాదె నావిధమెల్ల జెప్పి
తోడుకరారాదె దోసమా మీకు
వేడుకగాదె నావిభుడును నేను
జోడు బాయకయుండి సురత సౌఖ్యములఁ
గూడియుండఁగఁ గనుగొనరేమొ మీరు
కటకటా నేనింత గాసిఁ జెందంగ
నటులఁజూచెదరు మీరెంత నిర్దయులె
పసివేల నిటుఁజేయఁ బాడిగాఁదంచు
కుసుమబాణుని వేడుకొనరమ్మ మీరు
యశులకుఁ జెప్పరే యలివేణులార
నెలయ నీగనిఁ జేయ నీతిగాదంచు
వలనొప్పఁ జెప్పరే వడిఁ గోయిలలకుఁ
గలకంఠి నిట్లేచఁగా రాదటంచుఁ
పడఁతి నీగతిఁజేయఁ బాడియే యనుచు
వడిఁ జకోరాప్తుని వారింపరమ్మ
కలికినిపై ఖరిఁ గారింప కనుచు
తొలుత వసంతునిలోఁ జెప్పరమ్మ
యనిపల్కి హానాథయని మూర్ఛవోయి
మనమునఁ దెలిపి మన్మథుడు నామీద
నిటు నేయఁ దనకు నే నేమి చేసితిని
గటగటా యని లేచుఁ గన్నీరునించుఁ

జలిగాలి విసరినఁ జాలవడఁకు
నలరులు రాలిన నందంద వెఱచుఁ
గడు వేగలేచి యాకామినీమణుల
తొడలపై బవళించి దుఃఖంబుఁ బెంచుఁ
బతిరాక యిపుడు నా ప్రాణంబులుండ
నతివలారా యని యవనిమూర్ఛిల్లి
యొకకొంత ప్రొద్దునఁ గొయ్యన దెలిసి
యొకచోటు గోరి వేఱొకచోటఁ జేరు
నొక చెలిపేర వేరొక చెలి
నొక పనికనుచు వేఱొకపనిఁ దలచు
నొకమాటనాడి వేఱొక మాటవాడు
నొక చెలిఁబట్టు వేఱొకచెలిఁ దిట్టు
నొకపరిఁదెగడు వేఱొకపరిఁ బెగడు
నొకపరి వెఱగందు నొకపరి గుందు
జెలులను జూచి యో చెలులార చెఱకు
విలుకాఁడదిగొ నన్ను వేయుచున్నాడు
మీరందఱుఁగూడి మెల్లనపొంచి
పాఱిపోవఁగనీక పట్టిగట్టిగను
విఱిచికట్టుకరండు వేగమె పొందు
వెఱచినవారల వెఱపింతు రుర్వి
ననుమాట నిజమాయె నతనువలన
ననియిట్లు భ్రమసిమాటాడఁగ సఖులు
వెరగంది దిగులొంది వేదనఁబొంది
మరునిదూషించి క్రమ్మర వివేకించి
మరువననేల తామరతూండ్ల మెసవ
నరుదెంచికాంచి రాయంచ లీరీతి

నలుఁడు నలుఁడని నయముగాఁజెప్ప
పొలతి సిగతిఁజేసి పోయియుండంగ
నేమిచేయుదమింక నిటమీఁద మగువ
కేమిటమానునో యీమరుతాప
మనిచాల చింతించి యలివేణిఁగాంచి
గొనకొనిహొత్తున గూర్చుండిపలికెఁ
గన్నులనిండారం గారెడు నీరు
మన్ననఁదుడిచి యామదిరాక్షిగుబ్బ
చన్నులపైకొంగు చక్కఁగావైచి
వెన్నున నందంద విరిసి చిక్కైన
నెరికురుల్ కొప్పగా నిగుడించితోడల
మురుపున నిడిముద్దు మోమునమోము
కదియించి లాలించి కౌఁగిటనుంచి
యిదియేమి నెలఁత నీకిటువలె నలఁత
యిదియేమి చెలియ నీకిటువలె సొలయ
నిదియేమి లలన నీకిటువలె చలన
మిదియేమి మగువ నీకిటువలె వగవ
నదియేమి వెఱఁగు నీకిటువలె మరుఁగ
ఇదియేమివింత నీటువలెజింత
యిదియేమి యబల నీకిటువలె బడల
నిదియేమి కన్నె నీకిటువలెఁజిన్నె
యిదియేమిపొలతి నీకిటువలె యలతి
యిదియేమి భామ నీకిటువలెప్రేమ
యిదియేమికొమ్మ నీకిటువలె నమ్మ
యిదియేమి తరళాక్షి యింత నీమదికి
యిదియేమి మమత నీకిటువలె నలఁత

యిదియేమి మదిరాక్షి యింత బాలార్చి
యిదియేమి యింతి నీకింత విభ్రాంతి
వెఱవకు మావంటి వెలఁదు లుండగను
దరలాక్షి కింత తాపంబుదగునె
యనియూరడించి తియ్యని మాటలాడి
కనుగవలను బాష్పకణముల దుడిచి
చలువ పన్నీటను జలకంబులార్చి
కలిత గుబ్బలమీఁదఁ గస్తూరిబూసి
యొనరంగ నిట్లు శైత్యోపచారముల
నొనరించుచుండిరి యువిదకు నంత

## సాయంసమయ వర్ణనము

నాకాశలక్ష్మి కర్ణావతంసంబు
ప్రాకటంబుగ జాఱి పడిన చందమున
నరుణమౌ కిరణంబు లల్లంబు లగుచు
తరణిపశ్చిమ పర్వతంబున కరిగె
క్రమమున సాంధ్యరాగము దశదిశల
రమణశోభితెఁ దామరలు ముకుళించె
గలువలు చెలఁగెఁ జీఁకటి విస్తరిల్లె
వలవైరి నిత్యోత్సవమునఁ గైదువులు
చిలుకించుముత్యాల శేషలో యనగ
దిలకించి దారలు దివినుండి చెలగెఁ
గవఁబాసి చక్రవాకంబులు కలఁగె దివిరి
గేహంబుల దీపముల్ చెలఁగెఁ
గోరి చకోరపక్షులు సంతసిల్లె
జారచోరులు సంతసము నొంది రంత

## చంద్రోదయ వర్ణనము

సురరాజు దేవిభాసురలీలతోను
ధరియించు కర్పూర తాటంక మనఁగఁ
గలువలు నవ్వ జక్కవలు చింతింపఁ
దలిరింపన విరహులు తల్లడంబంద
జానతతో బూర్వదిగ్వామాక్షి నొంద
జనుదెంచునో యనజంద్రుండు వొడిచె
ఘనసెల్లదఁబిండి చల్లినయట్లు
వేడుకతో మంచి వెన్నెల గాయ

## దమయంతి విరహాము

నంతలో దమయంతి యది యోర్వలేక
చింతించి మదనాగ్నిశిఖలు చెన్నొంద
బలుమాఱు వెన్నెల బయటకేతెంచి
నెలచల్వరాలిపై నెలఁత కూర్చుండి
తలయెత్తి ద్విజరాజుఁ దప్పక చూచి
నలరాజుఁ దలచితే నాతి యీరాజు
ననుబట్టి యీరీతి నలినలిసేయఁ
దన కిప్పుడే నేమి తప్పు జేసితిని
వలదంచు మీరైన వారింపరాదె
యలరు విల్కాడు నీ కల్లుడుగాదె
వేవేలగతుల మా వెలఁదులు నేను
భావించి పలుమారు ప్రస్తుతిసేయను
దనజాడ మానదు ధర్మమే తనకు
నొనరంగ మఱి యతఁ డొక్కడుగాదు
తులలేనియల వసంతుండు కోకిలు

మలయమారుతము కోమల శారికలు
జిలుకలు మొదలుగాఁ జేరినన్నింత
గలచుచుండఁగఁ దాళగలదె యీమేను
మగువగదా యని మనసున లేక
పగఁబూనె దేపాటి పౌరుషం బోయి
యని పల్కుచుండంగ నంతకంతకును
వనజారివేడిమి వడిమూర్ఛ వోయి
తెలిసి దిగ్గునలేచి ద్విజరాజుఁ జూచి
కలువనాయక దయగలవాడ వనుచు
నలరు విల్తుని సేలన్నియు నీకుఁ
దెలుపవచ్చితె మంచితెఱఁగుఁ జేసితివి
నీవొక్కఁడవె గాదు నీవారెల్ల
నీవిధమేకాదె యెంచి చూచినను
వేషముల్ చూచిన వేడుకపుట్టు
దోషకారులగుదురు ద్రోహులు ఖలులు
దురితకర్ములు శివద్రోహులు వాని
వరుసలెంచఁగ దుష్టవర్తను లంగ
హీనులు మఱి కాంతిహీనులు చెడిన
మేనులు గలిగి యిమ్మేదినిలోన
విరహిణీ జనులకు వెఱవుఁగల్పించి
గరుణలేక తేగాములవలెను
దిరుగుచు రిది మహా ధీరత్వమనుచు
వరుసతో నవ్వేడి వారల నెఱుగ
రని పల్కి వీరి నొయ్యనఁజూచి నపుడె
ఘనతరం బగుపాతకమ్ము సిద్ధించు

నని తన తలవాంచి యతివలఁగాంచి
వనజాక్షులార నావల్లభు నింక
నెవరు తోడుకవత్తు రేమి సేయుదును
భువి నేను జేసినపుణ్య మిట్లుండె
ననికొంత సుంది హాయని దుఃఖమొంది
మనమున భ్రమయుగ్రమ్మరనంత దెలియు
నలుని దలంచుఁ గన్నీరు సంతసించుఁ
జెలులను బిలుచు రాచిల్కలఁ దలంచుఁ
గిలకిలఁదెగడు గోకిలలకు బెగడుఁ
గలకలఁ బలుకు భృంగములకు నళుకు
ముట్టదు వీణయు మఱియును నగలఁ
బెట్టదు విరిబంతిఁ బెంపారు కేలఁ
బట్టదు దొడుగదు పాటించిరవికఁ
గట్టదు చక్కఁగా గాంచనాంబరము
పూయదు పరిమళంబులు మేనవేడ్క
సేయదు విడియంబుఁ జింతతోఁ గన్ను
మూయదు చెలులతో మునుపటిరీతిఁ
జేయదు చనువిటు చింతచే నుదుటఁ
దీర్చదు తిలకంబు తెరఁగొప్పఁగోట
గూర్చదు జలకేళి గూడఁగా నఖులఁ
దీర్చదు చెలులు వాదించినఁ దగవుఁ
బేర్చిన వనకేళి విహరింపఁజనదు
ముడువదు కురులు క్రొమ్ముడిమోదమలర
విడువదు చెక్కిలి పెసనానుకరము
నొడువదు నలుని నెన్నుట దక్కనొరుని
దుడవదు కన్నీరు దొరగు నేమియును

నాడదు సరసంబు లబలలతోడ
పీడదు మనమున విభుపైఁది చింతఁ
బాడదు తానేర్చు పాటలు మదిని
జూడదు మాట్లాడ సుదతులతోడ
నీవిధంబున నున్న యింతి నీక్షించి
వేవేగ భీమభూవిభున కీకార్య
మెఱిగింప కుండిన నిది తెన్నగాదు
సరగున నలరాజచంద్రుఁ డిచ్చటికి
దరియ వచ్చినఁగాని దమయంతి నిపుడు
విరిశరంబులనేయు వెడవిల్తు డాత్మ
దను వెక్కుడింపడు తరలాక్షులార
యనపుడు మనకేల యని యిందువదన
లప్పుడా నతిఁదెచ్చి యంతఃపురమున
నొప్పుగా విరిశయ్యనుంచి రయ్యెడను

ప్రాతఃకాల వర్ణనము

బొలుపొంద రవివంశమునఁ బుట్టినట్టి
నలుని గోరిన భీమనందన విరహ
వేదన నుడిగింప వేవేగ నినుఁడు
రాఁదలచినరీతి ప్రాగ్దిశాకాంత
యనుపు ముంగరముత్తియం బోయనంగ
గనుపట్టె ప్రాచిఁజక్కని వేగుచుక్క
మెల్లనె చంద్రుఁడు మెఱుఁగెల్లక్కి
తెల్లనై పడమటిదిసకేగు చుండెఁ
దారగల్గివిఁ గాంతి దఱిగె నెంతయును
జారచోర సమూహసంచార ముడిగె

వలరాజు తన వింటివడి నెక్కుడించి
పొలుపొంద బాణముల్ పొదిలోననించుఁ
గదసియుండినయట్టి కాంతలు పురుషు
లదిమినకౌగిళు లందంత వదలెఁ
గలువలు చింతించెఁ గమలముల్ మించె
నిలపుష్పజాలంబు లెల్లను వెలసె
పరగునధణులు సంచారమ్ము లుడిగి
యిరవులలోఁజేరె నింపు సొంపారఁ
గోకిలలందందఁ గూయంగ దొణగె
మూకలై పులుగు లిమ్ములు మేతకరిగె
తిమిరముల్ తామున్న దిశలకుఁబోయె
గొమరొప్ప నాల్గుదిక్కులు తెల్లవారె

## సూర్యోదయ వర్ణనము

తనయని పెండ్లికై ధరణీదరారి
ఘనత గళ్ళనమేలు కట్లో యనంగ
నిందీవరాక్షితో నెమ్మిజయంతు
డంది వసంతంబులాడెనో యనఁగ
నిలధరేంద్రములతో నింద్రుండు పోరి
జలజరక్తంబు చెల్లెనో యనఁగ
నరుణోదయం బయ్యె నంతలోపలను
వరపై భవంబున వాసవుఁడిడిన
కొలువులో జగజంపు గొడుగో యనంగ
జెలువొప్ప బూర్వాద్రి శిఖరంబుమీద
జలమున హరివేయు చక్రమో యనఁగ
బలరాశిబుట్టిన సతి ధరియించు

పొలుపొందు పాపటబొట్లో యనంగ
బలభేది మెడనున్న పతకమో యనఁగ
నటనతో నింద్రునినాతిపై నున్న
బటువైన చెంగల్వబంతులో యనఁగ
భానుడప్పుడు తూర్పు పర్వతంబునకు
మానుగా జనుదెంచె మహియెల్ల బొగడ

సఖులు దమయంతి వృత్తాంతమును భీమరాజుతోఁ జెప్పుట

సంతట దమయంతి యనుఁగు వయస్య
లంతఃపురంబు కరిగి యాభీమ
ధరణీశ్వరునిగాంచి దమయంతి తెరఁ
బలువడితగ విన్నపము లిట్లుచేసి
వో రాజదేవేంద్ర యో దయాసాంద్ర
వారక నీపుత్రి వార్త నాలింపు
మొకనాఁడు దమయంతి యుద్యానవాటి
సఖియలతోఁ గ్రీడ సలుపుచునుండ
వనమున కెందుండి వచ్చెనో మెఱుఁగ
మనురక్తితోడ రాయంచలెన్నెని
చనుదెంచి దమయంతి సంగడివ్రాలె
దనుగట్టుటకు వ్రాళ్లు తాదెచ్చుకొన్న
చునువున నొక యంచ నందందబట్టి
కొనిపోవనంత నీకూఁతురు జూచి
పలుమారు మానవభాష నయ్యంచ
నలునిరూపము సద్గుణముల సంపత్తి
యలఘుతరసమంబు లనుచు వర్ణించి
వలపుముట్టింప భావజుఁడు కోపించి

విరహంబుఁ బుట్టించి వేవేగఁబోయె
దడుజేయంతటనుండి ధరణీశ సలునిఁ
దలచి చింతించు మోదంబున నెంచు
పలుమారు దిగులొంది పరితాపమొందు
మముజూచి చీరునమ్మదనుని దూరుఁ
గమలారిఁ దిట్టుఁదక్కక మమ్ముఁగొట్టు
హాయని మతిఁదూలు నవనిపై వ్రాలుఁ
బాయక మూర్ఛిల్లుఁబడి నేలఁబొర్లు
మనుజేశ యిటువంటి మదనతాపంబుఁ
గనివినీ యెఱుఁగమెక్కడనైన మేము
మరుబాణవేదన మానునోయంచు
సరసతఁజేసిన శైత్యోపచార
మింతింత యనిచెప్ప నేరికిఁగాదు
వింతలుసుమ్మిది వివరింతు మన్ని
యిగురుపానుపుమీద నింతనిజేర్పఁ
జిగురాకులన్నియుఁ జెచ్చెరఁగమలెఁ
వలఁచి దామరపూల తల్పంబునందుఁ
బొలఁతుకనుంచిన బొగలుగా నెగసెఁ
జల్లని నీటిలో సఖియ నుంచినను
చల్లగా డిది వెచ్చఁగా నయ్యెజలము
ముత్తెపు సరములు ముదితకునిడిన
గ్రొత్తనీలములాయె గునుమాస్త్రవహ్ని
జందనం బలఁదిన జలజాక్షి మేనఁ
గంది యాక్షణమునఁ గస్తూరియయ్యె
బన్నీరుకడవలఁ బట్టితెప్పించి
నెన్నుసఁబోసిన వెలఁది శోషించు

మాచేతఁగా దింక మగువఁ బోషింప
నాచెలి జీవింప దాదర్పుచేత
నెలనాతసంతతి నీకదాఁపనేల
వలనొప్పఁబుత్రి గావరసి యుండినను
నలుని రప్పింపు మానలుఁడు రాకున్న
జలజాక్షిబ్రతుకదు సత్యమీమాట
యున్ని సాక్షితెరఁ గేర్పడ మీకు
విన్నపం బొనరింప వెఱచియుండితిమి
కాగు సేయఁగనింకఁ జనదు భూనాథ
వేగమె నలమహీవిభుని రప్పింపు
మనవుడు తలయూఁచి యతివలఁజూచి
మనమున జింతించి మనుజేశు డనియె

## భీమరాజు దుఃఖించుట

ఆఁడుబిడ్డలఁగన్న యట్టి మానవుని
పాడిపంతంబులు పౌరుషంబులును
జెడునంచుఁ బెద్దలు జెప్పినమాట
తడయక నిజమాయె దమయంతివలన
నేమి సేయుదు నింక నిటమీఁద నేను
నామహీపతిఁ బిల్వనంపుట యెట్లు
లారాజుఁబిల్వంగ నలవియె నాకు
నారాజుఁ బిలచిన నతఁ డేలవచ్చు
నలుఁ డనగా నుర్వి నారాయణుండు
నలుని రప్పింపఁగా నాచేతనౌనె
బలవంతమున నియ్యఁబాటిగా దిలను
బలవంతు రప్పింప బలిమియు లేదు

ఆ మహీశుని గోర నతివకుదగునె
ఆమహాత్మునిబోలు నధిపులులేరె
యని తలపోయుచు నాత్మజకడకుఁ
జనుదెంచి సుతయున్న చందంబు చూచి
వెఱగంది యప్పుడు వేవేగవచ్చి
వెఱవొప్ప సంధ్యాదివిధులెల్లఁదీర్చి
కొలువుచావడికి గ్రక్కున నేగుదెంచి
నలువైన సింహాసనమునఁ గూర్చుండి
హితులగాయక పురోహిత మంత్రివరుల
సతివేగ రప్పించి యప్పు డిట్లనియె
మన దమయంతి గోమలులతోఁగూడి
యొనరంగ నొక్కనాఁ డుద్యానవనిని
వేడుకలలరంగ విహరించుచుండ
నాడకురాయంచ లరుదెంచి నలుని
వరరూపలావణ్య వైభవస్ఫురణి
వరుసతో వర్ణించి వగరుచు బోయె
నంతటనుండి తొయ్యలి దమయంతి
చింతించి నలునిపైఁ జిత్తంబుఁజేర్చి
కంతునిచేఁ జాల గాసిలెననుచు
నింతులు జెప్పిరి యిందు కేమనిన
విని సభవారెల్ల విభుని వీక్షించి
జననాథ యిందుకు సంతాపమంద

మంత్రిపుంగవులు దమయంతీ స్వయంవరము నిర్ణయించుట

నేల మేమొక కార్యమెరిగింతు మిపుడు
భూలోకమున నున్న భూనాయకులకు

వనరుహాక్షికి స్వయంవర మహోత్సవము
అని చెప్పి పంపిన నప్పుడా నలుడు
చనుదెంచు సకలజన్యులు వత్తురన విని
యిది కార్య మౌ నని చెప్పి
రయమున కారుల రప్పించి చూచి
ప్రియము రెట్టింపంగ భీము డిట్లనియె
నరుదారనిషధేశుఁ డాదిగాగల్గు
ధరణీశ్వరుల నెల్ల దప్పక కాంచి
కలకంఠి దమయంతి కన్యక కిపుడు
వలదు మీరఁగ స్వయంవర మని చెప్పి
చనుదెంచి పొండని జనపతి పలుక
విని వారలప్పుడు వేవేగఁ జనిరి
భూమీశుఁ డప్పు డా పువరంబెల్లఁ
బ్రేమమీఱ నలంకరింపుఁ డటంచుఁ
దలవరులకుఁ జెప్పి తగఁ జాటఁబనిచెఁ
దలవరు లప్పుడా ధరణీశుమీఁది
యానఁబెట్టుచు పురం బటువీథివీథిఁ
బూనుక తమ్మటంబులు వేసికొనుచు
సరగున హోయని చాటించి అంత
బురమువారెల్ల నప్పుడు వాడవాడఁ

## పురాలంకారము

గమ్మనికస్తూరి గలిపి పన్నీటఁ
గమ్మనివాసింపఁ గలయంప జల్లి
పచ్చతోరణములు బాగుగాఁ గట్టి
మెచ్చి బంగరుప్రాత మేల్కట్లుగట్టి

కదళీకాస్తంభముల్ కడువేడ్కనిలిపి
ముదమొప్ప ముత్యాలముగ్గులువెట్టి
చెంగావి పెక్కముల్ చేర్చియింటింట
సంగతిఁదెలివమ్మి సరములు విడిచి
కుంకుమపన్నీట గోడలుపూసి
పొంకముగా రంగుబొమ్మలు వ్రాసి
చెలువమందినయట్లు చిత్రవైఖరులు
గలుగ నప్పురము శృంగారించుచుండి
రంతలో వలఁజారు లానవాధిపుని
సంతసంబునగాంచి సద్భక్తిమ్రొక్కి
ధరణీతలేశ విర్భావనీశు
వరదనందనకు స్వయంవరమహోత్సవము
గావునదమయంతి కల్యాణమునకు
వేవేగ దేవర వేంచేయవలయు
ననుచు నీరీతిలోకాధీశ్వరులకు
వినిపించి యాభీమవిభుపురి కరిగి

## నలమహారాజు దమయంతి స్వయంవరమునకు వచ్చుట

రంతట నిషధేశుఁ డానంద మంది
కుంతల బర్బర కోసల పాండ్య
మాళవ ద్రవిడాంధ్ర మగధ కాశ్మీర
కాళింగ కాంభోజ కర్ణాట లాట
మరహాట కరహాట మత్స్యసౌరాష్ట్ర
కురుసింధుఘూర్జరకుకుర సౌవీర
గౌళ నేపాళ బంగాళ పాంచాళ

చోళాదినాథులు సుముఖులై కొలువ
నాదిత్యరథసమం బైన తేరెక్కి
మహాదేవసచివాప్తబుధులతోఁ గూడి
బహు గజజహరణభట చతురంగ
సహితుడై యెదుట వేశ్యాతాళమాన
సంగీతనాట్య ఘోషంబులు చెలఁగ
మంగళవాద్య సమ్మర్దంబు గలిగి
మహితాతపత్రచామరములు మించు
మహి పచ్చవస్త్రపావడలు రంజిల్లఁ
గంచు కొమ్ములుబూరగలు నాగసరము
లంచితపటహకాహళములు నమర
భేరీమృదంగ గంభీర వాద్యములు
ఘోరుకల్గఁగ మ్రోసె భూనభోంతరము
నలు డాగతి విదర్భనగరమార్గమున
నొలువొంద మెల్లనఁబోవుచు నుండె

## అధ్యాయము 2

పరమపావనుడు శ్రీపతి భక్తియుతుడు
సురమునీశ్వరుడు భాసురగుణోజ్వలు
తలనిండ కెంజడల్ దళముగాఁజుట్టి
నలువ కృష్ణాజినముఁ జంకబెట్టి
మహిద్వాదశోర్ధ్వపుండ్రములను బెట్టి
మహతి మూపునఁజేర్చి మానసవేగ
యోగవాగలనెక్కి యోగి నారదుండు
బాగుగా శ్రీపతిఁబాడి సొక్కుచును

ధరణి జరించుచు దమయంతిచంద
మెఱఁగి యావృత్తాంతమెల్ల వేవేగం
బురుహూతునకుఁ జెప్పంబోరున దివికి
నరిగినమౌని నల్లంతటఁ జూచి
కిన్నర గంధర్వ ఖేచర గరుడ
పన్నగ దేవ దిక్పాలకుల్ గొలువ
నలరి నృత్యంబు రంభాద్యప్సరసలు
సలుప బంగరుగద్దెఁ జయ్యనడిగ్గి
యెదురేగి భక్తిదేవేంద్రుండు మౌని
పదముల కెఱఁగి శుభప్రాప్తిరర్ఘ్య
పాద్యము లొసఁగి క్రొంబసిడిపీఠమున
విద్యానిధిని యోగివిభునుంచి భక్తి
బూఁటంతు చేతులు మొగిచెన నింద్రు
నాజటీంద్రుఁడు జూచి యపు డిట్టులనియె
సురనాథ వినుమొక్క శుభవార్త నిపుడు
ధరణిలో నొక విచిత్రము పుట్టె నేదు
భీమభూపాలుఁ డభేద్యవిక్రముఁడు
సోమార్క విభుడు భాసురగుణోజ్వలుడు
యిల విదర్భాపురం బేలెడు రాజు
వలనొప్పతనికి వరపుత్రియైన
యలివేణి దమయంతి యను కన్యకల
తలపున దాని సౌందర్య సంపదలు
వనజాసనునికైన వర్ణింపరాదు
వినుము నే చూడని వెలఁదులు లేరు
చూచితిఁ బార్వతిఁ జూచితి లక్ష్మిఁ
జూచితి భారతిఁ జూచితి రతని

జూచితిఁ దారను జూచితి శచిని
జూచితి మేనకఁ జూచితి రంభ
వెక్కుడఁ గనివిని యెఱుఁగ మెన్నండు
సక్కమలాక్షి నలావనీశ్వరుని
మదిలోనగోరి మన్మథబాణవేధ
వెవరి కృశింపఁగా భీమభూవిభుఁడు
నలునిఁ దెచ్చుటకు భూనాథులకెల్ల
నలదమయంతి స్వయంవరంబునకు
రండని భటులచే రావింప నిషధ
మండలాధిపుడాది మానవేశ్వరులు
హయకుంజరస్యందనా రూఢులగుచు
జయమున నావిదర్భపురంబుజేరఁ
బోవుచున్నారదె భూలోకవార్త
దేవేంద్ర నీకు నేఁదెలుప వచ్చితిని
తగునీకు దమయంతి తగ దన్యులకును
నగభేరియని చెప్పి నారదుం డరిగె
సురనాథుఁడధిక తేజోమూర్తులైన
వరుణకృతాంత పావకుల ముమ్మూర్తులను
గనుగొని సంతోషకలితుడై పలికె
మనము నల్వురము నెమ్మది మర్త్యమునకు
బోయియుందు విదర్భపురమర్థిజొచ్చి
యాయింతిఁ గనుగొందమని పల్కువారు
వరతెంచి నలువు రప్పట్టణోపరిని
బురలక్ష్మి వైభవంబును జూచుచుండ
నరపతుల్ గొలువ సేనలు చుట్టునిలువ
నరుదెంచి పురవీథి నరుగుచున్నట్టి

## నలుని సౌందర్యమున పురాంగనలు వర్ణించుట

నలుని గన్గొనగదన్నగర భామినులు
పొలుపొన్దు ప్రాసాదములఁ గోపురములఁ
దలవాకిటుల నున్నతంపు మిద్దియల
నిలిచి యున్నల ధారుణీవిభునిఁ జూచి
గొమరొప్పనందంద గుంపులుగూడి
ప్రమద కొండొరులతో భాషించి రిట్లు
చూడరె యీ రాజు సొంపునుబెంపు
వేడుకలయ్యెడు వెసఁజూడఁ జూడం
దనియ దీతని చక్కదనము యౌవనము
దనరారనిట్టి యందంబు చందంబు
పొలుపొందునే యెందు భువియందు
నివిధు కలవె లోకముల నెక్కడ విచారింప
గంతుఁడో శ్రీరమాకాంతుండో
యలజయస్తుఁడో కాక మోహనవసంతుండో
ఈమనుజేశ్వరుం డినుఁడో చంద్రుండో
ఈమహామహుఁడు దేవేంద్రుడో హరుడో
ననవిల్లుపుష్పబాణము లుండెనేని
మనసిజుఁడని వీని మఱిచెప్పవచ్చుఁ
గరముల శంఖచక్రము లుండెనేని
పరగ నితని రమాపతి యనవచ్చు
మూఁడుకన్నులు ముఖంబున గల్గెనేని
వేడుకఁ బార్వతీ విభుఁడనవచ్చు
వేయికన్నులు మేన విలసిల్లెనేని
యాయమరాధిపుఁడని చెప్పవచ్చు

నని వితర్కింప భీమావనీవిభుఁడు
వినుతింపఁ దగినట్టి విడిదిఁజూపుటయు
నలుఁ డందు విడిసి యందఱ నప్పుడన్ని
నెలవుల విడియించి నిష్ఠనున్నంత

ఇంద్రాదులు నలుని కడకువచ్చి తమ కోర్కెను తెల్పుట

హరిహరాదులు తమ యరదంబులన్ని
తెలియగకుండగ నొక్క యిక్కనుజాచి
పొలుపొంద నిజరూపములతోడ వచ్చి
నలరాజు నెదుట గ్రన్ననవచ్చి నిలువఁ
గనుగొని నలమహీకాంతుఁడు దివిజు
లనుచు దిగ్గునలేచి యతిభక్తితోడ
నెదురుగాఁ జనుదెంచి యిలసాగి మ్రొక్కి
ముదమంది వేవిధమ్ములఁ బ్రస్తుతించి
యనురక్తిగొనివచ్చి హైమాసనముల
నునిచి చేతులుమోడ్చి యురుభక్తి పలికె
నమరేశ శిఖిశమనాంబువులార
కొమరొప్ప నాల్గు దిక్కులయందు నిలిచి
కరమర్థి సకల లోకముల రక్షించు
పరమాత్ములార నాభాగ్యమూలమున
జనుదెంచినారు మీ సందర్శనముల
ఘనపుణ్య మతినైతిగాదె లోకమున
గరుణ మీరిటకు నిక్కము వచ్చినట్టి
తెరఁగెఱిఁగింపుడు తెలియంగ నేఁడు
ఘనమూర్తులార మీకార్య మంతయును
ననుకూల మొనరింతు నలుడు వాసవుఁడు

ఓని నలోకేశ్వరుని వీక్షించి పలికె
జనసాథచంద్ర మీ సత్యశీలంబు
పటుగతి సకలభూభాగంబు నిండె
నటుగాన నిను జూడ నభిలాషపుట్టి
చనుదెంచినాము నీ చందమంతయును
గనుఁగొన సంతోషకరమయ్యె మాకు
దరలాయతాక్షికి దమయంతికన్య
కరయ స్వయంవర మని విని వేడ్క
నలువుర మేతెంచినా మింతిఁగోరి
పలినాప్తకులజయా నాతి దగ్గఱకుఁ
జనువేడ్క నీమతి సరిపోవురీతి
ననుకూలపఱచి చయ్యద రమ్ము పొమ్ము
చనువిధంబెట్లని జాలిబొందకుము
మనుజేశ నీకన్న మఱిలేరు మాకు
వసుధేశు లెందఱో వచ్చి యున్నారు
పొసగనీసరి సేయఁబోలునె వారి
మా కార్యమంతయు మనుకులాధీశ
నీకార్యమనిచూడ నేర్తువుగాన
నీకు నేఁజెప్పితి నిషధేశ నీవు
పోకున్న నిపుడు మాబుద్ధియుఁ గలఁగు
నావుడు చిఱునవ్వు నవ్విభూవిభుఁడు
దేవేంద్రు గనుగొని ధీరుడై పలికె
నిదియేమి దేవ నీకిటువంటి మాట
యుదయునివలె నిట్టు లాడంగదగునె
యందంద భూనాథు లందఱువచ్చు
చందంబునను నేను జనుదెంచినాఁట

నాకంజలోచన ననుకూలపఱుప
నాకుఁజెప్పఁగ నీకు న్యాయమాదేవ
ముందరవెనుకను ముదితనుగాంచి
చెందిదవేడ్క భాషించి యున్నానె
పోలుపొందునట్లయినఁ బోయివచ్చినను
వెలఁదుక నామాట వినునెకాదనక
పన్నుగానిటువంటి పనులకుఁబోవఁ
గన్నది విన్నది కలదె మీరిలను
బాయకయిటువంటి పల్కులునాచేతఁ
జేయుటఁగాదు నీ సేవగావింతు
నింతియెకాని యాయింతిని మీకు
సంతసంబున బుద్ధిచాలదు గూర్పఁ
జేరియాపనులు నేర్చినవారిఁ బనిచి
యారాజముఖిని నీవర్థి వరింపు
మనవుడు పురుహూతుఁ డా రాజుఁజూచి
ఘనకృపారసమొల్కఁగా నిట్లుపల్కె
ఇవకులాధీశ నీవేకార్యమైన
ననుకూలపఱచెద నంటివిపుడు
పనివడి మేమొక్క పనికిఁబొమ్మనిన
వినయముల్ పల్కుచు వెలఁదుక కడకు
బోలేక యిప్పుడే బొంకితివనినఁ
బోలించి యేమనఁ బోయెదమింకఁ
బరువడి సత్యసంపన్నుండవనుచు
సురలుచెప్పఁగ నిన్నుఁ జూడవచ్చితిమి
కరమొప్ప దబ్బరుకాఁడ వటంచు

నెఱఁగితె మేమేల చెందువచ్చెదము
జగతినిక్ష్వాకు వంశజులెల్ల మున్ను
పొగడినకీర్తులు పొందిరిగారె
పుట్టివారల వంశమందున నీవు
పుట్టి దబ్బరలకుఁ బుట్టిలవైతి
ఏ మేలుచేసిన నెన్నటికైన
మా మనంబుల నిన్ను మఱువంగలేము
నలరాజు సురరాజునకుఁ బెండ్లిచేసె
నలివేణి దమయంతి నని రమానాథ
తెలిఁగిన నిను మెచ్చుటిది పెద్దగాదె
ధరణీతలేశ యాదనుజారివైన
మాకార్యమనినఁ దామస మింతలేక
చేకొని కరుణతోఁ జేసిరక్షించు
ధరణీశ మామీద దయలేదుపిదప
నెఱఁగెద విందుల కేమిగానిమ్ము
చనియెదమిఁక యని చర్చించిపలుక
వినవాలమదిలోన వెల్వెలఁ బాఱి

ఇంద్రాదులకు మాత్ర మొనర్చుటకు నలుఁ డొప్పుకొనుట

కరముల ముకుళించి ఘనభక్తిమీర
ధరణీశుఁడా పురందరున కిట్లనియె
నౌకరనీబంటనై యుండెడివాఁడ
ననగాత్మనామీఁద నత్యంతకరుణ
గలిగివచ్చితి నట్లుగాన నేనిపుడు
వెలమిని నాదమయంతి దగ్గఱకు
నరయ నేనేగతి నరుగుదు ననుచు

గరుణాసముద్ర యీగతిని బల్కితిని
యక్కడ దమయంతి యంతఃపురంబున
నకు బోతుటేఁగష్టమైనను బోవరాదు
గావున నిప్పు డీకార్యమేరీతిఁ
గావింతునీమాట కపటంబుగాదు
డడయక దాని యంతఃపురంబునకు
నడువ నుపాయంబు నాకెఱిఁగింపు
దనవిని పెలారి యాత్మ మొందించి
మనుజేశ్వరునిఁజూచి మఱియునిట్లనియె
దమయంతికన్యకు దానియింతులకుఁ
గ్రమమున నీరూపు గనిపించుఁగాక
నితరుల కెవ్వరి కెఱుఁగంగరాదు
సతితోడభాషించి చనుదెంచుదనక
ననియొప్పవరమిచ్చి యరుగుమటంచు
బనిచినవారికి భక్తితో మ్రొక్కి
భీమరాజు నంతిపురంబునకు నలుం
డదృశ్య విద్యాప్రభావంబునం జనుట
చనిచనియాతీరు జననాయకుండు
నెనుపొంద హితులతోఁ బేరోలగమున
నాయెడఁ గూర్చుండి యాలోచనంబు
సేయంగ నొక కొంతసేపుండి చూచి
యరుదెనకనక హర్మ్యంబులుగడచి
మెఱసెడిబంగారు మేడలు గడచి
సరసఁజిత్తరువుల చవికెలుగడచి
వరుసతోఁ బగడంపువాకిళ్ళు గడచి
యక్కడక్కడ నిలిచి యంతఃపురంబు

నక్కజంబుగ దాఁటియా దమయంతి
యువిదతోఁగూడుక నొనరంగనొక్క
నవరత్నమయమైన నగరిలో నుండఁ
గనుగొని దాని దగ్గఱబోయి నిలువ
వనజాక్షిచూచి భావజుడంచు బెదరి
భ్రమనొంది ధరమీఁద బడిమూర్ఛపోయి
కమలాక్షియంతలో గ్రక్కునఁ దెలిసి
కనుఁగొని నలరాజు గాబోలటంచు
మనమునఁ దెలిసి హేమస్తంభమునకుఁ
జాటుగా నిలిచి యచ్చట నున్న తనదు
చేటికి సైగఁ జేసినఁ బోలనదియు
జననాథుఁ గనిబల్కె సరసవాక్యముల
నొనరంగ నెక్కడనుండి వచ్చితివి
నీ వెవఁడవు మఱినీదు పేరేమి
యేవిధమ్మునవచ్చి తిటకు నాకార్య
మెఱిగింపు నీపురం బెయ్యది నీవు
విరులవిల్తునిరీతి వెలయు చున్నాఁడ
వనవుడు రాజేంద్రుఁ డాదమయంతి
గనుగొని సంతోషకలితుడై పలికె

నలుఁడు తనువచ్చిన కార్యమును దమయంతి కెఱింగించుట

రమణ నేనిషధాపురం బేలువాఁడ
నమర నలాధిపుఁ డనుపేరివాఁడ
సరసతినిటకు నిర్జరదూతనగుచుఁ
బరతెంచినాడ నావనియెల్ల వినుము

అమరాధిపతియును ననలుండు మఱియు
శమనుండు వరుణుండు సరసరవీరు
నలువురు నినుఁగోరి నాకడఁజేరి
తలపులెఱిగించి తమలోననొకని
కనుకూలపఱచి రమ్మని పంపినారు
వనజాక్షి యిట్టి దేవతలకు నీవు
తెలివిచేఁ బట్టపుదేవిగానుండఁ
గలిగెడు నీదు భాగ్యము నెంచఁదగునె
వారిజాసన యేను వరుసతో నిపుడు
వారి ప్రభావంబు వర్ణింతు వినుము
బలభదిసకల సామ్రాజ్య సంపదలఁ
దెలివినొందిన తూర్పు దిశ నేలురాజు
మరువకయు నుండు ధర్మము విచారించి
స్థిరముగ దక్షిణదిశ నేలురాజు
భూవలయంబునఁ బొలుపొంద వరుణ
దేవుఁడు పశ్చిమదిశ నేలురాజు
కేలిమైయగ్ని యాగ్నేయదిక్కు
నేలెడువాఁడు యజ్ఞేశ్వరగహ్యాయుఁడు
వారు పుణ్యాత్ములు వార లుత్తములు
వారు శ్రీమంతులువారు పావనులు
వార లభేద్యులు వా రనిమిషులు
వారలు నిను గోరివచ్చిన యపుడె
యలివేణియంత భాగ్యముఁ జేసినావొ
తెలియంగదరమె యా దివిజవల్లభుల
నలువురిలోన మానస మేరియందు
నిలుచునో నీవు వాని వరించి తేని

యనిమిషనాయకు లహివరుల్నరులు
మునులును ఋషులును ముదమన్దగలరు
గరుడఖేచరయక్ష గంధర్వవరులు
హరిహర బ్రహ్మాదులందఱు నిన్ను
నరసి ప్రస్తుతిస్తేను రదిమేలుగాదె
వదకామినీ నీకు నాథులువారు
వనజాక్షి యెవ్వరి వరియించెదీవు
వినిపింపు వీనుల విందుగా నాకు
ననురక్తి దేవత లంపవచ్చితిని.
నను జిన్నపుచ్చుట న్యాయంబుగాదు.
అనవుడు దమయంతి యామాటలెల్ల
విని నవ్వి యారాజవిభున కిట్లనియె.

దమయంతి ప్రత్యుత్తరం బిచ్చుట

అవునోయి మంచి కార్యముఁజేసినావు
కువలయేశ్వర నిన్నుఁ గోరినందులకు
బురుషులు గోరుట పుడమిలోఁజగును
దరుణుల గోరుట తగదనుమాట
నిజమయ్యె నామీఁద నేరంబుగాదె
యజుఁడును సరివార లందఱిలోన
నగుబాటుఁ జేసెనే నరనాథ నేఁడు
మిగుల మాటలుపల్క మీకెట్లు చెల్లు
రాయంచ పులుఁగులు రయమునవచ్చి
పాయకమదనుని బారికిఁ ద్రోచి
యరిగిన వెనుక నిన్ననేల నాకుఁ

బరువడి నా వ్రాత ఫలమిట్టులుండు
నమరాధిపతు లేడ నకట నేనేడ
దము గోరుమని చెప్పదగునె వారలకు
వారికిబిడ్డనై వర్తింతు నకట
వారిని వరియింప వచ్చు దోషంబు
కువలేశ మును నిన్ను గోరిన వెనుక
మతిలోన వేఱొక్కమగని గోరుదునె
నన్ను వరింపుము నీవు కాదనిన
వేవేగ ప్రాణముల్ విడుతునంటనె
వారును నీవును వరుస మెచ్చెదరు
ధారుణీవల్లభ తప్ప దీమాట
నావుడు చిఱునవ్వు నవ్వి భూవిభుడు
వావిరి భీమభూవరపుత్రి కనియె
సురనాయకులు గూడి సుందరి నిన్ను
వరియింప వచ్చిన వారి గాదనుచు
నరుని వరించిన నదరె లోకులును
ధరణిలో నోములు దగిన దానములు
నుపవాసములు పెక్కు లొనరంగ జేసి
యెపుడును గందు రాయింద్రపదంబు
నాసించియుండు మహాత్ములకైన
వాసవలోక నివాసమే యరుదు
వరుసతో నీపుణ్యవశమున సురలు
వరియింప వచ్చిరి వరవైభవమున
లట్టివారల నొల్లనని నీవు నన్ను
నెట్లు పెండ్లాడ విధి బుద్ధిగాదు

వనితలు కోరివచ్చిన వెనుక
నీను వరింపఁగ నాకు నీతిగాదింక
నినవంశజుఁడగాని యితరుఁడఁగాను
వనిఁబూనివరల బంటనై వచ్చి
వెలఁది నిన్ను వరింప వెఱతునేననిన
నెలుఁగెత్తి హాయని యేడ్చి భూనాథ
నీవు రావలెనని నిఖిలభూవిభుల
రావించె మాతండ్రి రయమున మీకుఁ
బంత మాయిటువంటి పలుకులు పలుక
సంతసంబున విను జననాథచంద్ర
జలసూదనుండైన జలజాప్తుఁడయిన
జలజారియైనను జలజాక్షుఁడైన
వరియింపనొల్ల నోవసుధేశ నన్ను
వెఱవున వరియింప వెఱచితివేని
సన్నుత వారిసన్నిధినుండి నేను
నిన్ను గూర్మివరింతు నీ కేల భయము
కాదని యీరీతిగాఁ జేయకున్న
మేదినీశ్వర నీవు మెచ్చకు నన్ను
నని పల్కుచుండ నయ్యమర వల్లభులు
జని యదృశ్యతనిల్చి జనపతి పలుకు
లాలించిమెచ్చుచు నరిగిరిమున్ను
భూలోకవిభుడంతఁ బోలఁతి చిత్తంబు
దెలిసి వేగమె చనుదెంచి దేవతల
నలరుచుఁ జూచి సాష్టాంగమర్పించి
కరములు ముకుళించి కడుభక్తిఁ బలికె
నరిగితి భీమరాజాతనజ కడకు

దేవతలతో నలుఁడు దమయంతి చిత్తము నెఱిఁగింపఁగా విని వా రతనికి బదులు చెప్పుట

నెనయంగ మీరానతిచ్చిన క్రమము
వినిపించితిని మిమ్ము వినుతి చేసితిని
బరమపావనులార భవదూరులార
వరరూపవతి మిమ్ము వరియింప ననియె
ననవుడు దేవేంద్రుఁ డారాజచంద్రుఁ
గనుఁగొని యామాట కాదనలేక
వేడుకతోఁ బోయి వెలఁదితో మాట
లాడివచ్చితి గాన యవనీతలేశ
నీయంతగుణశాలి నిఖిలంబులోన
నేయెడఁగనివిని యెఱుఁగమెన్నఁడు
నిట్టిసత్యవ్రత మిట్టి గాంభీర్య
మిట్టియౌదార్యంబు నిట్టిసద్గుణము
గలిగినవాడ వొక్కఁడవె లోకమున
నలమహీనాథయో నలినాక్షి నిపుడు
సతివేడ్కతోఁ బెండ్లియాడుము నీవు
మతిలోన నీమేలు మఱువమెన్నండు
నని పల్కి యానల్వురచ్చోటువాసి
ఘనమాయఁదరలి చక్కఁగ నొక్కచోట
సురనర మూర్తు లన్యులకు నెవ్వరికిఁ
గురుతిడ రాకుండఁ గూర్చుండిరంత

-భీమరాజు దమయంతిని స్వయంవరమునకు దిలిపించుట

నంతట భీమగోత్రాధిపుఁ డలరి
వింతగా పన మంత్రివిభుల భూవిభుల

హితులమంత్రి పురోహితుల సమ్మతిని
నతివేడ్క శుభలగ్నమట నిశ్చయించి
నలుఁ డావిగాఁగల్గు నరనాథవరులఁ
బిలిపించి వారికిఁ బ్రియముఁ బుట్టించి
సరసతోఁ దనకొల్వు చావడికెదుటఁ
బరువైన చలువచప్పరమును నునిచి
తనపుత్రియున్న యంతఃపురంబునకు
జననాథచంద్రుండు సమ్మతినరిగె
నప్పుడు దేవత లానందమొంది
యెప్పుడు నరులకు నెఱుగరాకుండ
నలుని రూపంబులు నలువురుఁ దాల్చి
కొలువున నలుచెంతఁ గూర్చుండిరంత
భీముండు దాదులఁ బిలిచి మీరింకఁ
గామిని దమయంతి కన్యకామణికిఁ
గడువేడ్కతో శృంగారించి వరము
లడుగంగ దేవాలయంబున కరిగి
శ్రీరమాపతిని బూజింపగఁ జేసి
కోరిచయ్యనఁ దోడుకొనుచు రావలయు
ననుటయు దమయంతి కాయిందుముఖులు
చని తేటపన్నీట జలకంబులార్చి
మెరువడిజిలుఁగుతో మెయిదడియొత్తి
కురులార్చి వింతగాఁ గొప్పగీలించి
వరచంద్ర కావి పావడమీఁదనుంచి
వరలు సన్నపుఁజల్వ వలువ బాగొప్పఁ
గట్టిగుబ్బలమీద కనకంపుపూల
పట్టుగంచుకమును బాగుగాఁ దొడిగి

తీరుగా మృగనాభి తిలకంబుఁదీర్చి
కోరి జవ్వాదితోఁ గూర్చిన మంచి
హరిచందనము మేన నందంబూసి
విరిసరుల్ గొప్పున వింతగాఁ దురిమి
పటుసూర్యచంద్రుల పాపటబొట్టు
నిటలంబుపై జార నిలిపి కర్ణములఁ
గరమొప్ప బంగారు కమ్మలువెట్టి
కరమున వజ్రాల కడియముల్ పెట్టి
సిటంపుముంగర నీటుగాఁబెట్టి
పాలితంబుగను బిళ్ళలనూలమర్చి
కరముల ముద్దుటుంగరములువెట్టి
మెరయు హారంబులు మెడనిండ నుంచి
తెలిదమ్మి రేకులఁ దెగడెడిముద్దు
కలికికన్నుల మంచి కాటుకఁ బెట్టి
ఘనతర నవరత్న కాంతులచేతఁ
దనరిన జిగిసందె దండలుపెట్టి
సల్లేరుపువ్వులు పసిఁడితీఁగయును
మొల్లమిగాజులు ముందుగా మురుగులు
తిలకంబుఁ బసిడియందియలాదిగాగఁ
గడుభూషణంబులు కన్యకామణికి
ధరియింపఁజేసి శ్రీధరు మందిరమున
కరుదందఁ దోడ్కొని యరిగిననంతఁ
గరములు ముకుళించి కన్యాలలామ
పరమాత్ముఁడైన శ్రీపతిని దర్శించి
భయభక్తి నిట్లని ప్రస్తుతిచేసె
జయభక్తిమందార జయమహోద్ధార

## దమయంతి శ్రీహరిని స్తుతించుట

జయ నిత్యకల్యాణ జయ జగత్త్రాణ
జయపద్మదళనేత్ర జయనీలగాత్ర
జయకరుణాపాంగ జయకీర్తితాంగ
జయపాపసంహార జయశుభాకార
జయబాహుబలధుర్య జయదేవవర్య
జయభోగసుత్రామ జయగుణోద్ధామ
జయరమాహృదయేశ జయచిత్ప్రకాశ
జయరమానంద జయపుణ్యబృంద
యని నినుఁగొనిఁయాడ నలవియె నాకు
ననుఁ గరుణింపుము నా కాధిపతులు
నలుగురు చనుదెంచి నను గేలిసేయఁ
దలచియున్నారు మాధవునిగా నలుని
జేసిరక్షింపుము శ్రీనాథయనుచు
భాసురమతితోడఁ బ్రస్తుతించుచును
జనుదెంచె దమయంతి సఖులతోఁగూడి
తన తండ్రికడకు నాధరణీశ్వరుండు
పజుపైన పచ్చల పల్లకిలోన
వరపుత్రి నునిచి వే వసుధామరులును
గనుఁగొని పేరు భూకాంతులనెల్ల
వినుత వాక్యంబున వేర్వేఱు జూపుఁ
డని పుత్రిఁగనుగొని యమ్మ మాయమ్మ
యనురక్తిరాజుల నందఱఁజూచి
మనమునఁ దలఁచి మనుజేశుకంఠ
మునఁ బుష్పమాలిక ముదమునవైపు

మని చెప్పి ధరణీశు డంత నైదువల
ననుపమంగతి గూర్చి యతివలకెల్ల
హెచ్చరికలు చెప్పి యేతరఁ బనిచి
యచ్చుగ సకల సైన్యంబులు గొలువఁ
దనకుమారుని నొక తావున నిలిపి
యొనరంగబదిలుడై యుఁడుఁడటంచు
బలమున [illegible]బుఁగడ బలువిడనునిచి
యులరెడు సకలాయుధాన్వితుఁ డగుచు
బలియుడై తానుండెఁ పార్థివేశ్వరుఁడు
నలివేణి దమయంతి నపుడు తోడ్కొనుచు
చెలికత్తె లిరుగడ చేయూనిరాఁగ
వలనొప్పగా రాజవరుల వేర్వేఱ

## వసుదేవుడు దమయంతికి స్వయంవరాగతులను వేర్వేఱ నెఱిగించుట

నరయుచు వసుదేవుఁడను విప్రవరుఁడు
సురుచిరమతితోడఁ జూపంగ దొడగె
గలకంఠి యీతఁడు గౌళభూనాథు
డలివేణి యితఁడు మహారాజవిభుఁడు
లలనయీఘనుడు మాళవమహీశ్వరుఁడు
నెలఁత యీనరపతి నేపాళవిభుడు
కలికియీశూరుండు కరహాటధవుఁడు
వెలఁది యీరాజు ద్రావిడదేశభర్త
కొమ్మయీనాథుండు కుకురధాత్రీశు
డమ్మ యీరాజేంద్రు డంగభూవరుడు
మదిరాక్షి యీతండు మత్స్యవల్లభుఁడు

సుదతి యీనృపమౌళి చోళదేశేశు
డెలనాగ కురుధరాధీశుఁడీ నృపతి
మెలఁత యీతండు గాశ్మీరరాజన్యు
డలరుబోడి యితండు యంగభూవిభుడు
చెలియ యీధీరుండు సింధుభూనాథు
డని యిట్లు రాజుల నందఱఁజూపి
వనితతో నిషధభూవరుఁ జేరఁబోయి

## నలపంచకము

నలరాజుదగ్గఱ నలువుమీఱంగ
నలునిరూపంబున నలువురుండఁగను
బరికించి చూచి యా బ్రాహ్మణుండప్పు
డరుదంది యేమియు ననకూరకుండె
నది చూచి దమయంతి యవలఁజూచి
యిది దేవతలమాయ యిందు కేమందు
నేవురు నిషధేశు లెందైనగలరె
యీపట్టివేషంబు లేల వీరలకు
నక్కటాయేనొల్ల ననిపల్కుచుండ
తక్కక యిటుసేయఁదగునె వీరలకు
దమవంటివారికిఁ దగుదునె యేను
దమ కులాంగనల నెందటిరూపుదానఁ
గరుణయింతయు లేక కటకటా మీరు
సరసత నామీఁదఁ జలపోరఁదగునె
మనుచుఁబల్లకిడిగ్గి యమరేశ్వరులకు
మునుకొని చెయ్యెత్తి మ్రొక్కి యిట్లనియె

## దమయంతి దేవతలను ప్రార్థించుట

ఇదియేలనయ్య మీకిటువంటి పనులు
కొదుకకసేయ మీకూఁతురగానె
నైజరూపులుదాల్చి నరులంద ఱెఱుఁగ
రాజిల్ల ననుగృపారస మొల్కఁగాంచి
నాకాధిపతులార నలునికి నన్ను
వేకూర్చి పెండ్లిగావించి యీవేళఁ
గన్నులారఁగ చూచి కరుణతో నలుని
నన్ను దీవించి మన్ననఁజేసి మీరు
వేంచేయరయ్య నావెఱపెల్లమాన్పి
యంచువేడిన మెచ్చి యతిదయామతిని
ప్రముదితచిత్తులై బలభేదివహ్ని
జముడు వరుణుండు సత్వరంబునను
దమ తమ రూపముల్ తప్పకతాల్చి
యమరంగ గనుపట్టిరందఱు కప్పు
డాలోన నలుని నొయ్యనఁజేరి పుష్ప
మాలిక మెడవైచె మగువప్రేముడిని
దివినుండి ఘోషించె దేవదుందుభులు
భువిమీఁద గురిసెను బువ్వులవాన
పాడిరి గంధర్వపడఁతు లిఁపుగను
నాడిరి యెదుట రంభాదికామినులు
నైరుతివాయు కుబేరనీలగళాది
హరి దిగీశులు నిఖిలామరు ల్దివిని
వాసవానల యమ వరుణులు భువిని
వాసి కెక్కిన నలావనినాథుఁ బొగడి
రలఘుసద్భక్తి భీమావనీశ్వరుఁడు

నలుని గీర్తించె నున్న తిమిర నపుడు
వెలయంగ దేశాధివిభులెల్ల వచ్చి
నలమహీశ్వరునకు నయమున మ్రొక్కి
పొలుపొంద దమపురంబుల కేగిరంత
నలరుచు దమయంతి నాత్మలో నెన్ని

దిక్పాలురు వరంబు లొసంగుట

పాకశాసనుఁడు దిక్పతులతో వచ్చి
చేకొని నలరాజు శేఖరు నపుడు
వచ్చి కౌఁగిటఁజేర్చి కువలయాధీశ
మెచ్చుగా నీవు మాయాప్తుడ విలను
చిరభక్తితో నీవు చేయుజన్మంబు
కరుణ మీఱఁగ నేను గైకొనువాఁడ
మరువకు మామీఁద మక్కువలనుచు
ధరణీతలంబు నెంతయుఁ జిరకాల
మనురక్తిఁ బాలింపు మని యానతిచ్చె
ననలుఁడంతట వచ్చి యవనీతలేశ
నీవు నన్నెయ్యెడ నెమ్మి బ్రార్థింతు
నావంక నిలుతు నే నని వచియించె
జముడంత నేతెంచి జననాథచంద్ర
రమణ నీ వెంత ధర్మము సేయఁదలతు
సారూఢి నేనిత్తు నని వరంబిచ్చె
నైరుతియటవచ్చి నరలోకనాథ
నిరుపమ శౌర్యంబు నీ కోర్కె కొలది
నరగంగ నేనిత్తు నని వరంబిచ్చె
వరుణుం డంతటవచ్చి వసుధాంతలేంద్ర

చిరకాల మేలు మీ క్షితినని పలికె
వాయుదేవుఁడు వచ్చి వసుధేశ నీకు
నాయతగతివేగ మబ్బెడు మనియె
ధనపతివచ్చియో ధరణీశ నీవు
ధనమెంత గోరిన దానిత్తు ననియె
మ్మృడుఁ డరుదెంచి యో మేదినినాథ
యడిగిన మహినిత్తునని వరంబిచ్చె
నప్పుఁడు ముదమంది యమ్మహీశ్వరుఁడు
తప్పక వారికి దండముల్పెట్టి
వినుతింప వారలు వినువీథి కెగసి
చనిరి వేగమున నిర్జరలోకమునకుఁ
నల్లునిగూతుర నటఁదోడు కొనుచు
మెల్లన నగరికి మేదినీశ్వరుఁడు

## నల దమయంతీ వివాహము

స్థిరమైన పెండ్లి పందిలి కేగుదెంచి
కరమొప్పు నవరత్న ఖచిత మైనట్టి
బంగారు పీటలపై వధూవరుల
నంగన లటు నిల్పి హారతు లొసఁగ
నవనీసురాంగన లతివేడ్కతోడ
ధవళముల్పాడంగ దండివాద్యములు
పటహధ్వానము సభోభాగంబు నిండఁ
దటుకున భేరీమృదంగ గంభీర
రవమున ధారాధరములు ఘూర్ణిల్లఁ
గవగూడివందిమాగధులు కీర్తింప

సంగతిగానాగ సరములుబాడ
సంగీత వాద్యఘోషంబులు చెలఁగ
బూరగల్ కంచుకొమ్ములు కాహాళములు
బోరుకొల్పుటను నంబుధులెల్ల
వేత్తలై హోమత్వేల్పించి భాసు
రోత్తము లక్షత లొసఁగి దీవింప
నెలమి వారంగనల్ నృత్యముల్సలుప
చెలఁగి పుణ్యస్త్రీలు సేసలు చల్లిగలఁగ
పలుదెఱంగులను శోభనములు పాడఁ
జెలువందఁ బెద్ద లాశీర్వాదమొసఁగ
దరలాయతాక్షిని దమయంతి నపుడు
నరపతి నలరాజునకు ధారవోసె
హరుడు పార్వతియును నమరిన యట్లు
నరసిజాక్షుఁడు రమాజలజాక్షి యట్లు
సరసిజాసనుఁడున శారద యట్లు
నెఱిశశాంకుఁడు రోహిణీదేవి యట్లు
క్షితిరాహితుఁడు శచీదేవి యట్లు
అతివిభారవియు ఛాయాదేవియట్లు
తిలకించిరటఁ బెండ్లిదినములు గడపి
వలనొప్పఁ బెండ్లికి వచ్చినవారి
భోజనంబులఁ దృప్తిబొందించి మిగుల
రాజిలునవహేమ రజతాంబరములఁ
దనరు భూషణముల దనిపి వీడ్కొలిపి
ఘనలీల వంది మాగధ కవీంద్రులకు
దొడవులుమాడలు దొడ్డవస్త్రములు
తడయక బహురత్నాల నొసంగి

వేడుకమీఱ నివ్విధంబునఁ బెండ్లి
పోడిమి జనులెల్లఁ బొలుపొందఁ జేసి
నిరుపమానానూన నిత్యసంపత్తి
నురుతరసుఖలీల నుండి రంతటను
గలకంఠి దమయంతి కన్యారామణికి
వలనొప్ప ముదుస్వయంవరమను వార్త

కలి యింద్రుని సభ కరుగుట

విని కలినాఁబాపవిభుఁడు వేవేగఁ
దనలోన నతుల సంతాపంబు నొంది
యపుడు పెంపాడఁగా నాత్మలోఁగోరి
విపరీత బుద్ధులు వివరించుకొనుచు
దలవెంద్రుకలు వీడిఁదత్తరిల్లుచును
జలజల మని ఘర్మజలబిందు లురలఁ
బరువున నేతెంచి బలసిదిక్పతులు
గరుడఖేచరయక్ష గంధర్వసిద్ధ
సరసవిద్యాధర చారణసాధ్య
సుర యక్షపన్నగుల్చుట్టును గొలువఁ
గొలువున్న యింద్రునిఁ గొబ్బునఁ గదసి
బలవైరి మాకొక్క పనిగలదదియు
వినుము చెప్పెద ధరాధిపు పుత్రియొకతె
వనజాయజాక్షి భావజు మేటిదంతి
దమయంతి యనియెడు తరలాక్షి గలదు
క్రమమొప్ప దానికి గడువేడ్కతోడ
నరయ స్వయంవర మని వింటి నేఁడు
ధరయందు దాని సౌందర్య సంపదకు

సరిరారు రంభాది సౌరభామినులు
తరముగా దాచ చక్కఁదనము వర్ణింప
సరగునఁ జలి యేను సఖిలవరించి
తిరిగి రావలయు నే తెఱఁగునైన
వనితకెప్పఁడు స్వయంవరమగు ననుచు
దినములెన్నుచు నేను దిరుగుచున్నాడ
గడఁగి దుశ్శకునము ల్గనుపింప నిటకు
నడచితి నటుగాన నా వివాహమున
కేకీడు పుట్టునో యెఱుఁగంగరాదు
నాకేశ మీతోడ నయ మలరంగ
నిలిచి మాట్లాడంగ నేఁడునానను
కొలుపదు నీకేమి కోపమో యెఱుఁగఁ
గరమర్థి దమయంతి కన్నియ నిటకు
వరియించి తెత్తు వాసవ నాకు
గరుణతో నొక యపకారంబుసేయు
మరమర లేక నీకదీ విన్నవింతు
నందనవనములో నలినాక్షిఁగూడి
పొందిక రతికేళి భోగింపవలయు
ననవుడు దేవేంద్రుఁ డపుడు దిక్పతులఁ
గనుఁగొని నవ్వి యాకలికిట్టులనియె

స్వయంవర వృత్తాంత మింద్రుండు కలి కెఱింగించుట

ఏటికి మహికిఁబోయెడు తద్విధంబు
తేటతెల్లంబుగాఁ దెల్పెద నోయి
యా దమయంతి స్వయంవర క్రమము
నా దివుని నే హుతాశనశమన

వరుణులతోఁగూడి వసుధకు డిగ్గి
గరితచిత్తం బెన్ని గతులనో యరయ
మమ్మెల్ల చంద్రులమాఱుగా నెన్ని
సమ్మతి నలు బ్రాణసఖుగా వరించెఁ
గావునఁ గోర్కెల కడఁజేసి మరల
దేవలోకమున కేతెంచితి మీవు
పొలుపొంద నటకేల పోయెదవనినఁ
గలఁగి వితర్కించి కలిపురుషుండు
మొగమునఁ జేవురు మురువునటింప
భుగభుగ నిగుడ నిప్పులపొగ లెగయఁ
జొటజొట చెమటలు సోనలై కురియఁ
దటతటమని తొమ్మ తడఁబడుచుండ
కటకటాయని యోడు కఱచి కన్నులను
దొటతొటనిప్పను దొఱగ హుమ్మచ్చు
గాలాగ్నిరుద్రుఁడో కాలభైరవుడో
కాలసూర్యుఁ డొలయ కాలుఁడో యనగ
గర్జించి భీషణాకారుడై యపుడు
నిర్జరు ల్వణకంగ నిలిచి యిట్లనియె.

కలి కోపముతోఁ బ్రతిజ్ఞ నొనర్చుట

ఇన్నాళ్ళనుండి యా మెలనాగ గోరి
యున్ననే నుండెద నూరక తాను
నన్నుఁగాదని వచ్చి నలుఁ డెంతవాఁడు
క్రన్నన యింతిని గైగొనిపోవ
నాకేశ నీ వేగునాఁడొక్కమాట
నాకుఁ జెప్పకపోవ న్యాయము నీకుఁ

బోయిన వారెల్ల బొలఁతి వరించి
యీయెడ కేతేర కెట్లు వచ్చితిరి
నరులలో సురల మానము గోలుపుచ్చి
వరియింపవచ్చిన వాఁడా నలుండు
అమరులు వచ్చినారని తాలు బోక
దమయంతి వరియింపఁ దానెంత ఘనుఁడో
మంచిదండుల కేమి మదిరాక్షిఁ గూడి
యెంచగాఁ పురం బెట్లు చేసెడినో
చూచెద నవుడు సురరాజు పలికె
భూచక్రమెల్ల నేర్పున విష్ణుచక్ర
మెలమితోఁ బని సేయ నేలెడు బలియు
డిల వానిసత్య మీరేడు లోకముల
నారూఢి నెగడియు నాక్రమించినది
యా రాజనరునిపై నలుగంగ వలదు
మహిలోన నతఁడు సామాన్యుఁడు గాఁడు
మిహిరకులాగ్రణి మేదినీశ్వరుఁడు
సంతత శ్రీమూర్తి సరస సత్కీర్తి
మంతుండు నాచారవంతుండు ఘనుడు
వాని సత్యమెఱింగి వచ్చితి మిటకు
నానరనాయకుం డవని లోపలను
నీకు సాధ్యుడుఁ గాఁడు నీకసాధ్యుండు
యో కలిరాజ నీ కూరకయింత
కోపంబు వానిపైఁ గూడ దామాట
పాపంబువచ్చు నీ పని సేయఁగూడ
దనవిని మఱియు రౌద్రాకారుఁ డగుచు
ననిమిషపతితోఁడ ననియె నాతండు

కదలి యీరేడు లోకముల నాకన్న
ఘనుఁ డెవ్వఁడున్నాఁడు కంటివే నీవు
వెరవొప్ప నాపేరు విన్నమాత్రమున
హరిహర బ్రహ్మేదు లంతటివారు
వెఱచి చుట్టునురాక వెఱచి యుండుదురు
గరుడ కాకోదర గంధర్వయక్ష
వరులైన నామాయ వర్ణింపలేరు
సురనాథ నానేర్పుఁ జూచెదవింక
నలుఁడనియెడి యొక నరుడు నాయొద్ద
నిలిచియుండెనె చూడు నీవు మెచ్చెదవు
దమయంతి నాచేతఁ దాఁబడుపాటు
రమణి యెవ్వతె పడు రాజ్యంబులోన
నేను గోరినయట్టి నెలఁతను వచ్చి
తాను గైకొనిపోవఁ దానెంత ఘనుఁడో
వానితోఁ జలపోరి వానినేఁ బట్టి
పూని జూదంబాడ బుద్ధిపుట్టించి
మాయలుచేసి యామహి నెడఁబాపి
పాయక పైనున్నబట్టఁ బోఁజేసి
గారించి యినగోఁచిగాని గావించి
యారణ్యభూముల నలయంగఁజేసి
మానిని నెడఁబాపి మనసు నొప్పించి
దీనత నొందించి తెలివి దప్పించి
మాఱురూపముచేసి మహిమదప్పించి
కారించి యమిత దుఃఖమున నొందించి
కుందఁ గోకరిఁజేసి కువలయేశులకు
వండిపెట్టఁగఁజేసి వాని నీరీతి

చీకాకుపడ మాయఁ జేయకయున్న
నాకేశ వినుము నే నలునికి బంటు
నౌదుఁ దర్కింపఁగా నందాఁకఁ గలిని
గాదని యీరీతిగా మహాప్రతినఁ

కలి విదర్భకేగి నలునియందుఁ బ్రవేశించుటకు
సమయము వేచియుండుట

బలికి యింద్రునితోడఁ బరువున నపుడు
నిలిచినచోటను నిలువంగలేక
ప్రాకటంబుగ విదర్భపురంబుఁజొచ్చి
యాకోపమున నిషధాధీశుఁడైన
నలరాజచంద్రుని నయముగాఁ జూచి
కలి యెంతమాత్రము గదియఁబోవెఱచి
యాతని సత్యంబు నాతని శౌచ
మాతని యాచారమంతయుఁ దెలిసి
కుతలాధిపుని జేరఁగూడ దటంచు
నతఁ డెందుఁదిరిగిన నదియెల్లఁ గనుచు
నక్కడక్కడఁగూడి యందంద తిరిగి
కక్కసపడుచు శోకముఁ జెందుచుండె
నంతటఁ గొన్నినాళ్ళరిగిన నలుఁడు
సంతసంబున భీమజననాథుఁ గాంచి
యిఁక మా పురంబున కేగంగవలయు
నకలంక నీపుత్రి నంపింపుమనిన

నలుఁడు నిషధకు భార్యతోడ నరుగుటకై మామ నడుగుట

నటువలెఁ జేయుదు మవనీశతిలక
కుటిలకుంతల దోడుకొనిపోవ కిచట

నుండుమన్నను మీర లుండురే యనుచు
వెండియు బలికి భూవిభుడు కుమారి
నాయెడఁ బొడగాంచి యంత నిట్లనియె
నోయమ్మ నీమగఁ డొగిబురంబునకుఁ
బోవలెననె నీవు పోయిరమ్మనిన
వావిరి దమయంతి వగచుచు నపుడు
తల్లియొద్దకు వచ్చి తన మానసము
దల్లడించుచుఁబల్కె దండ్రి నన్నిపుడు
తన యల్లుడూరికిఁ దర్లిపోఁదలచి
నను వెంట నంపుమన్నాఁ డదిగాన
నాతని వెనువెంట నంపుదుననుచు
నాతోడ నెఱిగించినాఁడె యోయమ్మ
యనవుడు తనపుత్రి నతివ కౌఁగిటను
నునిచి హాయనియేడ్చి యోయమ్మయనుచు
ననుఁ బాసిపోయెదే నా ముద్దులాడి
యని తల్లిపుత్రియు నందంద యేడ్వ
దమయంతి దాదులు దాసజనంబులు
గుమిగూడి యందఱు కోయని యేడ్వ

భీమరాజు కుమార్తెకు ధర్మము లెఱింగించుట

జనుదెంచి భీమభూజన నాయకుండు
తన పుత్రి నూరార్చి తనయింతిఁ దెలిపి
దాదుల వారించి దమయంతిఁజూచి
యాదరంబునఁబల్కె నదియేమి తల్లి
యేల యేడ్చెదవు నీకేమిటఁ గొదవ
లాలిత సౌందర్య లక్షణాన్వితుఁడు

నిల నేఁడు దీవుల నేలెడురాజు
నలరాజచంద్రుండు నరలోకనాథు
డట్టి భూనాయకుం డతివరో నిన్ను
నెట్టనఁజేపట్టె నీకేల వగవ
నరలోక సుతుఁడైన నలచక్రవర్తి
యరయ నిన్నుండి నాకల్లుఁడై యొప్ప
బెక్కుకాలము నాకు బిడ్డలులేక
మక్కువ నినుగాంచి మాన్యుండనైతి
సురనాయకుల నేఁడు చూడంగఁగలిగె
గరమొప్పఁ జిరకీర్తి గలుగుటఁజేసి
యిందీవరాక్షి నీవిందును నందఁ
బొందుగా వచ్చుచుఁ బోవుచునుండు
మమ్మరో నీయన్న నంపుదువెంట
సమ్మదంబునఁబోయి చనుదెమ్మ నీవు
మనమున దుఃఖంబు మానుమో యమ్మ
నినుఁ జూడ కెన్నాళ్ళు నే నిర్వహింతు
బెనుపొంద వెంటనే పిలువనంపింతు
నని బుజ్జగించుచు నాదరబుద్ధిఁ
దన పుత్రి నలునకుఁ దగ నొప్పగించి
తనయకు సరణంబు తనయంగనిచ్చి
పోయిరమ్మని పల్కఁ బొలఁతి శోకమునఁ
బాయక తమతల్లి పదముల వ్రాల
గ్రుచ్చి కౌఁగిటఁజేర్చి కోర్కె దీవించి
చెచ్చెరబుద్ధులు చెప్పగఁ దొడఁగె

దమయంతికిఁ దల్లి బుద్ధులు గఱపుట

మతిగల్గి గురుభక్తి మానకెల్లపుడు
సతత పతివ్రతాచర్యల విడకు
పతిమాట నడచుచుఁ బరిచర్యచేసి
పతిని శ్రీపతిగాగ భావింపవమ్మ
వసుమతి మనసాటి వారలలోనఁ
బొసగ సత్కీర్తులు పుట్టింపవమ్మ
మదిరాక్షి చెలువంద మన వంశమునకు
వదలక మఱియొక వన్నెఁదేవమ్మ
కుసుమకోమలి బంధుకోటి నుతింప
వసుమతీశుని మెప్పు వడయుమో యమ్మ
సరసత నాథుండు చనువిచ్చునపుడు
నఱిముఱిఁబలుమాట లాడకుమమ్మ
యని ముద్దుపెట్టి చయ్యన బుద్ధిచెప్పి
మునుకొని మోమున మోమునుజేర్చి
నాయమ్మ నాకూన నాముద్దుచిలుక
పోయిరమ్మనవుడు పోయి తండ్రికిని
మ్రొక్కిన దీవించి మొగిబుద్ధి సెప్పి
గ్రక్కున నవరత్నఖచితమౌ శిబిక
లోలోన నీరేజలోచన నునుప
నాలోన నలుఁ డొక్క యరదంబు నెక్కి

నలుఁడు దమయంతితోడ నిషధకేగుట

మామను వీడ్కొని మగువయు దాను
ప్రేమతో దమనుండు వెంబడి రాగ
కరిరథభట ఘోటకంబులు గొలువ

వరుసముప్పది రెండు వాద్యముల్ మ్రోయ
వారక భటులు కైవారంబు సేయ
వారకామిను లిరువంకలనాడఁ
జేరిపుణ్యాంగన ల్సేసలుచల్ల
ధారణీసురులు బాంధవులు కీర్తింప
దివినుండి దేవత ల్దీవించుచుండ
నవనిఁ బువ్వులవాన లంతట గురియ
మనుజేంద్రు డిటువంటి మహిమశోభిల్లఁ
జనుదేరనప్పుడు సంభ్రమం బెసఁగ
బురము వారెల్లను పొంగుచుఁ గూడి
వరుసతో నెదురుగా వచ్చి వీక్షింపఁ
బరివారజనములు భక్తి సేవింప
నరపతి తలపట్టణముఁ బ్రవేశింపఁ

## పౌరకామినులు దమయంతిని పొగడుట

బుధసతీజనము లప్పుడు వేడ్కలలర
గురుతర ప్రీతిచే గుంపులుగూడి
దమయంతి గనుఁగొని తమలోనె తాము
ప్రమదమెలర్పగాఁ బలికిరిట్లనుచు
నీమానినీమణి నిదె చూడరమ్మ
రామాభిరామ నిర్భర పుణ్యసీమ
సీమగాదిది మంచి చెలువైనలేమ
లేమగాదిది మంచి లేమావికొమ్మ
కొమ్మగాదిది మంచి కులుకుకెందమ్మి
నమ్మిగాదిది మంతాపి పూలతిలక
లతికగాదిది చూడ లావణ్యప్రతిమ

ప్రతిమగాదిది పుష్పబాణునిదంతి
దంతిగాదిదిమించు దనరెడు కాంత
కాంతగాదిది నీటుగరభోగికన్నె
కన్నెగా దిది మెచ్చుకపురంపుఁబిన్నె
తిన్నగా దిది తావితేట పన్నీరు
నీరుగా దిది చిన్ని నెలరాజుతీరు
తీరుగా దమ్మ యీ దేవిలావణ్య
మంతయు వర్ణింప నలవియేమనకు
వింతగా ననియిట్లు వేవిధంబులను
వినుతింప నలమహీవిభు డివ్విధమున
దనరారు శుభముహూర్తంబునఁ దనదు
నగరుఁ బ్రవేశించి నాతియుఁ దాను
జగతీశులును మహాజనులు బాంధవులు
హితులు మంత్రులు పురోహితులును దదసు
మతినేగిరట దమ మందిరంబులకు

దమనుఁడు పట్టణమున కేగుట

నంతట మనాఖ్యుఁ డా మహీశునకు
సంతసంబున మ్రొక్కి జననాథ యేను
బొలుపొంద నూరికిఁ బోయివచ్చెదను
కలకంఠి దమయంతి కన్యామణికి
వయసు మిక్కిలిలేదు వసుధాతలేశ
దయ నేలుకొమ్ము బిత్తరిని మన్నించి
యని విన్నపముజేసి యా దమయంతిఁ
గనుగొని సద్బుద్ధి గలిగి భూవిభుని
మర్మంబు లెఱిగి సమ్మతి భక్తి వెలయ

నర్మిలి నడుపుము నయముతో నీవు
అరయంగ నూరికి నరిగెద ననినఁ
పరరాక్షి యన్నను దప్పక చూచి
కన్నులఁ గడుబాష్పకణములు దొరఁగ
నిన్నాళవలెనుండ కికబుద్ధి గలిగి
మన్ననఁ బ్రజలెల్ల మహి మెచ్చి పొగడ
నిన్నికార్యంబుల నరసిసద్భక్తిఁ
దల్లిదండ్రుల మాట దాఁటక రాజ్య
మెల్ల నేలుము ప్రజలెద సంతసిలఁగ
మెచ్చు కీర్తులచేత మెలగు మోయన్న
విచ్చేయుమనపుడు వేగంబె యతఁడు
తన బలంబులు గొల్వఁ దన పురి కరిగి
తన తండ్రిఁ గూడి ఘాతల మేలుచుండు

## నలదమయంతి విహారము

నంతట నిషధేశుఁ డా దమయంతి
సంతసంబునఁ గూడి సరసులయందుఁ
గేళివనములందుఁ గృతకాద్రులందు
మేలిమిపొదలందు మేడల యందు
నిరుపమాన విభూతి నిరతంబు నిట్లు
సురతభాసుర కేళి సొక్క సోలుచును
శ్రీరామచంద్రుని రీతిసంప్రీతి
ధారుణీచక్రంబుఁ దగనేలుచుండె
ననియిట్టు బృహదశ్వుఁ డా ధర్మజునకు
బెనుపొంద మున్ను దావిన్న మార్గమున
పరుసతో నలచక్రవర్తి చరిత్ర

సరసులు మెచ్చ విస్తారంబు గాఁగ
వినుత వాక్యంబుల వెలయంగ జెప్పె
ననుచు వాధూలగోత్రాబ్ధిచంద్రుండు
చిరకీర్తిమంతుఁ డాశ్రితకల్ప తరువు
కరుణాపయోనిధి కందాళదొడ్డ
యాచార్యునకు శిష్యుఁడై నట్టి వైష్ణ
వాచారతత్పరుఁ డతిదయాపరుఁడు
పొలుపు మీఱిన చక్రపురి విహారుండు
వలనొప్ప నతనికి వరకుమారుండు
అకలంకమానసు డమిత పుణ్యుండు
సరసవైష్ణవ పాదసంసేవకుండు
రంగనామాత్యుండు రాజపూజితుఁడు
సంగీత సాహిత్య సత్కళావిభుఁడు
సరససత్కవివర సద్భూషణుండు
అరయంగ నాతని కనుగు సోదరుడు
తనరిన యాంధ్రవిద్యా ప్రవీణుండు
జనలోక విదితుండు సజ్జనహితుఁడు
తిరువేంగళార్యుండు ధీరాగ్రగణ్యుఁ
డరయ నాతనికి నే నతికూర్మసుతుడ
నమల మానసుఁడ విద్యావిశారదుఁడ
రమణను వరకవిరాఘవాహ్వయుఁడ
నరహరి ఘటికాద్రి నాథుని పేరఁ
బరువడి నే నాంధ్ర భాషను తెలియ
నవని శ్రీహరిదాసు లైనట్టి సరస
కవుల సత్కృప నాకుఁ గలుగుటఁ జేసి

ఈ నల కథయందు నిది పూర్వభాగ
మేను రచించితి నీ చరిత్రంబు
నెవ్వరు చదివిన నెవ్వరు వినిన
నెవ్వరు వ్రాసిన నీశునికరుణ
నాయురారోగ్యంబు లైశ్వర్యములను
బాయకుండగఁ బుత్రపౌత్ర సంపదల
నాచంద్రతార్కులై యుందు రెలమి
భూచక్రమున మఱి పూజితులగుచు.

పూర్వభాగము సమాప్తము.



శ్రీరస్తు

# నలచరిత్రము - ఉత్తరభాగము

ద్విపద కావ్యము



## అధ్యాయము 3

శ్రీకరచారిత్ర శృంగారగాత్ర
పాకశాసన వేద్య భవరోగవైద్య
చిరపుణ్య కీర్తి యాశ్రితనుత కీర్తి
కరుణానివేశ శ్రీఘటికాద్రివాస
యవధరింపుము పాండవాగ్రతనూజుఁ
డవిరళమతి తోడ నా దమయంతి
పరిణయక్రమమెల్ల భక్తిశోభిల్ల
నరిమురి విని విస్మయానందుఁ డగుచు
కరములు ముకుళించి ఘనయోగిచంద్ర
యెఱిగింపుడట మీఁది వృత్తాంత మెల్ల
ననవుడు బృహదశ్వు డారాజుఁ జూచి
వినుమని వేడ్కతో వివరింప దొడగె

### దమయంతి కుమారుని కనుట

అంతటఁ గొన్నాళ్ళకా దమయంతి
కాంతాలలామంబు గర్భంబు దాల్పఁ
బరిపూర్ణసోముని బడలించు మోము
దొరకొని వేగుచంద్రుని రీతి నుండె

నవవిల్తు పూడెండ్లనందగు చున్న
మెనల నల్లని వర్ణములు గానుపించె
మృదు బింబములవన్నె మెచ్చనిమోవి
కదసిన మలినంబు గప్పినట్లుండె
బడలిక త్మ్రెమునఁ బర్వెనందంద
నడుము మందంబాయె నాభిగన్పడియె
సవరన నల్లపూసలి పేరుఁబోలె
నవిరళం బగుచు నూగారు చూపట్టెఁ
గలికి చూపులఁ జిఁద్రికల్పర్వె ననఁగఁ
బలుచఁ బారెను గండపాలికా యుగళ
మలివేణి ముఖచంద్రుఁ డత్రమతరపు రసము
చిలుకు చందంబునఁ జిట్టుము తెసగె
గగన భాగంబు నాకారంబుఁ దాల్చు
పగిదిఁగౌదిఁగె చూపట్టెనా నాఁటఁ
బొలుపొంద నవమాసములు పూర్ణమైన
నలరసమస్త గ్రహంబులు వరుసఁ
దప్పక తమ తమ తావులనుండ
నప్పుణ్యలగ్నంబునందు నయ్యింతి
పురునిభుండయిన కుమారునిఁ గనియెఁ
బరుహజాతసమునిసత్పుత్రుని జూఁచిఁ
గురుతరమతిఁ దండ్రి కులగురువైన
గురుని వసిష్ఠుని గోరి రప్పించి
ధరణీసురుల బాంధవుల నాగరులఁ
గూరిమి నందఱుఁ గూడ రప్పించి
యతట గురునాథు ననుమతంబునను

సంతోషచిత్తుండై జాతకర్మంబు
నలరంగ జేయించెనపుడు పుత్రునకుఁ
జెలువు మీఱఁగ నింద్రసేనాహ్వయంబు
నొనరంగఁబెట్టి పుత్రోత్సవంబెల్ల
ననురక్తిజేయించె నపుడు భూసురుల
కాదిభూదాన కన్యాదానములను
గోదానములఁ జేసి కుతుకం బెలర్ప
తక్కినవారి కందఱ కభీష్టముల
మక్కువనొసఁగి యిమ్మహినేలుచుండె.

కలిపురుషుడు చింతించుట

అదియెల్ల గనుఁగొని యా కలిపురుషుఁ
డెదలోనఁ జింతాసమేతుడై యపుడు
దమయంతితోగూడ ధారుణీశ్వరుఁడు
కొమరునిఁబడసి యీకువలయంబెల్ల
నేలుచున్నాఁడు నేనిటవచ్చి యెంత
కాలమాయెను నింతఘనుడౌట నెఱుఁగ
నెఱిఁగిన నే నేల యిందు వచ్చెదను
హరిహరబ్రహ్మాదు లంతటివారి
నామాయఁబడవైతు నరులు నాకెంత
యేమిసేయుదునింక యేవిచారంబు
కొమరువల్లను జెడ్డ కోమటివలెను
దెమలక నేవెంటఁ దిరుగఁబోయెదను
వనజాక్షికిని స్వయంవరమన్నమాట
విని దానిపరియింతు వేవేగ నను‌చు
పురుహూతకడకేల పోయిచెప్పితిని

సురనాయకుండు మున్ను సుదతినిగోరి
పోతిమి నీవేల పోయెద వనుచు
నాతోడ నతఁ డేల నవ్వుచుఁ జెప్పెఁ
గోపించి యప్పు డా కుధరరారితోడ
నేవునజలపట్టి యేగతి నైనఁ
దలఁచి గారింపెదఁ గాక నే ననుచు
పలుదెరంగుల నేల పంతమాడితిని
పురుహూతుఁడప్పుడు పోవలదంచు
పరసతఁ బలుమారు చాటించిచెప్పె
వీఁకతో నామాట వినక వచ్చితిని
నాకేశుఁ డేమని నవ్వునో యెఱుఁగ
నితఁ డనాచారంబు లెన్నఁడు నేయు
నతివేగ నేనెప్పుడంటఁ బోయెదను
దనవల్ల బొసఁగని తప్పులు గలవె
యనియని తలపోసి యంతలో రోసి
యింతకాలముగాచి యిఁక నేనుబోవ
పంతంబె యదియు నే పట్టున నైనఁ
జేరి యీప్రతిన నే జెల్లింప కున్న
నారయ ననువుగాదంద్రు లోకముల
ననియిట్లు మదిలోన నందందఁదలచు
చును గాచియుండె నశుద్ధిగోరుచును

దమయంతి కుమార్తెను కనుట

అంతటఁ గొన్నాళ్ళకా దమయంతి
కాంతాలలామంబు గర్భంబు దాల్చి
సానఁబట్టిన మరుశరమ్మో యనంగ

మానుగా నొక్కకుమారితఁ గనియె
ధరణీశుఁ డప్పుడు తన తనూభవకు
నరుదార జాతకర్మాదుల నెల్ల
నేత్రోత్సవంబుగా నిఖిలంబుఁ దీర్చి
పుత్రికోత్సవమిట్లు బుధులెన్న నడపి
చెన్ను మీఱఁగ నింద్రసేనాహ్వయంబు
కన్నియకిడి ధరాకాంతులు మెచ్చ
నట నశ్వమేధాదియజనముల్ చేసి
కుటిలుల నడఁచి సద్గుణుల రక్షించి
మాచారవంతుఁడై యతిధర్మబుద్ధి
భూచక్రమెల్ల నేర్పున నేలుచుండె.

కలి మాయ

ఆమాడ్కి నలుఁడేలు నతఁ డొక్కనాఁడు
వేమారుదాశౌచ విధిసల్పునపుడు
మడిమనొక్కించుక మాత్రంబునీటఁ
దడిపకపడియున్న ధర్మేతరుండు
ముదమున నది దెల్లముగ నిరీక్షించి
యుదయుఁడై తన కార్యమంత యీడేరె
నని పొంగితనను మేనంతయుఁదాచి
పనివడి సూక్ష్మరూపమ్ము ధరించి
యొడలున భారమై యుండక యెప్పు
డుడుగక యచ్చోట నూఁతగా నిలిచె
నది గాన లేఁడయ్యె నవనీశ్వరుండు
విదిపసత్కర్మము ర్వేగదీర్చుచును
నిర్మలచిత్తుఁ డై నెలఁతయుఁ దాను

ధర్మంబు దప్పక ధర నేలుచుండి
యొకనాఁడు నలవిభుం డుత్సాహి యగుచు
సకలంకరత్న సింహాసనాసీను

కలి కృత్రిమ కిరాతుఁడై నలునికడ కరిగి యతని
వేటాడ రమ్మని పిల్చుట

నిరుగడభట పురోహిత మంత్రివంశ
గురులు కొల్వఁగ నిండుకొలువున్న వేళ
గలి తన రూపంబు కఠినరూపంబు
గల యొక బోయయై కను పట్టినపుడు
కుఱుచ వెంట్రుకలపైఁ గుళ్లాయిఁ బెట్టి
సెఱుతుగాఁ జిగురుటాకులు కొన్ని వట్టి
సారెకు బిరుసుమీసముల నుల్కుచును
ఘోరనఁ జనుదెంచి భూనాథుఁగాంచి
పెలువందమింటికిఁ జెయ్యెత్తి మ్రొక్కి
మలఁకలఁదనజాతి మాటలననియె
విను సామి నాచిన్న విన్నపం బొకటి
ఘనమైన దేవర ఘనమైన దొరవు
మేమున్నపురమున మృగములు పెక్కు
సామికైన గణింప శక్యంబుగాదు
మన్నుబోతులు మఱి మదపుటేనుగులు
దున్నలు సింగముల్లొలఁగక యుండు
లేడిపిల్లలు దుప్పులే నూరుకోట్లు
కూడిమిన్నులఁదాకుఁ గుప్పించి దాటి
బందులు నదులవెంబడి ద్రవ్వుచుండు
గుండేటిగుంపులు గుప్పించి దాఁటు

నెలుఁగులు చీమల నెగఁబీల్చుఁబుట్ట
విలమల గుహాలందు బెబ్బుల్చిఱుత
పులులు గోండ్రిలుచుండు బూరుహామ్ముల
ఔగువ్వలును గండభేరున్డములును
లావుకల్చిలుకలు కలకుముకుల్జిలుగు
పావురంబులు సాళువపుడెగగుములు
పొలుపొందగా మృగంబులు ఖగంబులును
గలవిట్లు మేమున్న కాంతారభూమి
నావింత లన్ని యేమని విన్నవింతు
భావించి కన్నులపండువుగాఁగ
మేటిఘోటకమెక్కి మృగములతోడ
వేఁటలాడఁగ మీరు వేంచేయవలయు
ననపుడు మోదించి యాత్మ నూహించి
యొనరంగ వానికి నుడుగర లిచ్చి
యరుగుము రేపటికాలాగే మేము
దపుదెంచెదము వేఁటలాడంగ ననిన
విని బోయవాఁడంత వేవేగఁగదలి
చని పురి వెడలియిచ్చ నదృశ్యుఁడయ్యె
మనుజేంద్రుఁ డంతట మంత్రినిజూచి
యనురక్తితో వేటలాడంగవలయు
మనము రేపటికి సమ్మదముదైవార
ననిపల్కుచుండఁగా నంతలోపలను
విపుల తేజముమాని వెసఁగప్పుమీఱి
యపర భాగంబున నర్కుండు గ్రుంకె
జగదీశ్వరుఁడుకొల్వు చాలించి లేచి

నగరి లోపలికేగె నయమార్గమునను
నలిరేగి యంతలో నాల్గు దిక్కులను
బలువైన చీఁకటుల్పార్వె నందంద
కలువలు వికసించెఁ గమలము ల్మొగిచెఁ
దళతళవినువీథిఁ దారరువాడమె
నంతఁ జంద్రోదయంబైనను ధాత్రి
నెంతయు వెన్నెల లెసఁగె నాపిదపఁ
గమలబాంధవుడు నిక్కముగ నీ దిశకు
నమరంగ నిదె వచ్చునని పల్కవచ్చు
వేఁగులవాఁడుబోలె వేఁగుచుక్క
బాగుగా పూర్వ దిగ్భాగంబునందుఁ
జూపట్టినంతలోఁ జుక్కలుమాసె
నేవు మీఱగఁ బక్షులెలుగిచ్చి కూసెఁ
దరిగెఁగేకి గుహాంతర దీపరుచులు
పొరిఁబొరి గుర్కుటంబులు గూయదొడగె.
ముదమంది తామరల్ముఖములు విచ్చె
బొదలక కల్వగుంపులు చింతనొందె
బొరిఁబొరి పాములు పుట్టలఁజేరెఁ
దఱుపైన భూతముల్తలచూడ వెఱచెఁ
దనరిన యింద్రదనంద వనంబునను
ఘనతఁ బూచిన కింశుకంబో యనంగఁ
నరుణోదయంబయ్యె నంతలోపలను
ధరణీసులచేత దాఁబూజఁగొనుచుఁ
దపములమెచ్చు నెత్తమ్ములహెచ్చు
తపనుండు పూర్వభూధర మెక్కినంత

# నలుడు వేటకేగుట

నలరాజు మేల్కొని నగరు వెల్వెడలి
వెలయంగ సంధ్యాది విధులొప్పదీర్చి
కుంకుమపన్నీరుఁ గూర్చిన గంధ
పంకంబుఁ దన మేన బాగుగా నలఁది
నలువుగాఁగ గస్తూరినామంబుఁ దీర్చి
చెలఁగుచు విరిసరుల్విగ నిండఁదుఱిమి
బిరుసువన్నెరుమాలఁ బెంపొందఁజుట్టి
సరిలేని రత్నభూషణములు పెట్టి
వరుస బంగరు వ్రాతవ్రాసిన జిలుఁగు
సరిగెదుప్పటి మొల సరగునఁదాల్చి
పాటించి కన్నులపండువుగాఁగ
వేఁటశృంగారంబు వెలయంగ మించి
యపరిమితోత్సాహుఁడగుచు నలుండు
సపరివారుండయి చనుదెంచి యపుడు
విపినయాత్రాభేరి వేయించుటయును
నపుడె యా బ్రహ్మాండ పగలినట్లయ్యె
భూతల మదరె నభోవీధి బెదరె
భీతిల్లెగ్రహములు బెగడె భూతములు
జలధులు గలఁగె నక్షత్రముల్రాలెఁ
గులగిరుల్గదలె దిక్కు చెలువ్రీలెనపుడు
శత్రురాజన్యులు సకలంబుడించి
మిత్రుల డించి నమ్మినవారి డించి
హయముల డించి భటావళి డించి
రయమున వారణరథముల డించి

కొందఱు కొండల గురుతరాటవులఁ
గొందఱు వట్టిరి గుండెలు బెదర
చపలతఁ బ్రజలు మూర్ఛల నొందిరంత
నపరిమితోత్సాహులై వేటకాండ్రు
కరుచమీసమ్ములు గుజ్జురూపములు
బిరుసగు మేనులు పెద్దపిక్కలును
చిఱుతవీనుల నెఱ్ఱ జీర్ల కన్నులును
నెరువింద పూసలఁ గొమరొప్పపేర్లు
నెఱిమించఁ దిలకించు నిలిదట్టులును
సెఱుచకాసెల చెంగుకోనలు బిగించి
పట్టుచుంగులుమీఁదఁ బ్రబలిదనర్పఁ
జుట్టుకాసెలు నిండ సురియలు చెక్కి
పిడములు మొలఁజెక్కి బిరుదు మాష్టీలు
జెడిగొంద వీనుల బిల్లలుగట్టి
కడిది మెకంబులు కఱవకయుండఁ
దడఁబడ బాములు దరుమకయుండ
వలదైనబదనికల్వాకట్లు వేళ్ళ
జరముళ్ళఁదిరముఁగా దాల్చిమేనులకు
దఱుచుగామించు దంతపు బిళ్ళసమును
చిఱుతకాసెలువల చెంపల నమర
వలలబండ్లును బోగువారు మోకులును
బలువాఁడి మీఱిన పందిబల్లెములు
చిగురు కోలెలుమేటి చిక్కములురులు
తెగ నీలిమబ్బులఁ ద్రిప్పుడు త్రాళ్ళు
పిగిలి చెండ్లమరిన పెద్ద యీటెలును

బిగి వెండికట్లచేఁ జెలఁగు సింగిణులు
మెలవు సింగంబులమీఁదను గలియఁ
గలిగిన వేటకుక్కలను బంగారు
గొలుసులఁబట్టించి ఘోరాసనములు
గలిగి భయంకరాకారులై వెడలి
రంతట నలవసుధాధీశుఁడధిక
సంతోషమున మణిస్యందనంబందుఁ
దనయుండు మంత్రియుఁదన కూర్మిసతియు
దను గొల్వఁగాఁ బ్రమోదంబున నెక్కి
భేరి వేయించెను బృథివిగంపింప
వారక దొర లిరువంకలఁ గొలువ
జనవల్లభుఁడు వేఁటఁ జనుదెంచెనపుడు
గొనకొని నల్లనికొండలో యనఁగ

మృగముల ఉత్సాహము

కరమొప్ప నవ్వేఁటకాండ్రు వేవేగ
సరదంబు ముందఱ నందంద రాఁగ
బలుసింగములనైనఁ బాఱిపోనీక
బలమునగుండియ ల్జారఁ గ్రుమ్మెదము
పులినైన గవిఁజొచ్చి పొట్టేలివలెను
నిలమీదఁబడ గుమ్మిమీడ్చి తెచ్చెదము
మదగజంబులనైన మదములడంచి
పదపడివిడువక పట్టి తెచ్చెదము
దొరసి మిన్నులఁబాఱు దుప్పులనైన
బిరబిర ఖండించి బేగి తెచ్చెదము
హరిహవరాహంబుల నటునిటుఁ దఱిమి

జిరజిరకండలు చెండిఁ దెచ్చెము
పులులఁగానములఁ బోనీకచేతి
బలిమి బల్లెంబులపాలు చేసెదము
ధరణీశ యంచుఁ బంతములాడురునుచు
నరుగుచో నెదుటనింపై మాతులుంగ

నలుఁడు వేటాడుట

భల్లాతకీపారిభద్ర మధూక
సల్లకకురువక సాలహింతాల
బదరితింత్రిణీబిల్వ పాటలీక్రముక
కదళీవటాశ్వత్థ ఖర్జూరలుంగ
పనస పిప్పలనింబ బంధూకసరళ
ఘనసారతాళమా కందాదితరులు
ఘనపదంబంటి చుక్కలరాయుచుండఁ
గొనకొని ముప్పిరిగొనుచు నేలాది
మల్లికాది కలతల్ మహిజకుంజముల
నల్లినరవిరశ్మి యడరని యిరుల
నడవిఁ బ్రవేశించి యా రాజవిభుఁడు
కడువడి మేఘముల్ గర్జించినట్లు
ముదమొప్పశింజిని మ్రోయించెనపుడు
బెదరి మృగావళి భీతిల్లికలఁగి
పిలపిల చెవులెల్ల బిక్కరించుకొని
సొలసినల్ దిక్కులు చూచుచునుండ
పిడుగులకంటెను బెడిదమైనట్టి
కడువాఁడితూఁపు లొక్కట నలుం డేయఁ
దనువుల నాటినఁ దత్తరించుచును

గాన ప్రాణముల దన్నుకొనెడి బెబ్బులులు
విలవిల ప్రాణము ల్విడుచు సింగములు
బలునెత్తురులఁ దోగిపడెడు బెబ్బులులు
వడిమెడల్వ్రేగి నేలవ్రాలు దుప్పులును
బడిబడి పోలేక పండు గండకములును
ఉురములుదెగి భువికొరగు దంతులును
శిరములు దెగిపడు సింగిలీకములు
పలుమారు గూయుచుబడెడు జింకలను
దెలియక భయమున ద్రెళ్ళునక్కలును
యవనిపైఁబడి పొరలాడు పందులును
దవిలిన పొదలలో దాగుకుందేళు
ప్రకృతిమృగముల నేపడగించి
ధారుణీశ్వరుఁ డంత దయదాల్చి నిల్చి
వేఁట చాలించిన వేటకాండ్రడవి
దాఁటుంచి మదిఁదప్పి దారిన యట్టి
ఘనమృగంబుల మీదఁ గదియుచు భీతి
గాన సివంగులనుసి కొలిపి బాణముల
పదములు ఖండించి పార్శ్వముల్ నఱికి
రథములు గెడపి కరంబులు ద్రుంచి
నఖములు దునిమి కర్ణములు ఛేదించి
ముఖములు చెక్కి కొమ్ములు నుగ్గుచేసి
నడుములు నఱికి చూర్ణంబు గావించి
తొడలు చెండాడి కత్తులు ఛేదించి
ముక్కులు చెక్కులు మూపులు తలలు
ప్రక్కలు పిక్కలు బరులుని దరులు

కరములు బిరములు కాళ్ళును వ్రేళ్ళు
శిరములు పిఱుదులు చెవులు ఫాలమ్ము
లుత్తరీ నిదియది యని చెప్పరాక
కత్తుల పచ్చడిగాఁ గోసి రట్లు
తుత్తుము రయి రూపుదోపక కలసి
నెత్తురు మడుఁగుల నెఱిఁ దేలియాడ
వలకొడ్డియురులొడ్డి వాగులుగట్టి
కలయ మచ్చులుజల్లి కనములు కట్టి
యేజాతిపక్షు లేయేరీతిఁ బలుకు
నాజాడ బలుకుల నపుడు పిల్చుచును
దిరుగుడు త్రాళ్ళను దెరఁగొప్పఁగట్టి
యురులొడ్డి జిగురునను సురుగాలముల
సాళువంబుల మేటిజక్కువంబులను
లాలన నాడెడు రావుకంబులను
కముజుల జిలుకల గ్రౌంచ పక్షులను
భ్రమియించు పూరేండ్ల బావురంబులను
బెళగు గువ్వలను గొంగపిండుల నిట్లు
పులుగుల నన్నిటి బోరనఁ బట్టి
వేఁటచాలించి యా పృథివీశుకడకు
మేటిదంతంబులు మేటిజల్లులునుఁ
గరిశిరంబులోని ఘనమౌక్తికములు
వరుసతోఁ బునుగు జవ్వాది కస్తూరి
గడువేడ్కఁ గొనితెచ్చి గానుకలియ్య
తడయక యవియెల్ల దమయంతి కిచ్చి
వరగంగ వారికి బహుమాన మిచ్చి

మురువున దన మంత్రి మోము వీక్షించి
తలఁపున నీవేఁట తమకంబు కతనఁ
వలఁకొని మన మెంత దవ్వు వచ్చితిమి
పురమార్గమున నలు డొక సరోవరముఁ జూచుట
యనుచును దనపురి కరుదెంచు నెడను
దనరిన వనదేవతలు వేడ్కఁజూచు
బాగైననిద్దంపు స్ఫటికదర్పణము
లాగున నీలోత్పలంబులచేతఁ
దఱుచైన కమ్మగెం దమ్ములచేత
మెఱుగు నీలపు గుండ్లు మెచ్చనితీరు
మెఱయించు మేటితుమ్మెద గుంపుచేత
సలలితంబగు క్రౌంచ సంఘంబుచేతఁ
బైడి తెక్కలుగల పక్షులచేత
వాడిగోరుల గోరువంకలచేత
బలువుగానున్నట్టి బకములచేత
సలలితంబగు క్రౌంచ సంఘంబుచేత
గ్రమ మొప్పఁ జక్రవాకంబులచేత
రమణీయమై తదారామనీరంధ్ర
కలకల శబ్దసంగతమైనయొక్క
కొలను గనుంగొని కువలయేశ్వరుడు
దరుణియుఁదాన నత్తరు తేరుదిగ్గి
కరతలంబున మంత్రి కరమూఁతఁగొనుచు
జలజాకరముఁ జొచ్చి జలములు గ్రోలి
యలరంగ నచ్చోట నతిచిత్రముగను
జెలువుమీఱఁగ జగజెంపుఁగా బ్రబలి

పిచ్చిల్లు సహకార వృక్షంబునీడ
సరసౌజపత్రముల్ చాలుగా నెఱపి
యొరపుగాఁదలిరాకు లొనరంగఁ జేర్చి
పఱచిన మృదువైన పానుపుమీఁద
ధరణీశుఁ డధిక మోదంబుతోడుతను
దఱుకునఁ దలకును దమయంతి తొడలు
తలగడగాఁజేసి తగవిశ్రమించె
గురుతుగా మురువంపు గొనలనువచ్చు
సురటివక్రుగాలి సుడియంగ ద్రిప్ప

నలమహారాజు కలగనుట

నలసి తాఁగను మోడ్చునంత లోపలను
గలఁగి యొప్పనికలఁగని మేలుగాంచి
దిగ్గనలేచి నల్దిక్కులు చూచి
యగ్గలంబుగభీతి నందుచు వడఁక
నమ్మానవాధీశు నప్పుడు చూచి
యమ్మానినీమణి యతిభక్తితోడ
నరుదైన కెంజెమ్మినలరించు ముద్దు
కలమునఁ జెలువొందఁగా వీపుఁజఱచి
రమణీయ మగునవరత్న కంకణము
రమణున కప్పుడు రక్షగాఁ గట్టి
యిదియేమి వెఱచితి యినకులాధీశ
మదిలోన నీవు సామాన్యునివతెను
వక్రంబు నీభూమి వసియింపనీక
చక్రంబు పనిసేయ జగము నేలుదువు
ఘనుఁడవు సకల లక్షణ గుణోన్నతుఁడ

వను సమజయశాలి నర్కవంశజుఁడ
పనితన్నుఁ దెలిపిన యా పువ్వుఁబోణిఁ
గనుగొని నలమహీకాంతుఁ డిట్లనియె
నెలనాగ యేమని యెఱుఁగంగరాదు
కలఁగకుకొఱగాని కలగంటి నిపుడు
తెలియఁజెప్పెద దాని తెరగెల్ల వినవె
యలివేణి యీ రాజ్యమంతయు మనము
విడిచి ఖిన్నులమౌచు విపినంబులోన
సుడుగక యిద్దఱ మొక చీరఁ గట్టి
పడువడి బాధలఁబడి కొంతకాల
మరిగిన పిదప శ్రీహరి కటాక్షమున
మనము రాజ్యసుఖాప్తి మన గంటినిప్పు
డని యిట్లు దుస్స్వప్న మధీపతిజెప్పె
వెఱచి తావెఱవని విధమునఁ బతికి
నరయంగ దీనికి నడల నేమిటికి
నందుల కేమి శ్రీహరియాజ్ఞ మీఱి
పొందునే దుఃఖంబు భూతలాధీశ
సత్యమే జయ మని సకల శాస్త్రముల
నిత్యంబుగాఁ బల్కు నిఖిలంబులోన
నటుగాన సత్యంబె యధికధర్మంబు
పటుగతి భాగ్యసంపదగల్గు మనకు
నని యిట్లు పలుకంగ నట వివేకించి
తన బలమంతయుఁ దద్దయుఁ గొలువ
భేరీరవంబులు పెల్లుగాఁ మ్రోయ
ధారుణీనాథుండు తన పురి కరిగి

వెలయుచుఁ గలిమాయ వేఱొక్క వేళ
దెలిసియుఁ దెలియని తెఱగుననుండు
భీముని వరపుత్రి బిసరుహనేత్ర
శ్యామాలలామ నిర్భరగుణోద్ధామ
పరమ పతివ్రత బహుధర్మనిరత
వరరూపలావణ్య వైభవోపేత
దమయంతి సత్యంబు దరలంగ నీక
నమరిన వేడ్కతో నప్పటప్పటికి
దన ప్రాణవిభునకు ధర్మశాస్త్రముల
ననురక్తి జెప్పగా నలఁడుఁ సత్యమున

కలి ముసలి బ్రాహ్మణుఁడై నలునివద్దకు వచ్చుట

జెలువంద రాజ్యంబు సేయుచునుండె
గలిరాజు మఱికొంత కాలంబు వెనుక
మనమున దలచి యమ్మనుజనాయకుని
ఘనముగా నేఁ బన్ని కపట జూదమున
గల రాజ్యమెల్ల నొక్కటన యోడించి
తొలఁగిపోఁజేసెద తొలుతఁగా నలకు
నలనాడు ధరణీధరా రాతితోఁడ
బలికినవంతంబు ప్రబలఁజెల్లింతుఁ
ననియొక్క చెనటిబ్రాహ్మణ రూపుదాల్చి
తను జూచువారలందఱు నవ్వుచుండ
గఱుకు నల్లని మేను కఠినస్వరంబు
కుఱుచపాదంబులు క్రూరదంష్ట్రలును
విల్లువంకల కాళ్ళు విఱిసిన బొమలు
పల్గమీసంబు లొప్పని గుంట కనులు

నరిసిన గడ్డంబు నడ్డనాసికయుఁ
బరవుగాఁ బెట్టిన వట్టెవర్ధనము
కడిదియాబొడ్డును గడుబొడ్కి నోరు
నిడుపైన మెడయునునిక్కిన తొమ్మ
బలువుగా మాసిన ప్రాతదోవతియు
వెలయంగ చేనొక్క వేణుదండంబు
వలనుగాఁ జిడిముడి వైచు బంచెంబుఁ
గలిగి భయంకరాకారుడై నలుని
దాయపుష్కరుడను దారుణీనాథు
డాయెడఁదనవార లందఱు గొలువఁ
బొలుపొంద దన పురంబున జిత్రమలర
గొలువున్న యత్తరి గొబ్బునఁబోయి
భుజగంబుకై వడిబొడగాంచి యతని
విజయోస్తు యనుచు దీవించి యిట్లనియె
నన్నెవ్వడో యని నరనాథబుద్ధి
నెన్నకు కలి యని యెఱుఁగుము నన్ను
దురితకర్మములకు దొరనగు నాకు
సరియైనవాడు ముజ్జగముల లేడు
హరిహర బ్రహ్మశక్రాదులైన
దరలక పెక్కు బాధలఁ బెట్టువాడ
మనుజేశ నన్ను సామాన్యుఁ డటంచు
నొనర నీ మదిలోన నుంచకు మెపుడు
విరసత నితఁ డేమి వెతఁబెట్టఁదలచి
యరుదెంచెనో యని యడలకు మీవు
పన్నుగా నీకొక్క పనిఁ జెప్పఁదలచి
క్రన్నన నేను నీ కడకు వచ్చితిని

యఱిముఖి వేవేగ నావనిసేయ
మఱి నీవు వినకున్న మాచిత్తమడలు
నవనీశ యీకార్యమంతయు నిపుడు
వివరంబుగా నీకు వివరింతు నింక
నలివేణి దమయంతి యనియెడు పేరఁ
గలదొక్క యువతి చక్కని ముద్దుగుమ్మ
నలినాక్షిపుట్టిన నాటనుండియును
నలరుచునేఁ బెండ్లియాడెద ననుచు
కాచియుండగ నన్నుఁ గాదని మిగుల
నా చంద్రముఖిఁ బెండ్లియాడి మాణిక్య
ములవంటి యిద్దఱు ముద్దుబిడ్డలను
యలరంగ గాంచి యీయవని రాజ్యంబు
నేలుచున్నాడు నన్నెన్నక నలుఁడు
తాలిమి గొనదు చిత్తం బిట్టిపనులు
సరిపోలుయుండునే జగతి నేరికని
నరుదెంచి నేపెండ్లియాడెతు దాని
నెలమి దాను వరింప నెంతటివాడు
బలభేదికన్న దిక్పాలురకన్న
నరనాథ ధారుణీ నాథులకన్న
సరసతి నాకన్న చక్కనివాఁడు
నలుఁడంచు వాని నానాతి వరించె
నిలతలాధీశ నీ కిది సమ్మతంబె
యెంతైన నలుఁడు నాయిష్ట మారయక
నింత కార్యసేసె నికజూడుమైన

శనైశ్చరుఁడు పుష్కరుని నలునితో జూదమాడుమని జెప్పుట

నేమాయె వేవేగ నేగి జూదంబు
నా మహీశునితోడ నాడుము నీవు
చెలువొందగాను పాచికలలోనుండి
నిలచి యోడింతునే నిఖిలరాజ్యంబు
నేకచక్రంబుగా నీ యిల నెల్లఁ
జేకొని వేడ్క నీచేత నేలింతు
నన్ని కార్యంబుల కలరుచు నేనె
యున్నాడ నీ కేల యుర్వీశ భీతి
యనవుడు సంతోషమంది పుష్కరుఁడు
పీనయంబు చేఁగలిగి వేల్పునకనియె
బొసగంగయేను నీ బుద్ధులుదాఁట
వసుమతి నే నెంతవాఁడనో దేవ
యారూఢి జూదంబు నాడెద ననుచు
నారాజుకడకు నే నరిగితినేని
సరసతనుదన సముడనటంచు
నెఱిఁగి నాతోఁ బంతమిడి భ్రష్టునట్టు
లాడునే జూదంబు నతఁడు వద్దనక
వేడుకతోడుత విను మేను జనిన
ననపుడు నే వాని యాత్మలోనుండి
యనురక్తితో జూదమాడెడు బుద్ధి
బుట్టింతు వేవేగఁ బొమ్ము నీ కేల
యిట్టి విచారంబు వేగతి నైన
వానితోఁ జలపోరి వానిరాజ్యంబు
పూని నీకియ్యగపోను నీయానఁ

వెలువంద రాజ్యము సేయు మటంచు
పలికి యదృశ్యుడై పాపవల్లభుఁడు

## పుష్కరుఁడు నలునికడకు వచ్చుట

వినియె నా నలమహీశ్వరు డొక్కనాడు
మనమలరఁగ సభామంటపమునకు
జనుదెంచి సకలరాజన్యులు భటులు
ఘనులైన మంత్రిపుంగవులు బాంధవులు
హితులుగాయక పురోహితులు నాశ్రితులు
నతివేడ్కఁ గొలువ సింహాసనమందు
నమరంగఁ గూర్చుండి యతివేడ్కఁ బోడ
టమణులు వింజామరంబులు వీవ
వారక భటులు కైవారము ల్సేయ
సారెకు గాయకుల్ సన్నుతి సేయ
కవిబంధిమాగధుల్ గడఁగి కీర్తింపఁ
బ్రవిమల సకల సంపదలచే నిట్లు
దివిజులతోనున్న దేవేంద్రుపగిది
కువలయేశుఁడు నిండు కొలువున్న వేళ
జననాథుకడకు బుష్కరభూవిభుండు
తనవారలెల్ల మోదంబునఁ గొలువఁ
జనుదెంచి యతనికి సద్భక్తి మ్రొక్కి
వినుతులు సేయ నవ్విభుడు పుష్కరుని
యనుపమగతి నొక్క యర్హాసనమున
నునిచిన మోదించి యుచిత వాక్యముల
బరణామమేయన బార్థివుఁ నడుగ
హరికటాక్షంబున నందంద మాకు

ఘనతర సౌఖ్యంబుగలుగు నెల్లపుడు
మనుజాధినాయక మఱి నీకు శుభమె
యనపుడు నీదయ నవనీతలేశ
యనుప సుఖముగాక సుఖంబు గలదె
యనపుడు నిషధేశుఁ డతిముద మంది
నని యె నిట్లని పుష్కరాఖ్యునితోడ
ధరణీశ నీవేమి తలపునఁ దలఁచి
కరమొప్ప నేఁడు మాకడకు వచ్చితివి
యెన్నఁడురావు నీ వేతెంచు టరిది
క్రన్నన వచ్చిన కార్యంబు చెప్పు
మనవుడు పుష్కరుఁ డవనీశుఁ జూచి
గొనకొని నినుఁజూడఁ గోరి వచ్చితిని
యిదియింతెకాని యొండేమియు లేదు
ముదమంది యియ్యెడ ముచ్చటదీర
మనమిద్దరముఁ గూడి మఱివేడ్క జూడ
మనురక్తి మీఱఁగ నాడుదమనిన
ధరణీతలేశుఁడు తలయూచి పలికె
ధరలోన మాకు జూదం బాడఁదగదు
ప్రవిమల సత్యసంపద బాసిపోవు
నవివేక మొలయు దురాగ్రహం బొదవు
నటుగాన జూదంబు నాడంగ దగదు
అటువంటి పని సేయ నర్హమే నీకు
నలునకుఁ గలి జూదమాడ బుద్ధి పుట్టించుట
ననిపల్కుచుండఁగా నప్పుడు కలియు
మనమునఁ బ్రేరేప మది జూదమాడ

గోరిక వొసఁగి యక్కువలయాధిపుని
గారవించి నలుండు కడగి యిట్లనియె
పగడసాలాటంగఁ బ్రమదంబునొంది
జగదీశ యిపటికేఁ జనుదెంచి నపుడు
నినుఁజిన్న పుచ్చుట నీతిగాదింక
ననురక్తి నొకమాట యాడుద మనుచు
మేలిమిపైడి నిర్మించిన పగడ
సాలఁ దెప్పించి యచ్చటఁ జక్కవఱచి
తిరమొప్పగను నాల్గుదిక్కులయందు
పరగున సారెలు చక్కఁగా నిలిపి
యొనరంగఁ బందెమేమని నలుం డిట్టు
లనవిని పుష్కరుం డనియె నవ్వుచును
యినకులాధీశ్వర నేనోడితేని
పనిబూని యేను నీ బంట నయ్యెదను
నేరుపు నెఱుఁగక నీవోడితేని
నీ రాజ్యమంతయు నెమ్మినా కొసఁగు
మనె నట్టిపెడఁబాటు కాత్మలో మెచ్చి
వెనుకొన్న వేడ్కతో వెలయు బుష్కరు
దొడరె జూదం బాడఁదొడఁగి నలుఁడు
తడయక మేటిదంతపు పాచికలను
యమరించి యొక బారయనుచు దొర్లించి
సమముగా దుగదచ్చి చౌవంశపగడ
యిత్తుగ యనివార లిరువుర నాడ
నత్తరి బాచిక లందుండి మఱియు
కలి నలధారుణీ కాంతునిచేతఁ
బలుమాడు బందెంబుఁ బడకుండఁజేయ

నలుఁ డది చూచి వింతిగదాయటంచుఁ
జలము కోపంబు రోషంబును మూఁడు
ముప్పిరిఁగొనఁగ నాముదువున నాడ
నప్పుడు కలి మాయ నరయంగ లేక

నలుఁడు కలిమాయచేఁ బుష్కరునకు సర్వస్వము ఓడుట

సరిలేని మత్తగజంబుల నోడెఁ
గరకరి గజతురంగంబుల నోడెఁ
దడఁబడక గురురథంబుల నోడెఁ
గడఁగి నిండిన ధాన్య కణకంబు లోడె
పసగల్గు బంగారు పల్లకి నోడె
మసలక ఛత్రచామరముల నోడె
రంగైన దివ్యాంబరంబుల నోడె
సంగీతములఁ బాలబాడు సఖియల నోడె
గొమరారు ముత్యాల గొడుగుల నోడె
రమణీయమగు ధనరాసుల నోడె
వారక భటజన వర్గంబు నోడె
దేరుల నోడె మేదిని నోడుతఱిని
సచివుండు మదిలోనఁ జాల దపించి
యతని వాక్యంబుల నుర్వీశుతోడ
ననియె నీధారుణియందు నో దేవ
యనఘుల కిట్టి దుర్వ్యసనంబు గలదె
యిదియేమి పనియని యిప్పుడు దోఁచె
మదిలోన నిట్లాడ మఱచితే నీతి
యీ జూద మాడుట యేమి పౌరుషము
రాజేంద్ర నగరునకు రండు పోవలయు

నదె నిన్నుఁ జెలులు రమ్మని పిలిచెదరు
ఇది వేళగాదు నీ వీయాట నిలుపు
ధరణీశ యాఁకలిదప్పులు మఱచి
తలలక యాడంగ ధర్మంబుగాదు
లేరమ్మిఁకాట చాలింపుము వెనుక
నాూగె వేంచేసి యాడెదుగాక
యని పల్కి చేయిపట్టి యవనికి వెనుఁగఁ
గనుల లెఱ్ఱగఁజేసి కరి కాంచి సింహ
ముఱకఁ జూచినరీతి నూరక చూచి
పసవడి గర్జించి పలికె భూవిభుఁడు
సీకేల యిటువంటి నీతులుచెప్పఁ
జేకొని యెవ్వరు చెప్పి రమ్మనిరి
విడువిడుమని చెయ్యి విడిపించికొనుచు
నుడుగక కలి మాయ నొగినాడదొడగె

దమయంతి నలుఁడు జూదమాడి యోడెననీ మంత్రివలన
నెఱింగి చింతించుట

నప్పుడు చింతించి యా మంత్రివరుడు
తప్పక నలుడు జూదంబాడు తెఱఁగు
చేరివద్దని తాను జెప్పినవిధము
ధారుణి నొక్కటి దక్క నంతయును
నురువడితోడుత నోడిన తెఱగు
కెరలి యాతఁడు కోపగించిన తెఱగు
దమయంతి కప్పుడు తగఁజెప్పబనిచె
గ్రమముగా నంతయుఁ గొంత యాలించి
యిదియేమి పనివచ్చె నిఁక నేమి సేతు

పచలక తన మంత్రి వాక్యంబు వినక
సదయుడై యీరీతి నాడినయపుడె
ఇది దైవమాయ యొండేమియుఁగాదు
మదిలోన నిఁక ననుమానంబువలన
చెచి యాదిగా నింక నెట్టిదుఃఖంబు
పొదల యేగతి మమ్ముఁ బొందనున్నదియొ
పచంపడి దుస్స్వఫలమెల్ల నిప్పు
డది యేల పోనిచ్చు ననుభవింపకయు
సుమట నేమని వ్రాసెనో మున్ను బ్రహ్మ
తనచేయు పూర్వకృత్యంబులదాఁట
వనజాసనాది దేవలకు వశమె
యిటువంటి జూదంబు లెవరైన మున్ను
తటుకున నాడిరే ధరణిలో ననుచు

దమయంతి పుట్టినింటికి బిడ్డలను వార్ష్ణేయుని వెంటఁ బంపుట

ఇప్పుడు వార్ష్ణేయుఁడనెడు సారథిని
చప్పక రప్పించి తగనంత చెప్పి
కొడుకును గూఁతుర గొనిపోయి వేగ
తడయక మా తల్లిదండ్రులయొద్ద
విడిచి యిక్కడనున్న వృత్తాంతమెల్ల
కడువేగ నెఱిఁగించి కదలి రమ్మనగ
నపుదైన యొక మేటి యరదంబుమీఁద
నిరువుర బిడ్డల నెలమి నెక్కించి
పదువునఁ దోడ్కొని వార్ష్ణేయుఁ డపుడు
పరగంగ నావిధర్భాపురము జేరె

## పురజనులు దుఃఖించుట

నప్పుడు పురము వారందఱుఁ గూడి
తప్పక తమలోనఁ దాము చింతించి
తలపోయఁ దొడఁగిరి ధారుణీశ్వరుఁడు
చెలువంద రాజ్యంబు సేయుచుండగను
సకలజనావళి సంప్రీతిఁబొందె
నిఁక నెట్టులకొ యిది యెఱుగంగరాదు
పోడిమి మనమైనఁ బోయి జూదంబు
నాడంగవలదని యరసి చెప్పుదము
మనమునఁ దన మంత్రి మాటలు వినిన
మనుజనాథుఁడు మన మాటలు వినునె
పూని శుభాశుభంబులు రెండు తనవి
యైనవి తెలియక యాడుచున్నాఁడు
జూదంబు నాడెడు చోరపుష్కరుని
వాదించి పోఁదోలువారు లేరైరొ
యలరి భూపతి జూదమాడఁగఁ
వలదంచు పెద్ద లెవ్వరుఁ జెప్పరైరొ
యవనీశ యీజూద మాడరాదనుచు
నెవరైన భూజను లెఱింగింపరైరొ
ఘనమైన కర్మముల్ గదిసిన వేడుక
వినవచ్చునే యిది విష్ణునికైన
నైనను మన మిపు డందఱు నేగి
మానుమీ జూదంబు మనుజేశ యనుచు
బలుదెఱంగులఁజేరి పలుకుద మొగిని
జెలరేఁగి మన మేమి సేయఁబోయెదము

జూదమాడుట వసిష్ఠుం డెఱిఁగియున్నఁ
గాదని మాన్పడే కష్టజూదంబు
నిఁకనైన నామాని యిటకేగుదెంచి
యకలంక మతితోడ నారాజుగాంచి
యాడఁగూడదు జూద మాడకు మంచు
నేఁడు చెప్పినఁగాని నిల్వనేరాజు
మన మాట నిపుడు సమ్మతమున వినునె
యని పౌరజనులెల్ల ననుమానమునను
జనిచని నలరాజచంద్రునిఁ గాంచి
మునుకొని భయమున మ్రొక్కి యిట్లనిరి

నలునితోఁ బౌరులు జూద మాడవలదని చెప్పుట

మానవాధీశ్వర మమ్ముఁ గావలసి
మానుమీ జూదంబు మది నమ్మరాదు
కపటమైయున్నది గావ యా జూద
మిపుడు చాలింపుమా యిందరితోడు
పయివచ్చు పని సేయఁ బంతంబుగాదు
పయిరానిపని సేయవలయు నేరికిని
యవనీశ గెల్పులేదయ్య నింతైన
తవిలియోటమి గల్గెఁగదింక విడువు
మనవుడు వారల నపు డాగ్రహించి
కనుగొని చెయ్యెత్తి గర్జించి పలికెఁ
జేరి నాకును బుద్ధి చెప్పుడటన్న
వారెవ్వ రనుచు దుర్వారోగ్రుఁ డగుచు
కలియకుఁ డగుచు నాఁకలిగొన్నయట్టి
పులివలె గర్జించి పోఁదోలెఁ బ్రజల

నీరీతి ప్రజలంద జేగిన వెనుక
నారాజు మఱి జూదమాడుచు వరుస

నలుడు పౌరుల మాటలు వినక పుష్కరునకు రాజ్యము నోడుట

తనదైన రాజ్యమంతయు నొడ్డువెట్టి
వెనుకొన్న కలి మాయ వెతచేత నోడె
చెప్పన్న దేశరాజన్యులు మున్ను
కప్పంబు దెచ్చిన కానుక లోడె
నవఖండభూమి మండలముల నోడె
నవలక్ష పర్వతనందుల నోడె
నలయక నోడెను నాల్గు దిక్కులను
యిల నేడు దీవులనెల్లను నోడెఁ
గట్టు చీరలతోడఁ గరిమర్ధి నిలచి
యట్టిట్టుఁదొలగక యన్నలుఁడున్న
నతని గన్గొని పుష్కరాఖ్యుఁడౌ నలుని
సతికి నవ్వార్త నిచ్చలు చెప్పిపనుప
దమయంతి యది విని తన మనంబునను
గ్రమమొప్ప జింతతోఁ గడు వెఱఁగంది
యంతఃపురంబున కప్పుడు వెడలి
కాంతలు పురజనుల్ కడు భయ మంది
చూచుచుండగ నా సుందరి సభ
రాచధర్మము మాని రయమున వచ్చి
యిదియేమి భూనాథ యీ చోద్యమనిన
నదయుఁడై యేమనకతఁ డూరకుండె
నప్పుడు పుష్కరుం డది చూచి నలునిఁ
దప్పక యిప్పుడు తనుమణితోఁగూడి

యీ రాజ్యముననుండ కేకానకైన
జేరఁబొమ్మనిన యాక్షితిపతిఁ జూచి
నలుఁ డిట్లులనియె వోనరనాథ చంద్ర
సలలితంబుగ మేము చనియెద మింకఁ
గలిరాజు మ మ్మింత గాసిపెట్టఁగను
నెలమితో నడవికి నేగెద మేము
నీవింక నిర్ధారుణిని నేలు మకట
యావిధి చేసె నేమందింక ననుచుఁ
బ్రవిమలంబుగ మంత్రి పాటించి తెలియ
వివరింప నేనేల వినకపోయితిని
గర్మ మేమియునైనఁ గావించుఁగాని
కర్మమే మేలును గర్మమే కీడు
కర్మమే దుఃఖపుకారణం బగును
గర్మంబు వచ్చినఁ గైకొన కిపుడు
బొమ్మనఁబోవు నా పూర్వకృతంబు
యమ్మి చూచికినైన దైత్యారికైన
హరునకు నైనఁ బాకారికినైన
సురలకైనను మనుష్యులకన నెంత
యనుభవింపకదీర దదియెల్ల నిక్క
మని యిట్లు తలపోసి యపుడాత్మపత్నిఁ

నల దమయంతులు అడవి కేగుట

గనుఁగొని పలికెను గ్రమముతోడుతను
మనము కానలకు సమ్మతి బోవలయు
మనమున నీఁక జింత మూని రమ్మనిన
విని యా సతిమణీ విభుని వాక్యంబు

జవదాఁటు కప్పుడె సమ్మతి వెడలె
నవనీశుఁ డింతితో నడవికిఁ జనుట
పురజను ల్గనుగొని పురపురఁ బొక్కి
వెఱచుచు దమ తమ వీథుల నిలిచి
గుంపులు గూడుక గుజగుజ రాజ
దంపతులను జూచి తహతహఁ బలికి
రక్కటా యిట్టి మహాపుణ్యమతుల
కీకష్టమును బొందు టేటికిఁ గలిగె
నిటువంటి యాపద లేటికి వచ్చె
నెటువలె బోవునో యేమి సేయుదము
వేరె పుణ్యాత్ములు లేరె సజ్జనులు
వీరికి నాపద వీడు నెద్దాన
నని యిట్లు పురజను లలమడపడఁగఁ
దనుజూచు వారల దాను జూడకయ
దలవంచు కొనుచును దగుసిగ్గుతోడఁ
గలవేధఁ దగిలిన కతమున నిట్లు
పురవీథు లప్పుడు బొందుగా వెడలి
పురపురఁ బొక్కుచుఁ బురినిర్గమించి
కరము చింతించుచుఁ గొంతతోఁగూడ
దొరకొని దైవంబు దూఱుచు జనియె
నక్కట పురజనులు లందంద యపుడు
రక్కసిపుష్కర రాజని వెఱచి
దమయంతితో నల ధరణీశ్వరుఁడు
తము బాసి చనుట కాత్మను గుందిరంత
నప్పుడు నిషధేశుఁ డాపురి వెడలి
తప్పక దమయంతిఁ దగఁజూచి యనియె

నేమి సేయుదు కార్యమిక దప్పివచ్చె
గామిని మన మింక గానలయందు
దైవతంత్రమున నిత్తఱినుండ వలసె
దైవంబుననసేల తమ కర్మమిట్లు
బాధించుచుండంగ బగబట్టినట్లు
వేధించి పుష్కర విభుడు జూదంబు
నాడించి సంపద లన్నియుం గొనియె
బోడిమి చెడియిట్లు పోగలంగ వలసె
ధర్మమార్గంబున దనరుట మనకు
నిర్మల మగుబుద్ధి నెక్కొనుచుండు
నని యిట్లు దమయంతి నపు డూరడించి
పనివడి పురసమీపంబున దనరు
నొక పర్వతము గాంచి యురువివేకమున
నకలంకచిత్తులై యప్పు డిద్దఱును
నుపవాసములనుండి యుదయమైనంత
నపరిమతానురులై దారిబట్టి

నలదమయంతులు వసిష్ఠుని జూచుట

మా వనభూమిలో నాలును మగడు
బోవంగ బోవంగ బొదరిండ్ల నడుమ
బ్రహ్మసమానుడు బ్రహ్మర్షి వరుడు
బ్రహ్మలోకమునుండి వచ్చినట్లున్న
యా వసిష్ఠుని గాంచి యంతదూరమున
సావధానములోడ సారెసారెకును
నలరాజచంద్రుడు నయము మీరంగ
గులకాంతతో గూడ గురుభక్తి యుక్తి

మ్రొక్కిన గనుగొని మునినాయకుండు
నక్కజంబుగ జూచి యప్పు డిట్లనియె
నిదియేమి జననాథ యిందు వచ్చితివి
ముదితతోఁగూడ నీమదమెల్ల దొలగి
ఈవిధి జనుదేర నేమిటఁగలిగె
నా వర్తమానంబె నా కెఱిఁగింపు
మనిముని పలుకంగ నవనీవిభుండు
తనలోన ముదమంది తపసి కిట్లనియె
ఓ వసిష్ఠ మునీంద్ర యో దయాసాంద్ర
నా విన్నపంబెల్ల నయముగా వినుము
గతజన్మ కర్మసంస్కార ఫలంబు
కతన నీ దురవస్థ గలిగె మా కిప్పు
డెఱిఁగి యెఱిఁగి యిట్లేల నన్నడుగ
నరుదంద నేల నేనై విన్నవింతుఁ
దొడరి పుష్కరరాజుతో జూదమాడి
పుడమిని సంపత్తిఁ బోరిఁబోరినోడి
మానినితోడ సమ్మదమున నిపుడు
కానన భూమికి అదలిపోయెగను
పరమయోగీంద్ర నీ పాదపద్మములు
కర మొప్ప సేవింపఁ గలిగె భాగ్యములు
అనవుడు హా యని యమ్మునీశ్వరుఁడు
తన మనోదృష్టిచేఁ దప్పక చూచి
వెఱగంది యమ్మహీవిభున కిట్లనియె
ధరణీశ మున్ను నీ దమయంతిఁ బెండ్లి
యాడి నీమీఁద నది నెప మెన్ని

పొడమి చెడఁ గలిపురుషు డీప్లైచె
మంచి దందులకేమి మహిమశోభిల్ల
మించిన సత్కీర్తి మెఱసెద నీవు
కర్మవశంబునఁ గలుగు బాధలకు
ధర్మంబు వదలకు తలఁపకు సుఖము
మదిలోన సత్యంబు మఱవకు మెపుడు
పొదవిన సౌఖ్యంబుఁ బొందెద నీవు
ఖగపతిపై నెక్కి కమలవిభుండు
వగపెల్ల మాన్చి బ్రోవగఁ జూచు నిన్ను
వెఱవకు మని పల్కి విభుని వీడ్కొలిపి
సరగున ముని నిజాశ్రమమున కరిగె
నంతట జననాథుఁ డా సమీపమున
పంతుల గుందుచు వాసరత్రయము

## దమయంతిని నలుఁ డూరార్చుట

నుపవాసముల నుంచె నువిదయుఁ దాను
జపల పుష్కరు భీతిఁ జనరెవ్వ రటకు
భూకాంతుఁ డప్పుడా పొలఁతుకఁ జూచి
యాఁకటి పెల్లున నందం పలికె
నలినాక్షి పూర్వజన్మంబున మనము
తెలియక మఱి మూఁడు దినము లెవ్వరిని
నుపవాసముగుంది యుండఁ జేసితిమొ
చపలాక్షి మనకు నీ జన్మంబునందు
నూరి ముందరి కాన నుపవాసగతుల
నూరక మూఁడు నాళ్ళుండ గలిగిఁ
బెట్టిన వారికిఁ బెట్టు దైవంబు

పెట్టిన వారికిఁ బెట్టుదు సుమ్మీ
జలజాక్షి కలిమియే చక్కదనంబు
కలిమి గల్గినవాఁడు కలరు బంధువులు
కలిమియే సౌఖ్యంబు కలిమియే సుఖము
కలిమియే చుట్టాలు కలిమియే సఖులు
కలిమియే సతులునుఁ గలిమియే సుతులు
కలిమియే సకలంబు కలిమాయవలన
గలిమి పోయిన వెనుకఁ గడఁగి చుట్టంబు
లెలనాగ యొకరైన నిందురారైరి
పుడమి సౌఖ్యంబులఁ బొందినవారు
చెడిన యప్పుడు చెంతఁ జేరంగనియ్య
రలసుఁ బుష్కరుఁ డాడుజూదంబు
దెలియరో యది చూడఁ జిత్రంబు నావె
యిది దైవమాయ యొండేమి లేదు
మదిలోన నొక చింత మది బోల దింక
విపిన ధామములలోన విహరింప వలయు
నివుడు నీ కొక బుద్ధి నెఱిగింతు వినుము
శృంగారవనములోఁ గ్రీడింపలేని
యసంగన నీవెట్టు లడవిఁ గ్రుమ్మరెదు
మను సౌధసోపానముల నెక్కలేని
వనిత యెట్టెక్కెదు వసుధాధరముల
స్ఫటికంపు మేల్కట్టిపై నెక్కలేని
కుటికుంతల యెట్లు గుట్టలె నెక్కదవా
యరుదైన రత్న గేహాళి దాఁటలేని
గరిత యెట్లు దాఁటగలవు ఘట్టముల

నా వెంట నదిగాక నడువంగలేవు
నా విరి బిడ్డలవద్దకుఁ బోయి
నీ తలిదండ్రుల నిలయమందుండు
నాతిని వేడ కాననభూమి లేడ
నే తెఱంగున నిర్వహింతు వట్లౌట
నాతోడ వెన్నంటి నడువజాలకను
నీ మహాటవులకు నేల వచ్చెదవు
కోమలి నామేలుఁ గోరుచు నిపుడు
కలఁగక పుట్టింటి కడకేగు మనిన
నెలుఁగెత్తి బెట్టుగా నేడ్చి భూనాథ
యిటువంటి మాటల నిపు డాడఁదగునె
కటకటా నేనెంత కడుఁ బాపమతినో
యరిమురి నడవి మీరడలుచునుండ
నరనాథపురమున నాకుండఁదగునె
కలగి మీ రడవులఁ గాయలు నమలఁ
జెలఁగి నే నన్నము చెయిమట్టదగునే
పర్ణశాలలఁ దాము పవళించియున్న
స్వర్ణగేహములనే శయనింపఁదగునె
నగములపై నీవు నలసివర్తింప
దగిన మేడలనుండఁ దగునయ్య నాకు
మృగములలో మీరు మెలసి వర్తింప
మగువలలో నాకు మతియుండ దగునె
గిరిగృహంబుల దారు క్రీడించుచుండ
విరులపాన్పున నాకు విహరింప దగునె
నిను బాసి నిమిషంపు నిలువంగజాల
నను బాసి పొమ్మన న్యాయమా నీకు

మెఱఁగి మెఱుంగి నీవిట్లనఁ దగునె
నరనాథ నిన్నరణ్యంబున కనిచి
పగిలి బిడ్డలఁజేరఁ దగునయ్య నాకు
జగదీశ నీ పరిచర్యఁ జాలించి
భయదాటవుల నిన్నుఁ బాసిన వెనుక
ప్రియమెప్పు నాకును బిడ్డ లేమిటికి
పరమిడి మా తల్లి దండ్రు లేమిటికి
సురచిరంబై తిట్టి శుభము లేమిటికి
బరగంగఁ దనువున బ్రాణ మేమిటికి
నరనాథ యనుచు మానకయేడ్చు చుండె
గన్నుల పిండార్వఁ గారెడు నీరు
మన్ననఁ దుడిచి యామహిపతి దనదు
కన్నుల గడు బాష్పకణములు దొరుఁగ
నన్నులవేణిలో నప్పు డిట్లనియె
నేణాక్షి నిన్ను నే నెడబాసి నపుడె
ప్రాణముల్ మేని లోపల నుండఁగదవె
మొదమీని యడవిలో నిడుమల నీవు
పడజాలవని యిట్లు పలికితిఁగాని
మెలనాగ యిపుడు నీ వేల యేడ్చెదవు
కలగకు నిను బాయఁగలనటె నేను
అని యూరడించి తొయ్యలి దోడుకొనుచు
జనుచున్న మిక్కలి సాధింపఁ దలచి

## కలి కష్టబెట్టుట

యప్పుడు కలి వార లరిగెడు త్రోవఁ
దప్పించి ఘనపర్వతంబుల శిలల

గట్టుల గుట్టల ఘనమైన పొదల
ఘట్టంబులను మహాకంటకచయము
సంతత గల్పించి సత్యాయాస్మ మగుచు
సంతాప మొనరింప జాలిన యెండ
నంతట గల్పించి యలసటఁ గొలిపి
యంతంతకంతకు నీడ లగుపడ నీక
మడుఁగుల నున్న నిర్మల సలిలంబు
లెడపక యన్నియు నింకిపోఁ జేసి
యాఁకటి పెల్లున నలసి యేమైనఁ
జేకొనితిన నది చేదుగావించి
తెరువులఁ దప్పించి తెలివిదూలించి
పరువుల నలయించి భయము పుట్టించి
నడవుల నొలయించి నయము దూలించి
తడఁబాటు గల్పించి దప్పి బుట్టించి
యీరీతిఁ గావింప నినకులాధిపుడు
బోరన నది దాఁటిపోవ నయ్యెడను
మగువ క్రొమ్మడిత్రోవ మలయ కంపలను
దగిలిన దనచేతఁ దప్పించుకొనుచు
మురువు దూలినవాఁడి ముండ్ల జేదియ్య
వెఱచి మెల్లనెతీసి వెల వెలఁ బాఱి
పఱతెంచి కరపలఁ బయ్యెద కొంగు
నఱిముఱిఁ దగిలిన నవి దియ్యలేక
తను వాఁడిగల ఱాళ్ళు దాఁకి పాదముల
కనుమల నెత్తురు గాఱనందంద
గన్నుల ముత్యాలకై వడినీరు
చన్నుగట్టుల మీఁద జలజల రాల

జాఱిన వెండ్రుకల్ సరిపడఁగేల
సారెకు సారెకుఁ జక్కఁజేయుచును
సడలిపోవుచు పట్టుగట్టిన తనదు
పెదవులఁ దడుపుచు బెగడుచు నవని
నడుగిడ లేక హా యనుచు శోకింపఁ
బతమి వేడాత్మలోఁ బురపురఁ బొక్కి
పరిపూర్ణ కళసోమ బడలించు
మోము చరణముల్ ధూళిధూసరములై యున్న
నీ పాతకంబున కేమి సేయుదును
దాసంపు దైవ మీపగిదిఁ గావించెఁ
నటునటానేఁ బాపకర్మ వర్తనుఁడ
నటు గానఁగదు దుఃఖమందె నీయింతి
మటుమాయ కలినట్టి మగువను నన్నుఁ
బటుగతి నీరీతి బాధించుచున్న
వనితలపోయు చాయంగనంగదిసి
యనునయించుచుఁ దన హస్తంబుచేత
నెలమిమై సూతగానిచ్చి దోడ్కొనుచు
లలనయు దాను మెల్లనఁ గొంత దూర

## పక్షులు వ్రాలుట

మెరుగుచున్న విహంగముల్ రెండు
మఱుఁగున గూడని కలి మాయచే నెలమి
నవరత్న ఖచితమౌ నవ్యపక్షములు
పవడంబుఁ జాయచేఁ బరఁగు నాసికయు
పసిమిమించులఁ బోలి ప్రజలు చెక్కులును
ససమానరుచి దేట నలరు రూపములు

గలిగి ముద్దులు మూటగట్టిన యట్లు
కలిమాయచె నొప్పి గగనమందుండి
కపటంపుఁ బక్షులు కవకవ యనుచు
విపులేశు ముందఱ వెఱవక వ్రాలె
వ్రాలఁగాఁ గనుఁగొని వసుమతీనాథు
డాలోన నింతితో ననియె నిట్లనుచు

నలుఁ డాకలికై పక్షులను పట్టఁబోవుట

అలివేణి మన మిప్పు డాఁకలిచేత
బలహీను లగుటకుఁ బరమేశ్వరుండు
మనమీఁద దయగల్గి మఱి వీనిఁ బనిచె
బని బూని యీ రెండు పక్షులఁ బట్టి
యనురక్తి భక్షింత మతివ యిద్దఱము
అని బల్కి పక్షుల నపుడు పోనీక
కదియఁ బోయినఁ జూచి కపటంపుఁ బక్షు
లదరిన గతి వేగ నవ్వలి కెగయ
మెల్లన జనిచని మేదినీనాథు
డల్లనల్లన నప్పు డటు పొంచి పొంచి
పట్టఁ జేతుల రెండు పాఱఁజూచుటయు
నట్టె చివ్వనలేచి యావల నిలువ
వెండియు వానిని వెన్నంటి తఱిమి
కడఁ జేరఁగఁబోయి దక్కినట్లుండి
యవ్వలి కెగరిన నా రాజవిభుఁడు
క్రొవ్వడంచెద గాక గొబ్బున వీని
నేనేర్పుచేనైన నిటు వెంటఁదగిలి
పోనీక పట్టెదఁ బొదివి యే నిప్పు

తని యిట్లు మది నిశ్చయం బొనరించి
ననవోజి నందుంచి నలమహీవిభుఁడు
పట్టఁబోయిన మిట్టిపడి వెన్కనిలుచుఁ
బట్టకుండిన నేలఁ బాతరలాడుఁ
పొలినగతి నుండుఁ దగులక పోవు
మిసిలొంది నట్లుండు దిక్కుల జూచు
రేసారి మరలిన వెస నొద్దవ్రాలు
దాసిపట్టఁగఁ బోవఁ దటుకునఁ దొలగు
దవ్వుల కేగును దగ్గఱవచ్చు
నివ్విధంబునఁ బక్షు లెంతయు నలుని
నలయించి యలయించి యధిక దూరమున
జలమున గొనిపోవ జనలోకనాథు
డలసి చింతించియు నటఁబోక నిలచె
వలనొప్పఁ బులుగులు వచ్చి భూవిభుని

నలుఁడు కట్టిన వస్త్రములు పక్షు లెత్తికొనిపోవుట

దగ్గఱ వ్రాలినఁ దన మొలవల్లె
దిగ్గన పయిఁబడఁ దిదవైచినను
బంచఁ దా మెత్తుక పక్షులు దివికి
నంచలంబుగ నేగి యందుండి పలికె
భూప నీవు నాఁడు జూదంబాడు వేళ
నిపెమ బుష్కరు పాచికలలోన నుండి
నీ రాజ్యమంతయు నెఱిఁదోచుకొన్న
వారము మేము గువ్వలము కామయ్య
పొలమి రాజేంద్రమే మెవరమో యనుచు
దలపకు మదిలోన దరమిడి మమ్ము

పంపఁ గైకొని వేగఁబాఱి రమ్మనుచు
పంచిన కలి మాయఁ బాటించి యిటకుఁ
బరువున నరుదెంచి పరికించి నిన్ను
నిరువుర మిట్టట్టు నెగిఱి దూలించి
నిలుచుచు నమ్మించి నీ మొలనున్న
పలువఁ గైకొంటిమి భళిభళీ నిన్ను
మెచ్చవచ్చును మేము మెల్లనఁబోయి
వచ్చెద మికనంచుఁ బలికి మాయత్మ
నెనసియుండిన కోప మింతటఁ బోదు
పనవి నీ విక బడుబాటులఁ జూడు
మని యుగ్గడించుచు నా కలిదూత
లనురక్తిమాయమై యవి పోయెనంత
నా పక్షు లరిగిన నాశ్చర్యమంది
భూపాలతిలకుండు పొగలి చిత్తమున
ఘనమైన శోకసాగరముననుండి
తన దేవిఁ గనిసిగ్గు తడఁబడఁ బలికెఁ
పక్షులు బలికిన పలుకులు వింటె
సాక్షిగా దామరసాక్షి నీ విపుడు
కల్ల జూదం బని కటకటా నాకు
నెల్లవారలు దెల్ప నెఱుఁగలేనైతి
నింతటఁ బోవదో యెల నాగమనము
మెంతేసి యిడుమల కిరవు కాఁగలమో
కటకటా మనమీఁద గరుణయే లేక
యిటు చేయఁగాఁ గలికేమి చేసితిమొ
తొలఁగునె నేఁగన్న దుస్స్వప్నఫలము

పలుమారు ననుభవింపకగాని విడదు
గట్టిడి దైవంబు ఘనరాజ్యమెల్ల
నష్టమై కౌని యరణమునందుఁ ద్రోచె
దుదనుగట్టిన బట్ట దోచుకపోయె
నిదియేమి మాయమో యెఱుగంగరాదు
నేమి సేయుదు నింక నేమందు విధిని
నీ మహాటవిలోన నిద్దఱ మింక
యలివేణియే దుఃఖ మనుభవించెదమొ
తెలియంగఁజాలమే తెరగింక మనకు
నని యని పలుమారు నడలుచుఁ బలుక
దన ప్రాణ విభులోడి దమయంతి పలికె
నేలయో తలపోయ నిసకులాధీశ
పాలించి చూడమా బుద్ధికార్యంబు
కాలకర్మంబులు గడిసినచోట
ఫాలలోచనుడైనఁ బాపుకోఁగలఁడె
జలధిమేకరకు మీఱి చనుదెంచెనేని
కలదెయవయవంబు కట్టించి నిలుప
వసుధనీఁతకుమించి వచ్చునేలోఁతు
విసమెక్కు నేతల పెంద్రుకల్ కడచి
మిన్ను వేగమెవచ్చి మీఁద వ్రాలినను
దన్నుగా జెయ్యాని మఱి నిల్పదగునె
ఎంతేసి కార్యంబు లేగుదెంచినను
వంతనొందుచు ధృతివదలంగఁ దగదు
కటుకున దైవంబు దయలేక మనల
నిటు చేసితే నింక నేమన వచ్చు

నింతకు మిక్కిలి యేమి వచ్చినను
నంతయు దుస్స్వప్నమని యాత్మ నెఱుగు
తలఁపకు రాజ్యంబు దలఁపకు సుఖముఁ
దలఁపకు బిడ్డల దలఁప కాప్తులను

## నల దమయంతు లేక వస్త్రమును దాల్చి పోవుచుండఁగా
## గలి మాయరూపముతో వారికిం ద్రోవ ఎఱింగించుట

వదలకు ధైర్యంబు వదలకు బుద్ధి
వదలకు హరిచింత వదలకు నీతిఁ
బుట్టుభోగము లన్ని పోయిన వెనుక
బట్టకు వెఱతురే భానుకులేశ
యనుచు నూరార్చి నెయ్యంబున నపుడు
తన కొంగు సగము నాతనిమీద గప్పె
నుడుగక యిద్దఱు నొక చీరగట్టి
యడలుచు నడవిలో నధిక దూరంబు
నడచిపోవఁగఁ జూచి నగి వారు మఱియు
నడలంగఁ గలిధరామర రూపుఁదాల్చి
గడువేడ్క నచట మార్గంబులు నాల్గు
తడయక కల్పించి తానొక్క త్రోవ
తెరవరివిధమున ద్రిమ్మరు చుండి
ధరణీతలేశుండు దమయంతి యటకు
పనుదేరఁ గపటవేషధరుండు పలికె
నొనరంగ నిద్దఱు నొక చీరఁగట్టి
యెందుఁ బోయెదరు మీ రీకానలోన
నెందుండి వచ్చితి రిట్టి దుఃఖంబు

కెందుకు వచ్చె మీ వృత్తాంతమెల్లఁ
గొందలమందక గుణగక నిల్చి
యెఱుఁగ జెప్పేడు మీ రలెవ్వరటన్న
ధరణీతలేశుఁ డాతని కిట్టులనియె
వినుము విప్రవరేణ్య విశ్వంబులోనఁ
గొనియాడఁ దను భానుకులజు డావీర
సేన సుతుఁడ నీక్షితితలేశ్వరుండ
మానిత సకల సామ్రాజ్య సంపదల
గపట జూదమునఁ బుష్కరునకు నోడి
విపినంబు లోపల విహరించుచుం
జపలాక్షితోఁ గూడి సరసతరాఁగఁ
గపట మార్గంబున ఖగములు రెండు
వచ్చిన నేఁబట్టి వైచినవల్లె
వచ్చెరుగమింటి కపుడు గొంపోవఁ
బోలఁతి గట్టినయట్టి పుట్టంబు కొనను
నెలమిమైఁగట్టుక నిటువచ్చినాఁడ
ననఘాత్మయే నలుండను పేరివాఁడ
ననవుడు కపట బ్రాహ్మణు డిట్టు లనియె
నింతి నీవెంట నిడుకొని నీవు
వంతగుందుచు ఘోరవనము లోపలను
నీరీతిఁ దిరుగాడ నిది కార్యమగునె
యీ రామ నీవెంట నిడుమలఁ బొందఁ
జాలదు మా కిది సంతాపమయ్యె
నీలలోచన నిఁకఁ జూచెనేని
ఘోరమృగంబులు గూల్చి భక్షించు
నో రాజ యడవికి నొకఁడవే రాక

నెలనాగ నిప్పటి కేల దెచ్చితిని
వలవదు పాపంబు వచ్చు భూనాథ
పదవడి కలిరాజు పన్నిన మాయ
యిది మాకుఁ జూడంగ నింతటఁ దొలగ
దెంతేసి కష్టంబు లింక రాఁగలవొ
యింతిని నిఁక బుట్టినింటికి నసుపు
మిట కేలఁ దెచ్చితి విది బుద్ధియగునె
కటకటా యికనైనఁ గొంత నంపింపు
మిన కులంబున జనియించిన నృపులు
ఘనులందు రిపుడు నీ ఘనమెందుఁ బోయె
నొక బుద్ధిఁ జెప్పెద నుర్వీతలేశ
యిఁకనైన వినుము నీ విందుండఁగూడ
దిదిగొ నాలుగు త్రోవ లేర్పడియున్న
నది విదర్భాపురి కరుగుచునుండు
నది యయోధ్యాపురి కరుగుచునుండు
నది సుబాహునిపురి కరుగుచునుండు
నది ఋతుపర్ణపురాధ్వంబు గాన
నిది మీకుఁ జెప్పితి నికనైన మారు
నిమ్మార్గములను మీయిద్దరి మతికి
సమ్మతంబగుత్రోవఁ జనుఁడు వేవేగ
భూప యీ నాలుగు పురములలోన
దాపు విదర్భాఖ్య దనరిన నగర
మని చెప్పుచు నదృశ్యుడై పోయె దితడు
మనుజేశు నంతట మగువ నీక్షించి

## నల దమయంతులు చింతించుట

తొయ్యలి నాలుగు త్రోవలలోనఁ
జయ్యన నేత్రోవఁ జనుదెంత మనినఁ
గిరి వృక వ్యాఘ్ర సూకర సింహసర్ప
శరభాదిబహుమృగ సంచారవనుల
దపగంగ నేటికి దేవుడే మనకుఁ
దెరవు విదర్భకుఁ దెలియగ జెప్పె
మనుజేశ యటకేగి మనవారియొద్ద
ననుపమగతి నుండ మని భక్తిమ్రొక్కి
రమ్మని పిలిచిన రమణీలలామ
కమ్మెదినీశ్వరు డనియెఁ గ్రమ్మఱను
వనజాక్షి మును నిన్ను వరయించునాడు
ఘనులగు మంత్రాంగకర్తలు దొరలు
కటులు తేరులు తురంగంబులు భటులు
ఓపదు వాద్యంబులు భేరులు వన్నె
పల్లకి లమితను వాసిని విప్రపల్ల
వాకరలు పార్శ్వమ్ముల నెదుట
నేతెర మీ తండ్రి యేలు విదర్భ
కేతెంచినాడ బర్హార్ముఖుల్ మెచ్చఁ
జలజాక్షి కలి కడు జలము వహించి
కపట జూదమునఁ బుష్కరునకు నన్ను
నోడించి యిద్దర కొక చీరఁ జేసె
నేడు లజ్జ దొలంగ నేనీ విధమున
భామ నీతో విదర్భకు నెట్లు వత్తు
మామనే గతిఁ గొంతు మది సిగ్గు లేక

భూమీశుసభలోన బుధులెల్ల వినఁగ
నేమనినా భంగ మెఱిఁగింతు నపుడెఁ
జెడి చుట్టముల చెంత జేరంగరాదు
కడపట నతిహీనుగాఁ జూతు రగుట
నీ వపటికిఁ బొమ్ము నీబిడ్డ లచట
నేవిధి నున్నారొ యెఱుగంగ గలవు
నావెంట నదిగాక నడువంగ లేవు
పో విదర్భ కటన్నఁ బొలతి యిట్లనియె
భూమీశ నినుఁ బాసి పోపొమ్మటంచు
వేమరు పలుకుట విహితమా నీకు
జలములో నున్న జలచరజంతు
నేలమీదఁ ద్రోచిన నెబ్భంగి బ్రతుకు
నరుదారఁ దరువులో నల్లిన తీఁగె
తరువుఁ బాసిన నది తా నిల్వగలదె
నినుఁ బాసి పోజాల నీ పాదమాన
ననుఁ బాసిపోవుట న్యాయమా నీకుఁ
బలుమారు నాతోడఁ బలుకకీమాట
ననినఁ గామినిఁ జూచి యవనీశుఁ డనియె
నలివేణి మన మిప్పు డమిత దీనతను
నులుకుచు నిద్దఱ మొకచీరఁ గట్టి
పోడిమి నేరీతిఁ బోవంగ నగుచు
నేడు రాజ్యముపోయె నిర్నిమిత్తమునఁ
బై చీరయును బోయెఁ బక్షులచేత
నీ చీర కొంగును నేఁగట్టినాఁడ
నా విదర్భాపురికట నీవు నేనుఁ బోవంగ
నప్పుడు పురజనుల్ చూచి

ఙుల నేకు దీవుల నేలెడువాని
చెలువెల్ల వదలి పై చీరయుఁబోయె
సురలను నొల్లక సొక్కి యీ రాజు
వరియించిన ఫలంబు వనితకుఁ గలిగె
నని తులనాడెద రదిగాన నటకు
జననునే నీవైనఁ జనుమన్న బెదరి
చెదరిన మనమునఁ జెలియ యిట్లనియె
హృదయేశ నన్ను నీవిట్లాడ దగునె
యడవులలో నీవు నడలుచు నుండఁ
గడువడి మా వారికడ కెటు పోదుఁ
నినుఁ బాసి ప్రాణంబు నిమిషమాత్రంబు
తనువున నిల్పకఁ దగునె ప్రాణేశ
తొల్లిచేసిన యట్టి దుష్కృతఫలము
నెల్లఁ బొందక యవి యేల పోనిచ్చు
హరునకు మొదలుగా హత్య సిద్ధించె
హరి యంత వానికి నడలంగవలసె
దినకరచంద్రులు దిరుగంగవలసె
నౌనర నొక్కడనుగా బూదంగలేక
యాయువువిద్యలు నఖిల సంపదలు
వ్రాయఁబట్టినవాఁడు వనజజుఁ డుండ
నుదుట వ్రాసిన వ్రాఁత నులిమినఁ జెడునె
మదిలోన నీవింక మఱి కుందనేల
నని పల్కి నిద్దఱు నపుడు సమ్మతిని
జనుచున్నమదంట సహకారసాల
మారూరకరకత మాలమధూక
తాలఖర్జూర హింతాలామ్లపనస

సరళికింశుకలుం గజంబావటాది
తలిరుమధ్యంబునఁ దగునొక్క కొలనుఁ
గనుగొని సోపానగతి డిగ్గిజలముఁ
దనియంగఁ ద్రావిగత శ్రమములగుచుఁ
కొలను వెల్వడలి దిక్కులు సూచి విజయ
నిలయ మొక్కటి గాంచి నెరిదాని డాయ
నరిగి కూర్చుండిరి యటఁ గలి మాయ
నొఱయంగ నొక మాయ నిద్దఱగప్పు
పఱపున వాడిన వల్లిచందమున
వరసతితిన్నపైఁబడి నిద్రపోయె

దమయంతి నిద్రించుచుండఁగా నలుడు దుఃఖములో
నామె చీరెను సగము చించుకొని వెళ్లుట

దనకు నిద్దుర దరిదాపులేక
వనితయుఁ దానొక్క వస్త్రంబు కట్టు
కతమున నెడఁబాయగాఁగూడ కపుడు
మతిగణించుచు గలి మాయచేఁ దనకు
గల రాజ్యమెల్లఁ బుష్కరరాజు కోడి
కలఁగుచు శపథంబు గడువంగలేక
తన దేవియును తానుఁ దన యూరు వెడలి
చనుదెంచి మూడు వాసరము లచ్చో
నాఁకగసనసి ఘోరాటవులందుఁ
బైకోక కపటంపుఁ బక్షుల కిచ్చి
తగిలి యనేక బాధలఁ గుందికుంది
వగచుచు నచటికి వచ్చి చేరుటయు
నలమట దుఃఖంబు లన్నియుఁదలతు

నల దమయంతులు నాఁడు దామపటుఁ
జటుల మధ్యాహ్నభానుని కిరణముల
స్ఫుటమరి కందిన పూఁదీగెలట్లు
నవపుల ప్రిమ్మరి యాఁకటి సొలసి
కడలేని దుఃఖంబు కతన నావేళ
మదిరాక్షి తన దేవి మహిమీఁదబండి
నిదురవోవఁగ జూచి నృపకుంజరుండు
సన్నుత సకల రాజన్యకామినులు
కన్నులు సండ్లులం నూడిగంబులు సేయ
హంసతూలిక శయ్యలను నిద్రఁబోవ
హంసయానకుఁ బానుపయ్యెఁబో నేల
నసుఁ గూడివచ్చి కానలఁ బొందినట్టి
పన దుఃఖమింతయుఁ దగఁ జెప్పికొనదు
దీని ఘోరముఁ జూడఁ దీరదు నాకుఁ
బూని యిప్పుడు డించి పోయెదనింక
వనితనఁగానక వనవాస ముడిగి
తన పుట్టినింటికిఁ దగ బోయి చేరు
నిటువలె దీనికే నెంత చెప్పినను
దిటమరికలఁగి వాదించుఁబోయనుచు
దన మదిలో నెంచి తాఁ గలిమాయ
దన ప్రాణనాయకి దగఁగట్టినట్టి
చీర సగంబుగాఁ దేజులఁ బట్టి
వారి మేల్కొనకుండ నడిమికి నలుఁడు
తునియించి మనమున దుఃఖంబుఁజెంది
వినకుండిఁ దిన్నదా విలపించి దొలగి
బోయెదనని లేచిపోయి రాజేంద్రుఁ

డా మెడమఱి నాలుగడుగులు బోయి
పోలేక మదిలోన బొగిలి మూర్ఛిల్లి
యాలేమ దగ్గఱ కరుదెంచి మగుడఁ
దనువు పాదంబుల తప్పక చూచి
తనలోన నిట్లని తలచి శోకించెఁ
గటగటా నేఁ బాపకర్మండ ననుచు
నెటునెఱుఁగకపోయె నీ తరలాక్షి
కోరివచ్చిన దేవ కులజులనెల్ల
హరించి నన్నేల వరియించె నొక్కొ
పడఁతి నోచిన నోము ఫలమిట్టులుండె
నిడుమలఁబొందెడి నీయరణ్యమునఁ
గట్టడి విధియాజ్ఞ కడవంగ వశమె
యిట్టి కాఱడవిలో నెలనాగ నిన్ను
నొంటిగా విడిచి నేనొగిఁబోవఁజాల
వెంటఁ దోడ్కొనుచును విహరింపఁగలనె
కామిని నీకు వాకతమునఁజేసి
యీ మహాటడవిలో నిట్లుండగలిగె
నెనయంగ నీభాగ్య మిట్లుండెననుచుఁ
దిన మది నొకకొంత ధైర్యము దెచ్చి
వనిత పయ్యెదకొంగు వలనొప్పగప్పి
యనుమాన మేటికి నరగెదవనుచు
నడలుచు మఱి నాలుగడుగులు పోయి
తడఁబడి పోలేక ధరణిపై వ్రాలి
దిగ్గున లేచి యాదేవిని జూచి
దగ్గఱ కేతెంచి తనలోనె తాను
బెగ్గలంబందుచు భీతినిట్లనియె

నిద్రజగామిని నెటు వదలుచును
బడఁతి నీ విడుములఁ బడజాలననుచుఁ
వదయక నీ తల్లిదండ్రుల కడకు
బొమ్మని చెప్పినఁ బోజాల కిట్లు
నమ్మినా వెంటఁ గాననసీమఁజేరి
నటువంటివాని నిన్నక్కటానేఁడు
ఇటువంటి యడవిలో నెట్లుంచిపోదు
నని నమ్మహీపతి హాయని వగచి
తన మది నిట్లని తర్కించె నేను
పోయిన వెనుక నీపూబోణిలేచి
పాయక యెబ్బంగిఁ బలవించునొక్కొ
పలవించి యడవిలోపల నన్ను వెదకి
బనుపైన మృగముల పాల్పడు నొక్కొ
పతిచేత నొల్లమి పడఁతి నేననుచు
మతి నెంచి ప్రాణముల్ మఱి వీడు నొక్కొ
యని యని పలుమారు నిందఁ దలచి
తను చాయకోలఁదిని దలచి వర్ణించి
మానిని గుణములు మానుగాఁ బొగడి
మానినీమణి మోము మఱిమఱి చూచి
చనుగ వర్ణించు సన్నంపు నడుము
వినుతించుఁ గన్నుల వెడలుపు నెంచు
చేనియరుచుల నొందిన పల్కు లెంచు
జానిచ్చు చనువులఁ దప్పక యెంచు
మునుపటి రతిసుఖంబులఁ దలఁచుచును
వనలోనఁ దాను సంతాపంబు నొందు

మఱియును దెసవతో మానినిడించి
నరగునఁ జనుదేర సతిమీఁద మోహ
మనుదీఁగె కాళ్ళకు నప్పుడు చుట్టి
పెనఁగొనలేక పృథివిపై వ్రాలి
పుడమిఱేడట మూర్ఛబోయి యొక్కింత
తడవున దెలిసి యాతరలాక్షి జూచి
తిరిగి యచ్చటికి నేతెంచి దుఃఖమున
నరుణకాంతులఁ జేవురగ లోచనముల
జలములు దొరుఁగ నా జననాథుఁ డనియె
నెలనాగ నినుఁ బాసి నెట్లుబోదు
వనజాక్షి నినుఁ గూడి వర్తించు ఘోర
వనములు శృంగార వనములై యుండు
నోలేమ నీ వున్న నొగిఁ బూరిశయ్య
ఏలతో హంసతూలిక పానుపయ్యె
నోరామ నీ వున్న మరుదుర్గములును
మిఱిన బంగారుమేడలై యుండు
బాలిక నినుఁగూడి వసియించు పర్ణ
శాలలు మఱి చిత్రశాలలై యుండు
మెలఁత నీ సన్నిధి మృగగర్జనములు
వలనొప్ప సంగీతవాద్యమై యుండు
మదిరాక్షి నీవు సమ్మతి నిచ్చు ఫలము
మదికివ్వాన్న సమ్మదము ఘటించు
నీయట్టి కులశీల నీయట్టి సాధ్వి
నీయట్టి ప్రియురాలు నీయట్టి ముగుద
నీయట్టి కులశీల నీయట్టి యబల

నీయట్టి లావణ్యనిధి యెంచు గలదు
తలంపగా దైవంబు దయ యింతలేక
యెలనాగ యిటుచేసె నేమిసేయుదును
అని యని పలవించి యా మహీశ్వరుఁడు
తన మది నొక్కింత ధైర్యంబుఁ దెచ్చి
యింతగాఁ జింతింప నేటికి ననుచుఁ
గాంతార భూములఁ గలిగిన యట్టి
కరి సింహ శార్దూల గండభేరుండ
శరభపన్నగ శశచమరీలులాయ
కాకాదిపక్షి మృగంబులచేత
నేకీడుఁ బొందక యీ యిందువదన
తమ తల్లిదండ్రుల దగ్గఱఁజేరు
నమరంగ హరికృప ననుచు దీవించి
పోయెద నని లేచి పోలేక మగిడి
పోయి మిక్కిలి వగఁబొంది మూర్ఛిల్లి
హాయని మెలగెత్తి యందద యేడ్చు
బోయెదనని పోయి పొక్కుచుఁ దిరిగి
చయ్యన దమయంతి సరసకుఁజేరి
యయ్యెడ నలుఁడు మహార్తి నిట్లనియె
ఇటు డించిపోయిన నీ యిందువదన
యిటుఁ బడిపోయి యమ్మయిల్చేరి
యడవిలో శూన్యగృహంబునఁ దన్ను
విడిపోయెను గూర్కువేళ నీరజేశుఁ
డని తెల్పఁదనవార లదిఁ విని నన్ను
మనమున నెటువంటి మాటలాడుదురొ
యదిగాక పురజను లందఱు నన్నుఁ

బదపడి నలుఁ డిట్టి పాతకంబునకు
నడలక యొడిగట్టె ననుచుఁ దిట్టుదురు
పడఁతి యిట్లిడుమల పాలై నఁజూడ
జాలక విడిచెద సత్యమీమాట
పాలించి వినవమ్మ భూదేవి నీవు
ఆకాశవాణి నీ వరయంగ వినుము
యేకతంబున మీర లిద్దఱు సాక్షి
మెలఁత కేగతినైన మీఁరలే రక్ష
తలిదండ్రి దగ్గఱఁ దగఁ జేర్పవలయు
నని యొప్పగించి చయ్యనఁ బోదుననుచు
చని చని మఱి పోవఁజాలకతీర్పి
వచ్చి యప్పొలఁతుక వదనంబుఁ జూచి
యచ్చోట నెలుగెత్తి హాయని యేడి
పోలేక పోలేక పెగలుచు నుండ
నాలోనఁ గలి దేవుఁ డతివపై పగులు
మోహపాశంబుల మొదలంటఁబట్టి
సాహసంబున ద్రుంపం జయ్యన నలుడు
మనమున నిదియేమి మమతలటంచుఁ
జన నిశ్చయించి యచ్చట నిల్వలేక
నదులు శైలంబులు నగరము ల్గడచి
పొదలుచు వేవేగఁబోయె భూవిభుడు

అగ్ని కలిపురుషుని ప్రేరణచే విజృంభించుట

పోవంగఁ గలి తన బుద్ధి జింతించి
వావిరి వీని లావణ్యంబుఁ జెఱుతు
నని యగ్నిదేవుని నర్చించి పిలచి

కలి మారుడూపునిగాఁ జేయు మితని
నసిలుని నీకు సహోదయుంబుగాను
బనిచెదఁ జనుమన్నఁ బనిమూని పేర్చి
చురువడి విసరు మహోపవాయువులఁ
పసశాఖలన్ని దఱుచుగానొరసె
నాకాకచే నిప్పు లందందఁ బొడమి
మేకమై యాకాన నేర్చుచు వచ్చె
పగిలి పెన్మంటలు ధగధగ మండ
ఘగఘగఁ బొగల గుంపులు మింటి కెగయ
పటుచుగా మండుచుఁ దఱువుల కెగసి
పరికొని పొదరిండ్లు దళముగానుండ
మ్రాకులు ఫెళఫెళ మహిమీద వ్రాల
ఏక మృగంబులు వెలవెలఁ బాఱ
ఖగములు ఱెక్కలు గాలినిఁ గమలి
మెగసి పోవగ లేక యుల వ్రాలి పొరల
నక్కడక్కడ డాగినట్టి సర్పములు
యుక్కడంబుగ నన్నియడలుచు మడియ
ఘనమైన సప్తసాగరము లింకించి
కనలుచు సకల లోకములు దహింప
వచ్చిన బడబాగ్ని వడువున వచ్చు
చిచ్చుఁ గనుంగొని క్షితితలేశ్వరుఁడు
బోరన దాఁటెదఁబో దాన ననుచు
పేరుడై రాగ నా దిక్కున నొక్క
పొదరిల్లు దగిలి యద్భుతముగా మంట
నచె చూడ నల మహీనాథుని కెదురఁ

కర్కోటకుండను ఘన పన్నగంబు
కక్కున పడుచు నా ఘన వహ్ని నడుమ
వేణుశాఖాగ్రంబు వేవేగఁ బ్రాకి
ప్రాణభీతిని మహీపతి కిట్లు లనియె

నలుని సహాయపడు మని సర్పము ప్రార్థించుట

ఓ రాజదేవేంద్ర యో దయాసాంద్ర
యో రాజితాకర యో దీనరక్ష
యీవహ్ని వెడలించె నిపుడు ప్రాణములు
ఈ వహ్ని లోపల నిటు చిక్కినాడ
కావవే రాజేంద్ర కరుణతో నన్ను
యీవేళ రక్షకు లెవ్వరు లేరు
అని దీనతను బల్కెం నప్పు డా పాముఁ
గనుగొని నలమహీకాంతుఁడు నవ్వి
ఫరణిఁ బాముల నమ్మఁదగ దందు రర్థి
వెఱతు నిన్నంటగా విషధర యనిన
ఘావరుఁ జూచి యా భుజగ మిట్లనియె
దావాగ్ని నిష్ఠురు దాటించి నీవు
నా కుపకారంబు నయ మొప్పఁ జేయ
నీకుఁ బ్రత్యుపకృతి నే నెఱింగింతు
ననవుడు వేవేగ నగ్నిలోఁ జొచ్చి
జననాయకుండు కృపాసాగరుం డగుచు
నా పాము గొనివచ్చి యావల విడువ
భూపతి గనుగొని భుజగ మిట్లనియె
మనుజేశ యిటువంటి మంటలోఁ జొచ్చి
నను నీవు రక్షించి నావు నీ మేలు

మఱవ నే నొక్క మాటఁ జెప్పెదను
సరణి ముందర నొక్క సరస కాసార
మున్నది యటకు నన్నొనరగఁ గొంపోయి
మన్నించి విడువుము మఱి నీకు నొక్క
మేలు చేసెదనన మేదినీ నాథుఁ
డాలించి యా పాము నటకుఁ గొంపోయి
సరగున నపుడు కాసారంబులోనఁ
గరుణతో విడిచె నాగపన్నగంబు
విడిచిన యప్పుడు వివర మొప్పంగఁ
గడువడి నలరాజు కాళ్ళను గఱచె

నలుఁడు సర్పదష్టుడై వికృతరూపు డగుట

గఱచినఁ దఱుచు వంకలువోయె మేను
కుఱుచ చేతులు మఱి గుజ్జు పాదములు
బొఱను వెంట్రుకలును బేడిగడ్డంబు
నఱయంగుళంబులు నంటు చెక్కిళ్లు
పఱుస నిమేసంబు బలు గుంటకనులు
కఱకు నల్లని మేను ఘనమైన కడుపు
గలిగినఁ జూచి భూకాంతు నవ్వి
కలఁగుచుఁ బలికె నక్కలి మాయఁ దలచి
యప్పుడే యట్టి కార్యముఁ జేతువనుచు
జెప్పితి నాలాగె చేసితి వహహా
కత్తిచే నఱికిన గాయంబు మీఁదఁ
దత్తరపర దెబ్బ తగిలిన రీతి
నైనది యైన నేమనుచు దైవమును
ధ్యానించు నలునితో నా సర్ప మనియె

సర్పము నలునికి శాపవిముక్తి దెలుపుట

జననాథ నీ కింత సంతాప మేల
కనలక వినుము నేఁ గఱచిన విధము
మునుకొని తొలి జన్మమున బ్రహ్మఋషికి
ఘనమైన దోషంబుఁ గావించినాఁడ
నా మునికోపించి యడవిలో నిట్లు
పాముగా నుండుము పాపాత్మ యనుచు
బలువైన ఘోరశాపం బిచ్చె నాకు
నలయుచు నే నపు డాత్మఁ జింతించి
మునినాథ యీ శాపమోక్షంబు నాకు
ఘనతతో నెప్పుడు గలుగునటన్న
నలిరాజు మాయచేఁ గల రాజ్యమెల్ల
నలరాజు పుష్కర నరనాథు కోడి
పైనున్న వస్త్రంబు పక్షుల కిచ్చి
కాన లోపలఁ దన కాంతను విడిచి
నీవున్న యెడకు నానృపుఁ డేగుదెంచి
భావించి యగ్నిలోఁ బడకుండ నిన్ను
గాచి రక్షించిన ఘనుని పాదంబు
చూచి ముట్టినవాడు శుభమూర్తి వగుదు
వని చెప్పి యతం డేగె నంతటనుండి
జన కులాధీశ నే నిచ్చటనుండ
గొనకొని నీ రాకఁ గోరు చుండుదును
వనమునఁ గాలాగ్నివలె వచ్చి నిన్నుఁ
గఱచితి నీ యాత్మఁ గలగకునరుల
తెఱగెల్ల జెప్పెదఁ దెలియంగ వినుము

కాంతి కోర్వఁగలేరు ఘలు లర్థి భూమి
కాంతులు నీచసంగతి కోర్వఁగలరు
అటుగాన నీ ఘోరమైన రూపమునఁ
బటుగతి విహరింపఁ బాడి ధరిత్రి
విపులేశ నీ వింక విపినభూ ములను
విపరీత బుద్ధిని విహరింప గూడ
దరయుచు నీ వయోధ్యాపురికేగి
యరుదార ఋతుపర్ణుఁడను రాజు చెంతఁ
జేరి సారథ్యంబుఁ జేయుచుఁ బాగ
మారూఢిజేయుచు నతని మెప్పించి
బాహుకుఁ డను పేరుఁ బడసి యత్యంత
సాహసం బలర నచ్చట నుండు మంతఁ
గొంతకాలమునకుఁ గోమలిఁ గలసి
సంతోషమతిని రాజ్యముఁ జేయఁగలవు
నిషధనాయక విను నీ శరీరమున
విష మెంత కాలంబు వెలయునందాక
నురగ రాక్షస పిశాచోరుభూతముల
దురితంబు లెవ్వియు దొరయవు నిన్ను
ననిన రాటములోన నమరిన యొక్క
కనక వస్త్రము ధారా కాంతుని కిచ్చి
కరమర్థి నీరూపఁ గావలె ననుచు
ధరణీశ నను నీవు దలఁచి యీ శోక
ధరియించి నప్పు డందముమీఱ నీకు
వరుస నీ రూపలావణ్యముల్ గలుగు
నేపార నేనింక నేగెద ననుచు

నా పాము మాయమై యరిగె నంతటను
జననాథుఁ డత్యంత సంతోష మలర
ఘనతర వేగుడై కదలి యయోధ్య
కరిగి యా ఋతుపర్ణు నందంద గాంచి
కరములు ముకుళించి ఘనభక్తిఁ బలికె
నవనీశ బాహుకుఁడను పేరివాఁడ
దివిలి సారథ్యంబుఁ దగజేయ నేర్తు
విశ్వంబులోపల వెలుఁగొంది యున్న
యశ్వలక్షణముల నమరంగనేర్తు
వారక రుచులుగా వండంగ నేర్తు
నీరీతి విద్యల నెఱుఁగంగనేర్తు
వలనొప్ప మిము గొల్వ వచ్చితి నన్ను
దలఁచి నీబంటు గాఁగద నేలుమనిన
ఋతుపర్ణుఁ డాతిని రూపంబుఁ జూచి
ప్రతిగాన యీరూప భావంబులకును
నిట్టివాఁ డొకఁ డున్న నెప్పుడు మనకుఁ
బుట్టముచ్చటలను ప్రొద్దువొయ్యెడిని
యని యెంచి నలుని నత్యాదరంబునను
మనుజేశుఁ డపుడు సమ్మతి గొల్వనిచ్చె



## అధ్యాయము 4

అని మున్ను నలరాజు నమ్మఁగ బిడ్డలను
పిలుకున దమయంతి తలిదండ్రు లింట
విడిచి వార్ష్ణేయుండు విపినభూములకు
వెడలె నలక్షితి విభుఁడింతిఁగూడి
యని మాట విని మున్నె యీ ఋతుపర్ణు
నొనరంగ గొలుచునుండ నానలుడు
నరసి వార్ష్ణేయుని నందం జూచి
సరసత తన రథసారథిగాఁగ
నెఱిఁగి యాతనితోడ నేమాటఁ దెలుప
కెఱుఁగని గతినుండె నేమియు ననక

### దమయంతి నిద్ర మేల్కాంచి దుఃఖించుట

యక్కడఁ దమయంతి యదరి మేల్కాంచి
పొక్కుచు దన పతిఁ బొడగాన కులికి
నలుదిక్కులను జూచి నలినాక్షి కుంది
చెఱఁగును జించిన చీరను గాంచి
దిగ్గనలేచి పూఁదీ గైవడిని
నగ్గలంబుగ మూర్ఛ నవనిపై వ్రాలి
మానిన యామూర్ఛ నొక్కింత దెలిసి
మేనెల్ల నలియుచు మెల్లనలేచి
నేలఁ బుణుకుచు విగిడిన వగల
వాలు గన్నులనీరు వరదలై పాఱఁ
బలుదెఱంగులఁదన ప్రాణేశుఁ దలచి

పెలపెలపాటున విలపింపఁదొణఁగు
హారాజదేవేంద్ర హాదయాసాంద్ర
హారాజమందార హామేరుధీర
శ్రీకర ఘనమూర్తి పుసమవర్తి
నాకేశసుతకీర్తి నలచక్రవర్తి
యక్కటా యిట్టి ఘోరాటవిలోనఁ
దక్కక ననుడించి తలఁగిపోదగునె
నినుఁ బాసిపోవని నాతోడ జెప్పి
పెను నిద్రపోయిన ప్రియు నన్నుడించి
కటకటా నామీదఁ గరుణజాలించి
యిటుడించిపోన నీకేమి చేసితిని
నిను బాయగాలేను నిమిషమాత్రంబు
ననుబాసిపోవుట న్యాయమా నీకు
నొక్కటే ప్రాణంబు లొనర నిద్దరికి
మక్కువ లొక్కటే మనకు నిద్దరికి
నోడకు మనుచు నన్నూరడఁబలికి
పాడియే యడవిలోపల డించిపోవ
నిట్టి కారడవిలో నిటు నన్నుడించి
యిట్టులఁబోవఁ గాళ్లెట్లాడె నీకు
గైకొనకెడఁ బాయఁగా నెన్నడైన
నీకునేఁ జేసిన నేరంబు లేమి
కట్టడిదైవ మీ కానలో నన్ను
నిట్టు లొంటిగా నుండ నేల చేసెనొకా
యెన్నడు రాదుగా యిటువంటి నిదుర
నిన్ను నన్నును బాయ నేడు వచ్చినది
తనువున బ్రాణముల్ దలగకున్నంత

నినుఁ బాసి యోర్తునే నిమిషార్థమైన
నెట్టి కాఱడవి న న్నేకతడించి
యెట్లు పోలేవని యెంచితి మదిని
ననుఁ బాయవచ్చునే నా ప్రాణవిభుండు
నని నిన్ను నమ్మితి నవనీశచంద్ర
యిప్పుడు ననుడించి యేల పోయితివి
వచ్చిన నొకచోటఁ జావమే మనము
కలహాటి నొక భంగిఁ గాలంబు గడిపి
మెలఁగ మేయడవుల మేదినీ నాథ
గ్రహపేష లవి యెట్టిగతులు వచ్చినను
గ్రహించి వీడుట నీకు గృత్యమే నాథ
నడికిఁ ద్రొక్కిన నలియ గొట్టినను
తెఱకు నియ్యనగాని చేదానె నాథ
కరుణను నీదువాక్యముల వీనులను
వెఱపక యెన్నఁడు విందునో నాథ
కామించి కన్నుల కఱవెల్లఁదీర
నీమూర్తి నెన్నఁడు నేజూతు నాథ
యే తెరవునఁబోతి నేను వచ్చెదను
నాతోడఁజెప్పవే నా ప్రాణనాథ
యీ వీథి మనలను నిద్దఱబాప దైవంబు
నాల్గుబద్ధతులఁ గెల్పించెఁ
ప్రాణేశ కానలోపల నిన్నుఁ బాసి
ప్రాణంబు లెబ్బంగిఁ బట్టుదునింక
భూమీశ ననుఁ బాసి పోయెడువేళ
నేమని పలవించి తేమంటి నన్ను
నే దేశమునకుఁ బోయితివా యెచ్చోట

నే దుఃఖమందితో నేమి సేయుదును
జగదీశ నేఁబాప జాతివిగాన
నిగుడి యీ యాపద నినుఁ బొందనయ్యె
నైశర్వలక్షణాన్విత సాదుసేని
వాసవనుత యింత వచ్చెనె నీకు
నరలోక నాయకా ననుజెట్టి బట్టి
పరరాజ్యముఁ బాసి బటులను బాసి
హయరథావలిఁ బాసి యఖిలంబు బాసి
భయద కాంతారంబు పాలైతి వకట
నిద్రింప కార్తిచే నీవు గూర్చున్న
నిద్రబోవుట నాకు నీతియే దలప
నేరము నామీఁద నిజముగాఁ గలుగ
నోరున కెటువోతి వుర్వీశ తిలక
పతి తలఁ పెఱుఁగని పడఁతి రేలనుచు
నతివేగమున డించి యరిగితి వేమొ
పున్నమ చంద్రునిబోలు నీమోము
నెన్నండు గందునో యినకులాధీశ
యిది నాకు నొంటిగా నిప్పుడు దోఁచె
యిదినాకు నడవిగా నిత్తఱిఁ దోచె
యిక్కడ ననుడించి యెచటికి నీవు
వెక్కసంబున బోతి వివరింపవయ్య
నేమిసేయుదు నింక నేమందు విధిని
నీ మహాటవిలోన నెబ్బంగిఁ గాంతు
నరనాథ యిటువచ్చి నను గావకున్నఁ
దరఁగ నా ప్రాణముల్ పట్టగజాల
మరుగున నేటికి మఱిమఱి యుండఁ

ఒడుపున వచ్చి నా ప్రాణముల్ గావ
కనఁబాసిపోయి భూకాంత నీవిపుడు
భువి నెన్ని బాధలం బొందుచున్నావొ
కలనైన నీమాటఁ గాదనఁజాల
నలరాజచంద్ర కానల నన్ను విడచి
పోవఁగ నీ కెట్లు బుద్ధి పుట్టినదొ
నీ వేమి సేయుదు నిన్ననఁ దగునె
నెవరికిఁ బొల్లి నే నేమిచేసితినొ
భువి నిట్టి పాట్లెల్ల బొందితి నడవి
నెక్కడి కేగుదు నేమి సేయుదును
దిక్కెవ్వ రిటమీఁదఁ దెఱఁగేది నాకు
నీ దుఃఖవార్ధి నే నేరీతిఁగడతు
నేదెస వెదకుదు నీకొఱకాన
వెదకుచుఁ గలి యిట్లు వేధించుచుండ
హృదయేశ నీ విపు డేమి గావింతు
వలసితి నీ యరణ్యములలో నున్న
బలుమృగంబుల కగపడుచుఁగా కనుచు
నలినాక్షి తన ప్రాణనాథుని దలఁచి
పలుదెఱంగుల నిట్లు పలవించుచుండ
మలమల మాడె గోమలతాతరుల
శిలలెల్లఁ గరిగె రాజీవాప్తుఁ డదరె
గాలి వీనకమానెఁ గన్నుల నీరు
రాల నేడ్చుచు నున్న రమణిని జూచి
మృగములు నిలుచుండె మేఁతలు మఱచి
ఖగములా ధ్వని విని కలగుచునుండె

నష్టుడు దమయంతి యచ్చోటుఁ బాసి
ముప్పిరిగొను శోకమున బ్రాణ విభుని

## నలుని దమయంతి వెదకుట

నడవి లోపల బాటహారిణియుఁ బోలె
వెడవెడ నందంద వెదకంగఁ దొణగె
తరులార నా సహోదరులార మీరు
ధరణీశ్వరునిఁ జాడఁదగఁ జూపలయ్య
సురలార మీరైన సురరాజవిభుండు
తరలిపోయిన జాడఁదగ జెప్పరయ్య
భూదేవి నీవైన భూలోకనాథుఁ
డేదేశంబోయెనో యెఱిగింప వమ్మ
ననుఁ గావరయ్య కిన్నరులార పుణ్య
ధనులార మునులార తాపసులార
కపులార హరులార గవయంబులార
శరభసాళ్వములార సర్పంబులార
మనుజేశుఁ డరిగిన మార్గంబు నాకు
నెనసిన కరుణతో నెఱిఁగింప రావె
అని యని యడుగుచు నటు నిటు పోయ
ఘనమైన పొదలెల్లఁ గదలించి చూచి
పేరు వారనక యవ్విధముగ దిరుగ
నోరెండె ధృతిదూలె నొచ్చెఁ బ్రాణములు
ముడివీడి క్రొమ్ముడి మూపుపై జాఱ
నడుగులు తొట్రిల నందంద బడలి
పగడంపువాతెర పదునింకినాడ
జిగిదక్కి పాపట చీకాకు పడఁగ

గన్నుల జలజలఁ గారెడు నీరు
పన్ను మిట్టలమీఁద జలజల దొరుఁగ
చన్నువ నెన్నడు మసియాడి వదఁక
కన్ను మూయుచును గద్గదకంఠ యగుచు
హాయని మెలుగెత్తి యఱచి హానాథ
పోయితే యెచటికి బోయితే యంచు
మాయ క్రోవల జూపె మాయురేనాథ
పోయితే యెచటికిబోయి తేయంచు నపుడు
నెడపక యుబ్బంగి నేడ్చుచు విభుని
విడువక వెదకుచు విపినంబులో
నడుచు దమయంతి కొంత దూరంబు
నందుఁగొండలు చూడ జనుచున్న
పదపడి యా సమీపంబున నొక్క
పొదరింటిలో నున్న పుట్టలో నుండి
తలతలమెత్తి యాతన్వి నీక్షించి
పెనుపాము చెలఁగుచు బిరబిర వచ్చి

దమయంతిని సర్పము మ్రింగుట

కోటాచుఁ గన్నుల రోషాగ్ని లడర
రాజిల్లు విషములు రాజిమంచుచును
గలి దేవు పసపునఁ గామినీఁగదియ
విలవిల ప్రాణముల్ విడిచిన భంగి
హానాథయని మూర్ఛ నవనిపై నొరిగెఁ
బూని యప్పుడు పాము భూమీశుదేవి
పదములు బట్టి తప్పక మ్రింగుచుండె
మదిరాక్షి యప్పుడు మది మూర్ఛఁ దెలిసె

తను మ్రింగ నా ఘోరదందశూకంబు
గనుఁగొని శోకాగ్నిఁ గ్రాఁగుచుఁ బలికె
నక్కటా యాఫణి కాహారమైతి
నిక్కడ నా కింక నెవ్వరు దిక్కు
పామును విడపించు బలవంతు లెవడు
నా మేను మ్రింగుచున్నది యంతనంత
కలరాజ్యమెల్ల పుష్కరున కర్పించి
కలిరాజు మాయచే గానలఁ జొచ్చి
యిడుమలఁ బడి జీవితేశునిఁ బాసి
కడపట వచ్చి యీ కాలాహిచేత
బడుటకు నా వ్రాత ఫలమిట్టులుండ
నడరంగ నిప్పుడీ యాపద మాన్ప
వడి నిట కెవ్వరు వత్తురో యింకఁ
బతమిరే డెపటకిఁ బోయెనో యెఱుఁగ
నీవేళ నింపున్న నీ పాముచేతఁ
జావ నిచ్చునె విధి సాధించుఁ గాక
దైవమా యిట్టి బాధలకు లోఁజేయ
నీవేళ నీకు నేనేమి చేసితి

కలి మాయచే బోయఁ డొకండు దమయంతి కడకు వచ్చి
పాముసు జంపుట

అని యేడ్చుచుండఁగ నా యార్తరవము
విని కలి మాయచే వేవేగ నొక్క
బోయవాఁ డరుదెంచి బోనరనవుడు
పాయక తన చేతఁ బట్టిన పెద్ద
కత్తిచే నా పాము కంఠంబుఁ ద్రుంచి

మైత్రి భావల మైచి మెల నాగఁ జూచి
వెఱవకు లేతెమ్ము విపినంబులోనఁ
దిరుగంగనేల నీ తెరంగున నింతి
యెవ్వర వనితవో యెందుండి వచ్చి
తెవ్వాని వెదకెదో యీ పాముచేత
నేగతిఁ దక్కితి విధియెల్ల నాకు
వేగంబె తెలుపు నీ వెఱపెల్ల మాన్పు
దనవుడు లేచి యయ్యబల నీలవేణి
తనదు వృత్తాంతమంతయుఁ జెప్పఁ దొడఁగె

దమయంతి తన సమాచారము బోయనికిఁ

బోయన్న వినవె యీ భూమి నంతయును
నాయక చక్రంబు పను లొనరింప
నేలిన నలునకు నిల్లాలి ధరణిఁ
బాలించు భీమ భూపతిపుత్రి నేను
దమయంతి యను పేర దనరిన దాన
రమణతో నిషధాపురంబున నుండ
నతిముచ్చిఁ బగదాయియైన పుష్కరుడు
ధరయెల్ల గపట జూదంబున గొనియె
నది యాదిగా మహారణ్యభూములకు
వెదరుచు రాగ నా ప్రియుని చేలంబు
గపటంపుఁ బక్షులు గైకొని చనియె
నపుడు శోకంబున నడలుచు మేము
బొనరంగ నిద్దఱ మొక చీరఁ గట్టి
చనుచేరి యొక శూన్యసదనంబుఁ గాంచి
యరిగి కూర్చుంటిమి యంతలో నేను

మరచి నిద్దరఁబోవ మనమున నలిగి
నాసతి భూపతి నాపాటుఁజూడ
నోపక నాచీర నొక మూరఁ జించి
యదిగట్టి నను విడనాడి పోయినను
గుదలుచు నే మేలుకొని లేచి విభుని
గానక యేడ్చుచుఁ గడుఘోరమైన
కానలో వెదకి యెక్కడఁ గానలేక
నిక్కడి కరుదేర నీ పాము నన్నుఁ
దక్కక మ్రింగ నిత్తరి నీవు వచ్చి
యీ పాముఁ జంపి నన్నేలమిఁ బ్రోచితివి
యీపార్థివేంద్రుఁ డెం దరిగెనో యెఱుఁగ
ననపుడు వినిమనం బపుడు ఘటిల్ల
వనజాక్షి కాబోయవాఁ డిట్టు లనియె

బోయఁడు తన వెంట దమయంతిని రమ్మని పిలుచుట

నీరజాసన నీవు నిదురపోఁ జూచి
కోరి నీకట్టిన కోక చించుకొని
యడలక యిట్టి ఘోరాటవిలోను
విడిచిపోయినవాఁడు విభుఁడటే నీకు
బడఁతినిన్ గానల పాలుగాఁజేసి
యెడపక పోవువాఁ డెంతైనఁ గలఁడె
మగువ నిన్నిటడించి మఱిపోవువాఁడు
పగవాఁడు గాక పాలిటి మగఁడె
యడవిలో నీరీతి నలజడి బడుచు
విడువక నీవేల వెదకెదు వాని
నలివేణిమూ పాముకన్నను మంచి

బలువైన ఘోరసర్పంబులు గలవు
యడవిలోపల నొంటి నడుగంగనేల
బుడుమలఁ బడుదునో యిందీవరాక్షి
వలవదు నావెంట వననొప్ప రమ్ము
నయన కన్నను మంచినాఘండ నేను
నీకేల చింతింప నీకోర్కెలెల్లఁ
జేకొని కొనసాగఁ జేయుచు నన్ను
నమ్మి నాయింటికి నళినాక్షి రమ్ము
నెమ్మతి నాయింట సకల సంపదలు
గలవన్నిటికి నీవు కర్తవైయుండి
పలుదెఱంగుల నన్ను బంటుగా నేలు
కొని యుండు నీకేమి కొదువలు లేవు
ఒనరంగ నావెంట నూరకరమ్ము
పట్టణంబును జోలఁ బరగనాపల్లె
నెట్టనఁ గనుఁగొని నీవు మెచ్చెదవు
దానిని నేను సామాన్యుండఁగాను
పేరియుక్తి వడియంగఁ దెఱవాట్లుకొట్టఁ
నేఁగి కన్నముఁ బెట్టి గడియలు తియ్య
ఘనతమి ద్రవ్యమునెత్తి మూలలదాగ
ముసువులు కత్త్రింప మొగినొక్కయిల్లు
నుసుగు దాచుకపోయి యావల నడువ
నెలవొప్ప నుడుగొత్త నాసలఁగట్టఁ
బలుంగుల వాకట్టి కొరవవొట్టి
నెరప మృగంబులతోడఁ గూడంగబాజి
రేమల లేద సరినడుగెత్త

నాయంతపొలపరి నలినాయతాక్షి
బోయరాజులలోనఁ బొడగానమెండు
ఏవేళఁ జూచిన నెట్టి మాంసంబు
కావలె నన్నను కలదు లేదనక
వేవేగఁ దెప్పించి వెలఁది నీ కిత్తుఁ
గావున నా వెంటఁ గదలి రమ్మనిన
విని చాలఁ గోపించి వెలవెల బాఱు
తన కోపమంతయుఁ దనలో నడంచి
ఆ పాపకర్ముని నందందఁ జూచి
ఆ పుణ్యసాధ్వి యింపారగఁ బలికె

## దమయంతి బోయనికి నీతి చెప్పుట

బోయన్న యిది నీకు నుచితంబుగాదు
పాయక వినరాని పల్కు పల్కెదవు
ధరణీశు సతియును దనదు తల్లియును
ఇతెయండ్రు పెద్దలు జగతిలోనెల్ల
యనుమాట వినవుగా యున్న నీ కదియు
వినుపింతు నీబుద్ధి వెలయంగ వినుము
ఒనరిన యేగురు తల్లులలోనఁ
దన గురు సతియొక్క తల్లియై యుండు
దన రాజు సతియొక్క తల్లిగా నుండు
దన యన్న సతియొక్క తల్లిగానుండుఁ
దన సతి తల్లియే తల్లిగా నుండుఁ
దనుగనిఁ జన్నిచ్చు తల్లియు గాక
తన తల్లి సములైన తల్లులు వీర
లని విన్నవించెను నా బోయవాని

కిలకోన పేరలం దెవ్వరినైన
సొలవక కామించి చూచినంతటనె
యాయువుఁ జెడిపోయి నపకీర్తి జెందు
మాయును సుఖలక్ష్మి మానంబు తూలు
బాపంబు వర్ధిల్లు ఫలమెల్ల డఁగు
రూపంబు చెడిపోవు రోగంబు వచ్చు
నేపురా చెన్నుఁడు నెడయుఁ బుణ్యంబు
తాపంబు వొడము సంతాపంబు వచ్చు
నాపద లడిదెంపు నపజయం బొదవు
మాప్రలు పొలియును సుఖమెల్ల దొలఁగు
సంపదలెడఁబాయు సత్యంబు పోవుఁ
దెంపెల్ల చెడఁజను దెనుభీతి గలుగు
చేసిన దప్పును దీనరవచ్చు
బాక్కొను దైన్యంబు తలఁగను మఱియు
నంటకఁ బోవక యమకింకరాళి
కింక ముద్గరహల ఘోరగదాసి
సాధనంబు లమరి శాస్త్రాస్త్రములను
బాధింతు రిదిగాక బహుపురీషాది
పూతిగంధంబులఁ బొరలింతురుగ్ర
వైతరణీనదీ వడినెట్టిత్రోతు
రమునక పెక్కుడ లుంతురు మఱియుఁ
బడిపడినరక కూపముల పాతకుల
నని వేదశాస్త్రంబు లనిశంబుఁ దెలుపు
మనమున నిట్టి దుర్వ్రతముల విడువు
మటుగాన నీ తల్లి నగుదు నిచ్చటికిఁ
బటుగతివచ్చి యీ పామును జంపి

నన్ను రక్షించితి నా తండ్రివైతి
నన్ను నీ విటువంటి యల్పకార్యంబు
నను బల్కఁదగదన్న నాతి మాటలను
విని వాఁడి సూదులు వీనులలోనఁ
గ్రుచ్చిన గతినొచ్చి కోపించి బోయఁ
డచ్చపలాక్షితో నప్పు డిట్లనియె

బోయఁడు కోపముతో దమయంతిని బలాత్కరించుట

తరలాక్షి యిటువంటి ధర్మశాస్త్రములు
పొరవు వీనులకు నీసుద్దులు విడువు
మను నీవు యమలోకమున బాధలెల్ల
ననుభవించిన యట్టు లరసి చెప్పెదవు
పాపపుణ్యంబుల పరికింప మెప్పు
దేపార శాస్త్రంబు తెలుగము మఱియుఁ
కలకంఠి యముఁడు మాకడకురా వెఱచుఁ
గిలిగింతలను బెట్టి గెరలునే శిలలు
మాకు బాపము లేదు మదిరాక్షి నన్నుఁ
గైకొని పొందక కాని నేపోవ
నన విని యపుడు రౌద్రాకార యగుచుఁ
దనలోన మండుచుఁ దరలాయతాక్షి
వెలయు నా వృత్తంబు వీడేమి యెఱుఁగుఁ
గలుషాత్ముఁడని వాని గనుగొని పలికె
నోగి పాపాత్మ యీ యురగంబుఁ జంపి
కారుణ్యమున నన్నుఁ గాచితి గాన
రయమున నినుఁ జంపరాదని యున్న
భయ మింత లేక దుర్భాష లాడెదవు

నీవేత నేనేత నీ మాటలేద
నీ వెందు నుండక నిపుడు పొమ్మనిన
నప్పుడు వాఁడు రౌద్రాకారుఁడగుచు
నిప్పులు కన్నులు నిండార దొరఁగ
న వ్వద్మలోచన నల్లనఁ జూచి
కప్పిన కామాంధకారంబు చేతఁ
తన మేనుఁ దెలియక దగ్గఱ రాఁగ
వెనుకకుఁ బోయి యా వెలఁది యిట్లనియె.

దమయంతి శాపముచే బోయవాఁడు చచ్చుట
ఇదెందు వచ్చెద విఁకఁ జూడరోరి
పొందిన నీ గర్వ ముడిగింతు ననిన
బలవంతమున నిన్నుఁ బట్టి పై బడినఁ
జెలి యేమిచేసెదు చెప్పుమా యిప్పు
డని పట్టఁ గమకించునంత లోపలనె
యొనరంగ నిఁక నూరకుండ రాదనుచుఁ
దనలోనఁ దలచి యా తామరసాక్షి
మనమున వాక్కున మఱి నే తలఁచు
వరుని కొల్చిన పతివ్రత నౌదునేని
నరలోక విభుఁడైన నా కూర్మి విభుఁడు
పరుస సత్యంబు దప్పక యుండునేని
హరి కృప నొందిన యంగనేని
బోయవాఁ డిప్పుడే పొలసి దుర్గతిని
బాయక బడునని పడఁతి శపించె
పడలని యా ఘోర శాపాగ్ని దగిలి
యుడుగక యా బోయఁ డుబ్బెల్ల సమసి

పిడుగులు పడి కొండ పృథ్విపైఁ గూలు
వడువున నప్పుడ వసుధపై గూలి
కలఁగుచుఁ బలుమాఱు గాళ్ళు సేతులను
విలవిల దన్నుచు విడిచె బ్రాణముల.

నలుని దమయంతి వెదకుచు బోవుట

నంతలో దమయంతి యచ్చోటఁ బాసి
వంతగుందుచు శోకవార్ధి నీదుచును
భూపాలుఁ డిటు పాసిపోవుటఁ జేసి
యీ పాతకుఁడు నన్ను యిట్లాడెఁ గాక
నా విభుఁ డిందున్న నన్ను బాధింప
భావించునే వీఁడు పలుగాకి గాన
మగ దిక్కు లేకున్న మగువ ప్రాణంబు
తగదు పెట్టికయుండ ధారుణీ మీఁద
నిట్టి పాతకు లెంద టిచ్చోటఁ దెరువుఁ
గట్టిగ నన్నెంత గాసిఁ బెట్టుదురొ
వతిడించి పోవఁగఁ బడఁతిని బుద్ధి
మతులు నందేహించు మాటలు నిజము
మాటికి మగవాఁడు మహిమీఁద నరుగ
నాఁటది యొంటిగా నరుగంగఁ బోల
వాఁడు పుట్టుక పుట్టునట్టి దోషంబు
వాఁడిమిభువిఁ బగవారికి వలన
దక్కఁడా యీ విధి నడవిలో నేను
దిక్కుమాలిన యట్టు తిరుగంగవలసెఁ
గొండల నడవులఁ గ్రుమ్మర జాల
నొండేల నింక బ్రాణమును నుంచఁ దగదు

పెనిమిటి కెక్కడ ప్రియుడ నెడఁబాసి
చనుమని యెవ్వరు వచియించి రాక్కా
జని పేరెలుంగున నా కోమలాంగి
వన నాథు దేహాని తా నేర్చుకొనుచు
నరు దేర నెదురుగా ననలుండు ప్రబలి
పరువడిఁ బొదరిల్లి భస్మీకరింపఁ
వరలాక్షి కని పేడ్చ దావాగ్ని నడుమ
నరుదార జొచ్చిన నది చల్లనయ్యెఁ
గరితెండములఁ దన కరములఁ బట్టి
కరతరిఁ బెనఁగినఁ గురు లూరకుండెఁ
నెలుఁగు పిల్లలఁ బట్టి యిట్టట్టు నేయఁ
వలగొని యెలుఁగు లవ్వలకుఁ దొలంగెఁ
బలులున్న కడకు గొబ్బునఁ బోయి కదిసి
పొలియుట కెదిరినఁ బోరిగొన కుటికె
కంఠీరవంబులఁ గదిసి యాకంబు
కంఠ చేరిన నవి కదియక పోయె
నడవి పందులఁ జేరి యందందఁ బాళ్ళ
నడరుచు రువ్విన నవి పాఱిపోయెఁ
బాము పుట్టలలోన బాహువుల్ సాచి
ప్రామినఁ గఁటవక ఫణులు దొలంగె
వాణికెడు కొలఁకుల దుమికిన జలము
ఫణివేణి కూరుల బంటమైయుండె
నది సూచి హా యని యందంద యేడ్చి
యదియేమి మాయమో యెఱుగంగ రాదు
పరువడి నే మహాపాపిని గాన
పరగున నిపు డేల చావు సిద్ధించు

నని యని వగచుచు నా దమయంతి
చని చని మఱియును జరిగల దుమికె
ని రీతిఁ బ్రాణంబు లేమిటఁ బోక
హా రామ యడవిలో నలమటఁ బడుచు
జనులేమి తిందురో చావని కనుచు
మునుకొని విషపత్రములు గోసితినని
నా విషపత్రంబు లాఁకలిఁదీర్ప
చావు రావని యేడ్చి చని చని యెదుటఁ

దమయంతి ముని యాశ్రమము గాంచుట

పనస పిప్పల నింబపాటల వకుళ
మనసార సౌరసౌవర్ణ ఖర్జూరములును
పొన్నలుఁ బొగడలు పోక్రమాకులును
గన్నేరులును మల్లికలు చూతతరులుఁ
కదికుంద కదంబ కాంచన కుటజ
బదరితిత్రిణిబిల్వ పారిభద్రములు
తెలియంగఁ గమ్మ పూఁదీఁగెలు ప్రబలి
బలుపైన చలువ చప్పరముల నలరు
పల్లని నీడల జాతివైరంబు
లెల్లను విడిచి ప్రియంబునఁ బొదలి
సింగంబుఁ గొదమలు చేరి యేనుఁగుల
చెంగట ముద్దులు చేయుచు నుండుఁ
బెనుజాడఁ దప్పిన పెయ్యల వెదకి
కొనిపోయి మొదవులఁ గూర్చెడి పులులు
లేడి పిల్లలను లాలించుచుఁ గూడి
యాడుచునుండి పెంపలరు రేలుచును

సరసంబుగా ముంగిసల మీఁద నెక్కి
వరుసలోఁ బ్రాకెడి పరపన్నగములు
చిలుకల పిల్లల చెలిమితోఁ గూడి
కులుకుచు ముద్దాడుకొనెడు పిల్లులను
పలుచని నీళ్లలో బడియున్న మీలఁ
గులుకుచు వారిలో గూర్చు కొక్కెరలు
కోకిలార్భటులను గూడి యుండంద
చేకొని మేత భక్షించు కాకులను
పొలుపొంద నిష్పింఛంబున వినోదంబు
గలిగియుండిన యొక్క ఘన తపోవనము
దమయంతి కనుఁగొని తనలోన మెచ్చి
యమరిన యట్టి పుణ్యాశ్రమ భూమి
నేమౌనియుండునో యిది చూతమనుచు
నామానినీమణి యచట కేతెంచి
పురుషప్రమాణంబు భూమిపై కెగసి
పరమాత్మ నాత్మలో భావించి వారి
నొక్క పాదాంగుష్ఠ ముర్విపై నిలిపి
నిక్కి భానుని జూచి నిలిచిన వారిఁ
దరు శాఖలందు బాదములు దవిల్చి
కరిమర్థి దలక్రిందుగా వ్రేలువారి
బద్మాసనంబునఁ బరగఁ గూర్చుండి
పద్మాక్షనుతులు చప్పక నేయువారిఁ
హోమమంత్రముల నుచ్చరించుచును
హోమంబు లతిభక్తి నొగివేల్చు వారిఁ
గరములు ముకుళించి కన్నులు మూసి

చిరభక్తి జపములఁ జేసెడి వారిఁ
గనుఁగొని మదిలోన గడు సంతసిల్లి
గని చని ముందర సన్మునీశ్వరులు
కొందఱు ముంగలఁ గూర్చుండ దయపుఁ
బొందుగా వేదార్థములు వేడుకలర
నొక్కరి కొక్కరు నొగిఁ జెప్పుచుండ
నక్కామినీమణి యమ్మహాత్ములకుఁ
జప్పక సాష్టాంగ దండంబు పెట్టి
యప్పుడు దమయంతి హోదని యేడ్వఁ
గనుగొని వాల యా ధ్యానమహిమ
మనము నది కలి మాయగా నెఱిగి
యొండొరుల్ సందడి నొనర వారించి
నిండిన కృపతోడ నెలఁత కిట్లనిరి

తాపసులు దమయంతికి భావికాల వృత్తాంతమును జెప్పుట

ఎలనాగ నీ విపుడేల యేడ్చెదవు
వలవదు కర్మంబు వచ్చిన వేళ
మూడు కన్నులుగల మూర్తికికైన
వాఁడిమి తప్పింప వశముగా దిలను
మదిరాక్షి చూచితే మా యోగదృష్టి
నది నీకుఁ జెప్పెద మంతయు వినుము
కలి రాజు పన్నిన కపట జూదమునఁ
గలఁగి నీ విభుఁడు రాజ్యంబెల్ల నోడి
కలకంఠి నినుఁ గూడి కానకు వచ్చి
పులుగులచేఁ జేలమును గోలుపోయి
చెచ్చెర నీ పైట చెఱఁగుఁ గట్టుకొని

వచ్చి కొలంకున వడి నీరు ద్రావి
యుత్తరవిజనగేహముఁ బ్రవేశించి
నెత్తి నేలకు వ్రాల్చి నీవందు నిద్రఁ
బోవుచునుండఁగఁ బరవురఁ బొక్కి
ధావించి నినుఁ జూచి బాసిపోలేక
శోకించి శోకించి సుందర నీదు
కోక కొంగొక యింత గొబ్బున జించి
ఒడి గట్టుకొని నిన్ను నచట డించి
పదపడిపోవ భూపతి నొక్క పాము
కఱచిన నాతండు కాంతిని బాసి
పరువడి వికృత రూపమున నయోధ్య
కరిగి యా ఋతుపర్ణు నందంద గాంచి
సరసతరభక్తితోఁ గొలిచి వసించె
నలివేణి నీవిప్పు డా నిద్రఁ దెలిసి
వెలవెలపాటున విభుఁ గానలేక
విపినంబు లోపల విహరించుచుండ
నపు డొక పాము చయ్యన నిన్ను మ్రింగ
నొక బోయ మూర్ఖుఁడా యురగంబు జంపి
శుకవాణి నిను బట్టిఁజూచిన యపుడు
కోపించి యా పాతకున కంతలోన
శాపంబు నొసఁగి యాజము పురికనిపి
పతిలేని కతన నీ పాపాత్ముఁ డకట
మతిదప్పి యిటువంటి మాటాడె ననుచుఁ
జావదలంచి యచ్చటి మృగావలిని
వేవేగ కదిసిన వెరచు నన్నియును

నెలనాఁగ నీవంత నిటకు వచ్చితివి
కలి రాజు మిముఁ బట్టి గలిగి యాకీర్తి
వెలయించుచున్నాఁడు వెఱవకు మింక
తరుణి నీ విభుడు మోదమున నున్నాడు
లోలాక్షి యారేడు లోకంబులందు
నేలనైన నీ కెవ్వరు సములు
సరసఁ బతివ్రతాజనము వీక్షింపు
పరదార సౌఖ్యంబు లనుభవించెదవు
మఱువకు నీకొక మాట వచింతు
మురుతరా టడవిలో నుండకు మింకఁ
బడమను బాహుని పురమున కరిగి
తడయక యారాజు తరుణి దగ్గఱను
సైరంధ్రివై కొల్చి సరసత నుండు
వారక యిక మూడు వత్సరములకు
నీ నాథుడును నీవు నెమ్మది గూడి
మానిత సకల సామ్రాజ్య సౌభాగ్య
మనుభవించెదరు నీవడలకు మమ్ము
పెనుపొంద మేము సెప్పిన మాట వినుము
నీవు వచ్చిన దాఁక నిలిచితి మిచట
సావధానత సమస్తము నీకు దెలిసెఁ
దరలాయతాక్షిమా తపము నేఁడేరె
బరువడి నిఁక మేము బ్రహ్మలోకమున
కరిగెద మిపుడన్న మా మాటలెల్ల
వెరవెప్ప విని చాల విస్మయంబంది
కలఁగిన చిత్త మొక్కటిగాఁగ జేర్చి
యలినీలవేణి యిట్లని విన్నవించెఁ

పరమహంసలార ప్రణుతాత్ములార
నరలోకసుతులార నా తండ్రులార
ఘనముగ మీ పాదకమలముల్ నేను
గనుగొని సేవింప గలిగెను భాగ్య
వశమున నే యిట్టి యువ ర్తననయితి
విశదంబుగా నేను విపినంబులోన
నడలిన విధమెల్ల నానతిచ్చిరి
కడువేడ్క పెట్టినా కలుషంబు తలఁగె
వేడుక మూడేండ్ల వెనుక నా విభుని
గూడి యుండుదునంచు గోరి చెప్పితిరి
యిది నమ్మఁజాల నాకిది నిజం బనుచు
సదయత నాశరణస్థలి నంటుడనిన
నెలనాగ యింక మూడేండ్లకు వెనుక
బలవంతుడైన నీ ప్రాణదాయకుని
గలిసి నెమ్మదిని సౌఖ్యము నొంద గలవు
సలలితంబుగ నిది సత్యమటంచుఁ
గరముఁ జాచిరి కమలాయతాక్షి
శిరముమీఁదికి మునిసింహులు పిదప
నొనరంగ నా సుబాహుని పట్టణమున
కనుపమ గతిమార్గ మప్పుడు చూపి
కడువేగ బ్రహ్మలోకమునకుఁ జనిరి
తడయక దమయంతి తన చింత కొంత

దమయంతి సుబాహుని పురి కరుగుచు నొక గుంపుతోఁ జేరుట

మదిలోన సడఁచి యా మార్గంబునందు
బెదరక చనుచున్న బెరికెల వారు

దమయంతి చందమంతయుఁ జూచి వగచి
క్రమమైన రూపు రేఖలఁ జూచి చాల
సుడుగని గవపున నొంటిగా నీవు
నడిచె చెచ్చటికిఁ దిన్నగఁ జెప్పవమ్మ
నాతి నీపేరేమి నాథుఁ డెవ్వాఁడు
మా తోడఁ జెప్పవే మా తల్లి నీవు
వనజాక్షి యన విని వారలఁ జూచి
వనడు వృత్తాంతమంతయుఁ జెప్పదొణఁగె
వినరయ్య చెప్పెద విశ్వంబులోన
వినుతికెక్కిన నలోర్వీశుని సతిని
ధరణిలో నాపేరు దమయంతి యండ్రు
నరలోక సుతుఁడైన నా ప్రాణభర్త
కపట జూదంబు పుష్కరునితో నాడి
వసుమతి దాయాది వానికి నోడి
యడవుల జరి యింతమని వచ్చి మేము
నడరాని యిడుమలఁబడి యొక్కచోట
నిలిచి యక్కడ నేను నిదురపోవంగఁ
గలి మాయచే నన్ను గానలో డించి
మానాథుఁ డెచటికిఁ బోయెనో యెఱుఁగ
కానరే నల మహీకాంతునిమీర
లిలనేడు దీవుల నేలెడు వాని
నలరి కృష్ణప్రీతికై బ్రాహ్మణులకు
భయభక్తి మీఱంగ బహుసంపదలను
ప్రియమెుప్పఁగా సమర్పించిన వారు
సత్య సత్కీర్తుల నెగడెడివాని

సత్యాంత హరిభక్తి నమరినవాని
జగతి నిక్ష్వాకు వంశజుల కందఱికిఁ
బొగడొందు కీర్తులఁ బుట్టించు వాని
నో చంద్రకుమార మీరుర్వి నెందైనఁ
బ్రీతిఁ జూడరుగదా పృథివీతలేశ
ననవుడు విని వాలలాత్మలో వగచి
పనివడి మాతగా భావించుకొనుచుఁ
దోయజహిత దీప్తి దూరని యట్టి
యా యరణ్యంబున నేల వేగింపఁ
బురములలోఁగాని భూమినాథుండు
నరుల రాటవిలోన నుండంగఁ బోఁడు
సతి నీవు మావెంట జనుదెమ్ము భూమి
పతియౌసు బాహుని పట్టణంబునకుఁ
బోవుచున్నారమో పూబోఁడి యనుచు
వావిరి దోడ్కొని వడివడినరుగఁ
జెదరక తాము చేసిన పుణ్యమహిమ
నెదుట నొక్క తటాకమిం పొందియున్న
నది కని చనుచు వారందఱా కొలనుఁ
గదిసి గొనెల నొక్క కడఁబడఁ ద్రోచి
తనర నెద్దుల నీరుఁ ద్రావించి మఱియు
తనివి నిండార నందఱు నీరుఁ ద్రావి
వేడుక నాచెంత వెలసిన మ్రాకు
నీడల నందఱు నిలిచి కూర్చుండి
తమ తమ బడలికల్ తానె చెప్పుచును
దమయంతి జూచి యోతల్లి నీ విపుడు

కొదుకక యుదకంబుఁ గ్రోలుమటన్న
మదిరాక్షి పోయి యా మంచి జలంబు
కొక కొన్నిటిని గ్రోలి యొగి మూర్ఛఁబోయి
వికలత్వముని లేచి విభుని దలంచి
యెటు పోయితివి నాథ యిటుమల నొంద
నిటు ననుడించి నీ వెందున్న వాఁడ
వనుచు హాయని శోక మంచుచునుండె
జనుప వారప్పు డా జలజాయతాక్షి
శోకంబుమాన్ప నచ్చో నొక్కచల్ల
మాకు నీడను జేరి మగువ కూర్చుండెఁ
దన వంశభవుఁడు భూభవుఁడైన నలుని
వనిత కష్టముఁజూడ నశముగా కస్త
గిరిఁజేరె నన్నభంగిని నొప్పఁగగన
సరణిని బశ్చిమాచలమున కరిగెఁ
దడబడఁ మింట సంధ్యారాగ మొప్పె
నడుమడిఁ జుక్కలు గనుపట్టె మింట
నది నభమిది భూమి యని యెన్నకుండఁ
గదిసి యంతంతఁ జీకటి నిండఁబర్వె
మెండుగా ఘూకముల్ మెలగంగఁజొచ్చె
దండి భూతంబు లుద్దండతఁ దరిగె
భేతాళ శాకినీ భీకరంబైన
భూతంబులందంద పొడచూపఁ బొడఁగె

చనుపవారిని నడవి యేనుఁగులు కష్టపెట్టుట

సరగున నప్పుడా చనుపవారెల్ల
మఱచి నిద్దురవోవ మత్తసామజము

అరుదెంచి యిట్టుల నటఁగొన్ని చంపి
పెరికెలవారలఁ బీచమడంచి
కొండల మందింపఁ గూయుచు వేచి
కొండజు సందులు గొందులు సొచ్చి
తమ తమ ప్రాణముల్ దప్పించుకొనిరి
సమరంగ మతికొంద ఱటు పోవలేక
మరణముల్ తప్పఁబడి చనలేక యచటఁ
నరులచే మడిసిరా కల్లోలమైన
రవళి దిగ్గగలేచి రాజేంద్రుదేవి
వినతమై యిది యేమి విధముకో యనుచు
నిపులఁ గగ్గొని చావు గలిగెనటంచు
మరియఁ బోయిన నవి తలఁగిన మరలి
వసుధపై జచ్చిన వారలఁ జూచి
వెసువక యేడ్చుచు వెలఁది యిట్లనియె
అక్కటా యీ పాపమంతయు నాకుఁ
గక్కసంబునఁ జూడఁగలిగెనే దోస
కారినిగాన నీ కర్మంబు మీకు
నేనుగల్ వచ్చి మిమ్మిటఁ జంపిపోయె
నేనేమి వెంబడి నేరివచ్చుకతన
నేనుగల్ వచ్చి మిమ్మిటఁ జంపిపోయె
నాకేల సిద్ధించు నలి నిట్టిచావు
చేకొని యిఁకనేమి సేయనున్నదియొ
కలిరాజు చేసెడి కపటవర్తనము
నలరంగఁ దెలియరాదని యేడ్చుచుండెఁ
కావక తప్పిన జనుపనారప్పు
దావెరదుక దుఃఖమంతయు మాన్పి

నీవేమి సేతువు నీరజవదన
యీవిధ మట్లుండ నడలంగనేల
మన్నన నిను జూచి మమ్ము కొందఱని
మన్నించిపోమెనా మదసామజమ్ము
లని పల్కుచుండఁగా నంతలో భానుఁ
డనురక్తి పూర్వాద్రి కరుదెంచె నంత

## దమయంతి సైరంధ్రి వేషము వేయుట

నామత్తగజయాన యచ్చోటుబాసి
యా మార్గమున బోవ నట గొంత దూర
మున గనుపించె గోపుర కాంతి రుచులు
ఘనమైన మేడలు కనక హర్మ్యములు
కోట లుప్పరిగె లాకోమలి చూచి
పాటించి సైరంధ్రి భామవేషముఁ
బురముల్ఁ జొచ్చి యప్పుడు మేనుకుంచి
వెఱవొప్ప నా రాజవీథి నీరీతిఁ
గువలయేశ్వరు బాసి కుందుచువచ్చు
కువలయాక్షిని గుంపుగూడి చూచుచును
గువలయ హితబింబ కోమలాననలు
కవిలి యిట్లనిరంతఁ దమ లోనె తాము
చూడరో యమ్మ యీ సుదతి రూపంబు
వేడుక లూరెడు వెనఁజూడఁ జూడ
యీ వనితామణీ యెవ్వరొకాని
భావింపఁ బతికిఁ దప్పని యరుంధతియొ
యని శంబుగొని యాడనగు చన్ద్రమతియొ
మానస భవు వధూమణి రోహిణియొ

సమరేంద్రమణి యొప్పుననదగు కొప్పు
కమలారి బింబంబు గమరు నెన్నుదురు
నరవింద పత్రములట్ల నేత్రములు
వెలుగు పద్దము బోదమించి చెక్కిళ్ళు
కంతు శంఖంబు పొంకంబు కంఠంబు
వింత పువ్వులచెండ్లు వెలఁది పాలిండ్లు
చిగురుటాకులబాగు చేతులలాగు
బిగియుంప సాఘ్రంబు పేద మధ్యంబు
స్ఫుటమై కటినిభంబు శ్రోణితలంబు
పటుతర కదళికాప్రభ నొప్పు తొడలు
తలిరుల నొప్పు పాదంబుల యొప్పు
కలహంసనడలు చక్కని నాతినడలు
నిగ్గఁ దపక్కున నెగయు మెఱుంగొ
బంగారు బొమ్మయో పగడంపులతికొ
కలికిరా చిలుకయొ కాయజు శరమొ
యలరుల బంతియొ యాణిముత్తియమొ
యని యిట్లు వినుతింప నా దమయంతి
గని పురసతులు దగ్గఱి మఱిమఱియు
జూచు చుండంగ నా సుందరి యపుడు
సైచని వెత రాజసరణిఁ బోవంగ

దమయంతిని రాజమాత పిలిపించుట

నల్లన పురనాథుఁడైన సుబాహు
తల్లి శిరోగృహస్థలినుండి జూచి
తన చెంతనుండిన తరుణి కిట్లనియె
వనజాక్షి జూచితే వచ్చెడు దాని
నలినారిఁ బోలు నాననకాంతి మించి

చెలనొప్ప శ్రీలక్ష్మి వదువున నున్న
దీటంతి యెవ్వరో యెఱుగంగరాదు
పోయి నీవటికిఁ బొలఁతిని దోడి
కొని రమ్మనన్న నా కోమలి పోయి
మనుజేసు సతిఁ జూచి యా యమ్మ నిన్ను
సతివేగఁ దోడి తెమ్మని నను బంచె
సతివ నా వెంట రమ్మని దోడుకొనుచుఁ
జనుదేర సమ్మహీశ్వరు దేవి జూచి
మనవార నా రాజమాత యిట్లనియె
ఇందీవరాక్షి నీ విటువంటి వగల
నెందు బోయెదవు నీ వెవ్వరి దాన
ఇంలోన నీకుఁ బ్రాణేశుఁ డెవ్వండు
కరకంత నీ మేనగన లక్షణమ్ము
అరసి చూచిన చోద్యమగుచున్న దిప్పు
డెఱిఁగింపు నీ విధంబెల్ల నా కనిన
జలజాక్షి సైరంధ్రిజాతి కోమలిని
నలుదనియేటి గంధర్వుఁడు విభుఁడు
సభమున జరియించు నన్ను నేమరఁడు
ప్రఘారాణి యనుపేరఁ బరగితి ధాత్రిఁ
గలిగిన సైరంధ్రి కాంతలలోనఁ గలపంబుఁ
గను తెన్నగాఁ గూర్పగలను
నోకలు గట్టను గుంకుమ పెట్టఁ
బోకల వర్ణింపఁ బువ్వులుగట్టఁ
గాటుకఁ బెట్టను గంధంబుఁ బుయ్య
వాటించి నూటిగా బాపట దీయ
గురులెల్ల సవరించి కొప్పు గీలింప

తెఱఁగొప్ప కస్తూరి తిలకంబు దీర్చి
నవరత్నములు దెచ్చి నవసూత్రములను
దవిలించి గళమున దగిలింప నేర్తు
ఇసిఁ బూని యిటువంటి పను లొనరింప
ననువుగా నా చేత నౌను కాదనకు
మఱువక నే నొక మాటఁ జెప్పెదను
బొరుగిండ్ల పనులకుఁ బోవ నెన్నఁడును
జెలరేగి మగవారి చెంతకుఁ బోవ
పలు విప్పనానోపఁ బలుమాట లాడ
కొఱత నేఁగట్టిన కోకయే కాని
మఱియేమి యొల్ల సమ్మతము పైవార
లలరఁపున నన్ను నీ దాసిగా నేలి
నిలుపుము నిలిచెద నీయొద్ద ననిన

దమయంతి సైరంధ్రి రూపముతో రాజమాతకడ నుండుట

నా రాజమాత యా యవనీశు సతిని
గారుణ్య రసముల్కఁగాఁ జూచి మెచ్చి
యాదిలక్ష్మీదేవి యమరిన యట్లు
ప్రోదిగా మా కెల్ల బుద్ధి సెప్పుచును
నొనరంగ నా యొద్ద నుండవే యమ్మ
యనురక్తి నీ కిష్టమైన చందమున
ననుచు సూతు సునంద యను కన్య బిలిచి
యనిశంబు సతి ప్రోవుమని యొప్పగించె
దమయంతి యచ్చోట దానేర్చు పనుల
గ్రమ మొప్పజేయుచు గలుగుచు నుండె



## అధ్యాయము ౯

### నలుఁడు ఋతుపర్ణుని నగరంబున దమయంతిని దలంచి విలపించుట

అక్కడ నలుఁ డయోధ్యాపురంబునను
మక్కువ మీఱ నమ్మనుజేశు గొల్చి
పలికి సమ్మదమైన పనులఁ జేయుచును
మెలఁగుచు నా నల మేనిని నాథు
డొకనాఁడు వెన్నెల లొగిఁ గాయుచుంత
సకలంకమతితోడ నటఁ బవ్వళించి
తన ప్రాణనాయకి దలఁచి చిత్తమునఁ
దనలోనఁ దా నిట్లు తలపోయఁ దొడఁగె
నక్కటా నిన్ను ఘోరాటవి విడించి
పొక్కుచు వచ్చి యీ పురిఁ జేరినాఁడ
నను నీవు వెదకుచు నక్కానలోనఁ
గనలేక మిట్టి దుఃఖంబుఁ బొందినావొ
గిరిగృహంబుల నన్ను గెరలుచు వెదకి
గురుమృగంబుల చేతఁ గూలితి వేమొ
పన్నుగాఁ బొదల లోపల నన్ను వెదకి
పన్నగంబుల కగపడితివో వనిత
దాయెడ నను గాన కడలుచునుండఁ
బోయెల మాయలఁ బోయితో భామ
వెలవెల పాటున వెదకుచు నన్నుఁ
బలుమాఱు నీ వెంత బడలితో చెలియ
విడివడి నను నీవు వెదకంగ వచ్చి

ఇడుమలఁ బడుచు నెల్లగితో తరుణి
కలనైన ననుఁ బాయఁగా జాల ననుచు
పలికితి విపు డెట్లు పాసితో లలన
నిమర మేల్కాంచి నన్ను నెమ్మితోగాన
కవరి యొంటిగ మూర్ఛనందితో తరుణి
నే నే దేశములకేగి తెందున్న దాన
ఏవళ వాటిల్లె నిద్దుఃఖ కనుచుఁ
దనుఁ గొల్చు రాజుల తాను సేవింపఁ
బనిచిన తన వ్రాత ఫలము నెన్నుచును
వనలోన నీ రీతి వలపోయు చుండ
విని ఋతుపర్ణుండు విస్మయం బంది
యిది యేమి బాహుక యెన్నఁడు నీవు
మదిరాక్షి కలదని మదిలోనఁ దలఁప
విప్పుడు దలంచి నీ వేల శోకించె
నప్పుడాయింతిని నడవిలో విడిచి
వచ్చితి వెంత లావణ్యంబు గలదో
యచ్చపలాక్షి నీకన్నను మఱియు
నెట్టి రూపముగల యింతియో దాని
నెట్టిన నడవిలో నిల్పి రాఁదగునె
కంతుఁడు నీ మీఁదఁ గడిసెఁగాఁబోలు
నింతిని దలఁచి నీవిట్లేడ్చుచున్న
నది నిను దలఁచి పుష్పాస్త్రుని బాధ
మదిలోన నేమని మరుగుచున్నదియొ
హరిహర బ్రహ్మాదు లంతటివారు
మరునికి వెఱచి భామల నురంబునను
శిరమున వాక్కానఁ జేర్చికొన్నారు

సరసత నీయంత చక్కనివాఁడు
షక్కోట నిల్లాలిఁ బూనంగలేక
యొక్కడ విట్లుండ నుచితమే యనిన
విని వెలవెలఁ బాఱి వెఱచి నలుండు
జతినాథ నాకేలనన నన్ను జూచి
రోయక సతులు కోరుదురె నా పొందు
కాయుజుఁ డిపుడు నా కడికేల వచ్చు
నావగఁజూచిన నగుదురు జనులు
భూవర నేఁ బ్రొద్దు బుచ్చెడి కొరకు
సొలయక నొక రాజు సుద్దులు మదిని
దలపింప నుడితివి దప్పదు నాకు
నను గేలిసేయకు నరనాథ యనిన
దనలోన నవ్వుచు ధరణీశుఁ డరుగ
జచ్చిన చావుగా జనలోకనాథుఁ
డప్పోట నాత్మలో నడలుచునుండె

## భీమభూపాలుం డల్లుని గూఁతురుని వెదకుటకై వసుదేవుని పంపుట

నక్కడ నంత భీమావనినాథుఁ
డెక్కడబోయిరో యింతియు నలుఁడు
పొక్కుచు నేదేశమున నున్నవారొ
యక్కటా యని యాత్మనందంద పొగిలి
తన మంత్రివరుల బాంధవుల భూసురుల
యనుమతి వసుదేవుడను పురోహితుని
బిలిపించి యతనికిఁ బ్రియము సంధిల్ల
బలికె హేమపటాది బహుమానమిచ్చి

యనఘాత్మ నాకూఁతు రల్లు డేదేశ
మున నున్న వారొకొ భూదేవ నీవు
వేవేగఁజని వారివిధ మెల్లదెలిసి
రావలె నని యన్న బ్రార్థించుకతనఁ
బనిఁబూని యప్పుడా బ్రాహ్మణోత్తముఁడు
కనకారితో గూడ తడయక యరిగె
గౌళదేశంబు బంగాళదేశంబు
మాళవదేశంబు మత్స్యదేశంబు
సౌరాష్ట్ర మగధ గూర్జర మహారాష్ట్ర
శూరసేన పుళింద చోళలాటాది
దేశంబులందెల్ల ద్రిమ్మరి మఱియు
నాశి కర్ణాటక గాశ్మీర కటక
కాంచి ప్రయాగాది ఘనపట్టణముల
సంచరించి యనేక శైలంబునందు
బుణ్యాశ్రమంబులఁ బుణ్యఘట్టములఁ
బుణ్యతీర్థంబుల బుణ్యభూములను
గ్రమమొప్ప వెదకి యెక్కడ గానలేక
తమలోన దాము సంతాపంబు నొంది
యురువడి సుబాహుని పట్టణమున
నరయుద మని యప్పు డాపురిఁ జేరి

## వసుదేవుఁడు దమయంతిని దెలిసికొనుట

యరయుచు నుండిరి యట గొన్నినాళ్ళు
గురుభక్తి నా సుబాహు డొక్కనాడు
దానముల్ సేయంగ దరలు విప్రులతో
భూనాథు గనుగొనఁబోవు చందమున

వసుదేవ ముఖ్యులు వారితోఁ గూడ
బొసఁగ దానము గొనఁబోవు చందమున
జని రాజ నిలయంబుఁ జయ్యనఁ జొచ్చి
యొనరు వింతలు చూచుచుండగా నచట
నరయఁ జిక్కుపడిన యలివేణితోడ
బరికించి నడచెడి పదములతోడ
నుడుగక వెడలు నిట్టూర్పులతోడ
గ్రుక్కుఁ గ్రుక్కున గ్రమింగి గ్రుక్కిళ్ళతోడ
వన్నెజారిన యట్టి వాతెఱతోడఁ
జెంచు దొరంగి దప్పిన మోముతోడ
బతి దప్పి మొలకుఁ జాలని చీరతోడ
నలుకుచు నొకచోట నుండఁగా జూచి
యవనీశు సతినైన యా దమయంతి
యవునొకో కాదొకో యని సంశయమున
వసుదేవుఁ డప్పుడా వనిత దగ్గరకు
వెసఁజేర రాఁజూచి వెలవెలవోయి
తన తండ్రి సన్నిధిఁదగు విప్రుం డనుచుఁ
దనలోన దెలిసి యత్తరిఁ జూడ వెఱచి
యొనసిన వగలతో నిలఁ జూచుచుండఁ
గనుంగొని దమయంతిగా మనంబునను
దలఁచి యా విప్రుఁడు తరలాక్షిఁ గదిసి
కలఁగిన నీటిలో గమలినం బోలి
జలధరంబులలోని శశిరేఖం బోలి
మలినాంబరములోని మణియును బోలి
చలిత ధూమావృత జ్వాలిక బోలి
పొలుపెల్లఁ దరిగిన పూఁబోణి గాంచి

నో చంద్రవదన యుండున్నావె నీవు
రాచపుట్టుక పుట్టి రాయిడిఁబడితె

దమయంతి తన పురముఁ జేరుట

దమయంతి వినుము నీథవు పెందుపోవె
మముఁబంచె మీ తండ్రి మహినెల్ల వెదక
ననఁదే రెలుఁగెత్తి యా దమయంతి
తన మొగఁబునం జీరఁ దగఁ జేర్చి యేడ్వ
విని కలంగి సునంద వేవేగఁ గదలి
జనని దగ్గఱకేగి చయ్యనఁ బలికె
మన ప్రభురాజీ మెయొకౌగాని తెలియ
దెనలేని దీనత నేడ్చుచు నున్న
వొక భూసురుని జూచి యెడుగక యనిన
నలుక మతితోడ నా రాజమాత
గ్రక్కున వచ్చి యా కాంతలలామ
నక్కునఁజేర్చి యూరార్చి వాక్రుచ్చి
యచ్చట నున్న బ్రాహ్మణు విలోకించి
యచ్చపలాక్షి యిట్లేల శోకింప
నిటకు బంచిన వార లెవ్వరు నిన్నుఁ
దటుకున నిపుడంతఁ దగ జెప్పుమనిన
విని వసుదేవుఁడా పెలది నీక్షించి
మనమున ముదమంది మగువ కిట్లనియె
వినుము విదర్భ భూవిభు పురోహితుఁడ
ననురక్తి వసుదేవుఁడను పేరివాఁడ
నీరాజవదనయా నృపశేఖరునకు
గూరిమి పుత్రి మక్కువ దమయంతి

యను పేరు గలిగిన యలిసీలవేణి
కనకశోభన గాత్రి కంజాతనేత్ర
నలుని పట్టపురాణి నయకీరవాణి
విలసిత కల్యాణి విమలాబ్జపాణి
పూర్వ కర్మంబునఁ బుష్కరేంద్రునకు
సర్వమహీజ్య సంపదలెల్ల
జూదంబులో నోడి సుదతితో నలుఁడు
మోదంబు దప్పి యిమ్మాన కానకరిగె
నను వార్త విని మమ్మ నరసి రమ్మనుచు
సనిచె భీముఁడు మేమునందంద వెదకి
మెచ్చుటఁ గానక యేము చింతించి
యిచ్చటఁ గనుగొంటిమీ దమయంతి
సని చెప్ప విని వారి నగ్గించి కరుణఁ
గనుగొని దమయంతిఁ గౌఁగిటఁ జేర్చి
యా రాజమాత యిట్లని యేడ్వఁ దొడగె
ధారుణీశ్వరుఁ బాసి తల్లడించుచును

రాజమాత దమయంతిని జూచి చింతించుట

పడఁతి నీ వెంతటి బాధలఁబడితొ
పుడమ ఱేఁడెక్కడఁ బోయినాడమ్మ
మెలనాగ యొంటిగా నెట్లు వచ్చితివి
యిల నేడుదీవుల నేలు భూపతికిఁ
ధరణిపై యిటువంటి వేషంబు
ధరియింప వలసెనే తల్లిరో నీకు
ననిననేఁ బాపాత్మురాలను గానఁ
గనులార నిట్టి దుఃఖముఁ జూడ వలసె

నాతల్లి నాయమ్మ నాముద్దు చిల్క
యీ తెఱంగెల్ల నా కెఱిఁగింప కప్డు
వేళ దాచితివి నన్నెఱుఁగవే తల్లి
పాలింప నీవు నా పుత్రివి నీదు
తల్లియు నే నొక్క తల్లి బిడ్డలము
తల్లి నీ కేఁ బినతల్లిని సుమ్మి
చెప్పవే యిటకు వచ్చిన తెఱంగనిన
నప్పుడు దమయంతి యతివ కిట్లనియె

## రాజమాతతో దమయంతి తన వృత్తాంతమును తెల్పుట

ధరనెల్ల నోడి నాధవుడును నేను
నురుత రాటవులలో నొగిఁ బోవుచుండ
బతికట్టు పుట్టంబుఁ బక్షు లేతెంచి
యతివేగఁ గైకొని యరిగి నంతటను
నా కోక కొంగు భూనాథుండు గట్టి
శోకంబుతో నొక్క శూన్యగేహంబు
జేరితి మట నిద్రఁజెందిన నన్నుఁ
దేరిపాఱఁగఁ జూచి ధృతి దిగనాడి

నాపతి భూపతి నాపాటుఁ జూడ
నోపక నాచీర నొక కొంత చించి
తా నది గట్టుక తలఁగిన లేచి
భూనాథు నెపట గానక నరణ్యములఁ
బడరాని బాధలఁబడి సిగ్గుకొంత
విడువక సైరంధ్రి వేషంబు దాల్చి
నీతోడఁ జెప్పక నేగొల్చియుంటి
భూతలా ధిపు డెందుఁ బోయెనో యెఱుఁగఁ

ననతాంగి మమ్మిట్లు కలిమేడఁ దొడంగె
ననవుడు వగచి మున్నక్కటా యెవరు
బొందని బాధలఁ బొందితే యనుచు
మందయానకు వేగమణి భూషణములు
కనకవస్త్రాలొసంగగ నెంచి నీదు
పెనిమిటి నేనింక వెదక బంపెదను
జేకొని యిప్పుడీ చీర ధరింపు
శోకంబు వల దన్న సుందరిఁ జూచి
చిఱునవ్వు నవ్వి యా చిగురాకుఁ బోడి
యురుదారదనశో మడఁచి యిట్లనియె
నా సరివారిలో నగుబాటు కాఁగ
నీ సొమ్ము ధరియింప నెట్లొప్పుదానఁ
బతి నరణ్యంబునఁ బాసి యేతెంచి
యతివేడ్క సౌఖ్యంబు లందె నటంచు
నవనిజనావళి నన్నాడు కొనదె
యివి యేల నాజీవితేశుండ లేని
వెనుక సౌఖ్యములు వేడుకలేల
యిన వంశ తిలకుండు హృదయేశ్వరుండు
నా పాలిదైవంబు నా ప్రాణపదము
నా పెంపు నా సొంపు నా పట్టుకొమ్మ
నా మేలు చెలికాఁడు నా నోముఫలము
నా మెచ్చు నలరాజు నన్నేలు రాజు
నను గూడి యుండెను నాటికి సౌఖ్య
మనుభవించెదఁ గాక యమ్మ నేడేల
యనవుడు దమయంతి నట్లూరడించి

వనయున కెఱఁగించి తద్దయు భక్తి
వసుదేవ ముఖ్య ప్రవరులఁ బూజించి
పసగల బంగారు పల్లకి నుంచి

రాజమాత సుమంయంతిని తల్లిచంద్రులకడ కంపగా
హా రామెను గని వగచుట

తామరసాక్షిని దగువారిఁ గూర్చి
భీమునిపురికి నంపినఁ బోయిచేరి
నలినాక్షి యప్పు డా నగరి లోపలను
బలవరించుచు వేగఁ బల్లకిడిగ్గి
తన తండ్రి పదముల దప్పక వ్రాలి
ఘనమైన శోకాగ్నిఁ గ్రాగుచునుండఁ
దల్లి వేగమె వచ్చి తనయతో వగవు
వెల్లువమునిగి యా వెలది యిట్లనియె
పట్టభద్రునిఁ జెట్టబట్టి యీరీతిఁ
గట్టబట్టయు లేక కలఁగితె తల్లి
నీతోడి వారెల్ల నెమ్మది బ్రతుక
నాతి నీ కిటు వ్రాసె నా పద్మభవుఁడు
యొద్ద బిడ్డను లేక యుండెడి నీకుఁ దద్దయుఁ
గష్టంబు దార్కొనఁ జేసె
తల్లినీ యిటువంటి తగని వేషంబు
లెల్ల ధరించి నీ వెట్లోర్చి తమ్మ
సరసిజాసన భద్రశాలల డించి
యురుశైలముల నెట్టు లుంటివో యమ్మ
చపలాక్షి సౌధర సంచారంబు విడిచి
విపిన భూముల నెట్లు విహరించి తమ్మా

నెలఁత నీ బంగారు నిలయము ల్వీడచి
యిలఁ బర్ణశాలల నెట్లుంటి వమ్మ
చెలియ నీ మృదువైన శయ్యలు డించి
శిలలపై నెట్లు వసించితి వమ్మ
నలినాక్షి నీ ప్రాణనాథునిఁ బాసి
బలుకాన యందెట్లు వర్తించి తమ్మ
మగువ నీ కెనయైన మగువ లడించి
మృగసంఘముల నెట్లు మెలఁగితి వమ్మ
నీరూపు నీచూపు నీసొంపు పెంపు
నీ రాజ్య విభవంబునేఁ డెందుఁబోయె
నెలమి నీ బిడ్డల నిద్దఱఁ జూచి
విలపించు చుందుమో వెలఁది యేవేళ
నల మహీశుఁడు తన నగరంబుఁ బాసి
పొలఁతితోఁ గానన భూమికిఁ బోయె
నను వార్తఁ దెలిసి మీయయ్య యింతింత
యనరాని ఘోర శోకాబ్ధిలో మునిగి
యున్నాడు కొలువున కొక్కనాఁ డరుగ
డన్నము దినఁడు మిమ్మందఱ దలచి
తనలోన దాను సంతాపంబు నొందు
నని యేడ్చి బిడ్డల నపుడె తెప్పించి

దమయంతి తన బిడ్డలను చూచుట

తనయ కొప్పించిన దమయంతి చనులు
పెనుపొంద జేసియు బిడ్డలమీద
గరగలలోఁ బాలకై వడిఁ గురిసె
ధరణీశసతి యంతఁ దనలోనె తాను

తన బిడ్డలను జూచి తన యున్నఁ జూచి
వెనుకొన్న వగలతో విలపింపఁ దొడగె
భీమకాంతుఁ డప్పుడు పుత్త్రిండు దాను
శోకంబు వారించి సుత నాదరించి
మేల యేడ్చెదవమ్మ యని కులాధిపుని
మేటి పిలనై నను నిటకు రప్పింతు
నని పుత్త్రి వృత్తాంత మంతయు నడిగి
విని యిట్టి వగలచే వేగితే తల్లి
యని చాల విలపించి యా రాజమాత
పనిచిన పల్లకి భటులను మగుడ
ననిచి యా వసుదేవు నర్చించి మ్రొక్కి
కనక వస్త్రము లిచ్చి కడు భక్తి పలికె.

భీమరాజు నలుని వెదకుటకై వసుదేవు నంపుట

ధరణీశ నరేంద్ర మీ దయచేతఁ బుత్త్రి
నరయంగ గంటిమి యువనితో నింక
నలుఁ డెందు నిలచియున్నాడొకో కాని
తెలియరాదింక నే తెరంగునైన
గానకొని వెదకి దోడ్కొని రమ్మటంచు
నన విని దమయంతి యతని కిట్లనియె
ధరణీశ నిర్జర యయోధ్యా పట్టణమున
నరయంగ ఋతుపర్ణుడను రాజు చెంత
నా విభుం డార్తి నున్నాఁ డా మహాత్ము
భావించి గుర్తింప వశముగా దెవరి
కందుకు నొక యుపాయము దెల్పుదాన
పొందుగా మీర లా పురమున కరిగి

యా ఋతుపర్ణుని యాస్థానమునకుఁ
జేరి యిట్లని దూరి చెప్పు దా నలుఁడు
సత్యవ్రతుండు భూచక్రేశ్వరుండు
సత్యంత ధార్మికుఁడైన భూవిభుఁడు
సత్య దానవినోది నిఖిలార్థ వేది
యత్యుత్తముఁడు దయాపర మూర్తి
అట్టి మహామహుం డడవిలోఁ దరుణి
కట్టిన వస్త్రంబు కడువేగఁ జించి
కొని నిద్రపోవఁగా ఘోర దుర్గముల
ననిచి పొదగునె యా యువిదనటంచు
బలుకఁ డా మాటకుఁ బ్రతిమాట మీకుఁ
బలికిన నాతని భావంబుఁ జూచి
వినుదెండు నే నొక్క చందంబు మీకు
వెనుక జెప్పెద గాక వేంచేయుఁ డనుచు
బలికిన నప్పు డా బ్రాహ్మణుం డాత్మ
దలఁచిన గతి నయోధ్యాపురి కరిగి

## దమయంతి చెప్పి పంపిన మాటలను
## వసుదేవుడు ఋతుపర్ణుని సభలో జెప్పుట

సరగున ఋతుపర్ణు సభఁ గాంచి యొక్క
తెరగున నా వసుదేవు డిట్లనియె
క్షితినాథ నలరాజు చేసిన చేత
వితతంబుగా నీకు విశదంబు సేతు
తన మేనుఁ దెలియక దాయతో జూద
మనురక్తితో నాడి యన్నియు నోడి
యడవికి చని చని యట నొక్కచోట

బడలి నిద్రింపంగ బైనున్న కోక
సగము చించుకొని యెచ్చటి కేగినాఁడొ
పగవాని గతి నెడబాయ రాదనక
ఘోర కాననలోనఁ గులకాంత విడిచి
పారిపోవుట దేటి పౌరుషం బిలను
తరళాక్షి తనకేమి తప్పుఁ గావించె
మరు దుర్గభూముల నునిచి పోవుటకు
నలుఁ డిట్టి పాపమునకుఁ బూను ననుచుఁ
దొలుత నెఱింగిన దొంగ్యాలి నియ్యఁ
దలఁచునె మా భీమ ధరణీశ్వరుండు
వలనొప్ప రనవంటి వాఁ డిట్టి ధంబు
చేసిన నింకేమి సేయంగ వచ్చు
వాసవాదుల నెల్ల వదలించు దన్నుఁ జేర్చి
గోరి పెండ్లాడిన కువలయ గంధి
నీ రీతి సేయంగ నిది కార్యమగునె
విడిచిపోఁ దలఁచిన వెలఁది దోడ్కొనుచు
తడయక నా లేమఁ దల్లియల్
పోవరెఁ గాక నీ పోల్కిఁ గావించి
పోవచ్చునే యల్పబుద్ధిఁ జింతించి
పెనిమిటి క్షమియించు ప్రియురాలి తప్పు
లనపరాధిని వీడనగుణి రా సుతను
దైవ యత్నంబున దమయంతి దేవి
వావిరి తమ తల్లి వారి యిల్చేరె
వెలపని యడవిలో విడిచితి ననుచుఁ
దలపక యున్నాఁడు తపసి చందమునఁ
గటకటా మది బాయిగాఁ జేసికొనుచు

నెటనున్నవాఁ డొకో యెఱుఁగంగ నేర
మవనిలో గలిగిన యట్టి దేశంబు
లవనీల గాఁగ మే మరసి వచ్చితిమి
ఖలుఁడనై కాంతను గానలో డించి
తలఁపక యున్నాఁడు ధైర్యంబు పూని
మెలనాగ దిన మొక్క యేఁడుగా దన్ను
దలచి వర్తింపుచు దలఁచుచున్నదియు
నా విదంభ్రుఁ డా యింతి తాపంబుఁ జూచి
మెలనాగ కీ చింత యేటికిఁ గలిగె
నని మది దోపగా నంతటివారు
పెనుమూర్ఛ నొందుచు భీరువు లగుచు
ఘోర దుఃఖమున గుందుచున్నారు
కారణఁ జలనిధి గాంభీర్య కలితుఁ
డే రీతి నున్నాడొ యిట్టి యాపదల
ఘోరన నెచ్చోటఁ బొందుచున్నాఁడొ
యని యని తమలోన నడలుచునుండ
విని ఋతుపర్ణుండు వీక్షించి పలికె
ధారుణీ సురలార తడయక యిట్లు
నూరంగఁ దగదు నిర్దోషుండా నలుఁడు
క్షితిలోనఁ దాను జేసిన పాతకంబు
వెతలఁ బెట్టక పోదు విష్ణువునైన
నూరక మీరేల యూరూరుఁ దిరిగి
యీ రీతి వెదకంగ నేల మీ కనుచు
నరమొప్ప నలుని భాగ్యంబున జేసి
తరళాక్షి తమ తల్లిదండ్రులఁ జేరె
నగి యొక్కటే చాలు నాతని కేమి

విడిచి వైదర్భి పొందేని విహరించి యటకు
జనుపెంపుఁ గాక యే చందమునైన
జనుడు మీ రనిన నా చందమంతయును

## బ్రాహ్మణులకు బాహుకుండు ప్రత్యుత్తర మిచ్చుట

విని బాహుకుఁడు నవ్వి విప్రులతోడ
ఇనివడి తన కింత పనిలేని యట్లు
తను జెందనియ్యక తప్పాక మాట
ననుమాన బుద్ధిలో నప్పు డిట్లనియె
నలుని గుణంబును నలినాయతాక్షి
తెలిసియుఁ దెలియని తెఱగున నిట్లు
జననాథ చంద్రుని సభలకు మిమ్ముఁ
బనిచి దూషించెను బాటియే తనకుఁ
బతివలనను దప్పు ప్రాప్తించియున్న
సతి తన యాత్మలో సైరించెనేని
యిహపర సౌఖ్యంబు లింతికిఁ గలుగు
మహిమీదనని మహా మౌనీంద్రులందు
రిట్టి ధర్మము డించి యింతి యాత్మేశు
రట్టు చేయించి నా రాజులయొద్ద
నని యప్పు డా మాటలాడిన వానిఁ
గనుగొని నవ్వుచుఁ గడువేగ మరలి

## వసుదేవుఁడు నలుని ప్రత్యుత్తరమును దమయంతికిఁ దెల్పుట

రమణ విదర్భా పురంబున కరిగి
దమయంతిఁ గనుగొని తగ నిట్టు లనిరి

వినవమ్మ ధరనెల్ల వెదకుచు మఱి
చనుదెంచి ఋతుపర్ణు సభగాంచి యపుడు
పొరసి యా నలరాజు దూరనచ్చటను
కఱకు నల్లని రూపు ఘనమైనవాఁడు
కడు భయంకరమైన కన్నువాఁడు
తడయక గొప్ప దంతంబుల వాఁడు
సరసత ముదురు మీసంబుల వాఁడు
చిఱుత వస్త్రముచేతఁ బలుపైన వాఁడు
వెడదయౌ శిరమున వెలుఁగొందు వాఁడు
బడలుచు మెత్తని పలుకులవాఁడు
మముజూచి చూచి యామానవేశ్వరుని
క్రమమెఱుంగక ధరాకాంతుల సభల
నీరీతి దూఱంగ నిదియుక్త మగునె
యారాజ వదన ఘోరాటవిలోల
నడలుచుండఁగ నాతఁ డది చూడలేక
విడిచిపోయిన పిరు పెఱ్ఱిసేయుమరె
పతివల ననుదప్పు బ్రాప్తించినపుడు
సతి తన యాత్మలో సైరించెనేని
యిహపర సౌఖ్యంబు లింతికిఁగల్గు
మహిమీఁదనని మహామౌనీంద్రు లందు
రిట్టి ధర్మముడించి యింతి యాత్మేశు
రట్టుసేయించు వా రాజుల యొద్ద
నని పల్కి మఱి మాటలాడక యుండె
వినవచ్చితి మది యెవ్విధమొకో యనిన
నతఁడె నలోర్వీశుడని యింతి యెరిగి
హీనబుద్ధి తన తండ్రి కిట్లని పలికె

## నలుని రప్పించు నుపాయంబును దమయంతి తండ్రికిఁ జెప్పుట

అనఁదె నా ప్రాణేశుఁ డందు కెంతైన
మతిలోన నా కనుమానంబు లేదు
ఏమిషతో నాతని రప్పింప నొక్క
క్రమ మెఱింగించెద గేలి సేయకుడి
విరస రూపంబున విభుడింగురాడు
వినక నలుని భూపక్రమంతయును
వెదకి యెక్కడఁ గాన కాత్మజ కిపుడు
మరల రెండవ స్వయంవరమని నీవు
ధరణిలో నయోధ్యాపురీశునకు
నారూఢిగాఁ జెప్ప నతనితో గూడఁ
జనుదెంచు నాథుఁడే జాడనునైన
ననవుడు వారల యనుమతి వడసి
వరుసతో దమయంత్రి వరులకుఁ జెప్పి
యెదురుగా వారల యనుమతి వడిసి
వసుదేవు రప్పించి వసుధేశుఁ డనియె
వినువ కయోధ్యకు వేంచేసి మీరు
పలుదెఱంగులఁ గాంచి పరికించి చూచి
నలమహీపాలుని నయముగ వెదుక
బత్తెంచి యెక్కడఁ బొడఁగానలేక
తత్తనూభవయైన దమయంతి కిపుడు
మరల రెండవ స్వయంవరమని భీమ
నరపతి చాటించినాఁడని చెప్పి

వసుదెండు కదలఁ డీ క్షణమున ననిన
విని బ్రాహ్మణోత్తముల్ వేవేగఁ బోయి

వసుదేవుడు మున్నగు బ్రాహ్మణులు ఋతుపర్ణునితో
దమయంతికి రెండవ స్వయంవర మని చెప్పుట

పరగంగనా ఋతుపర్ణునిఁ గాంచి
సరగ నిట్లనిరి యో జగదీశ వినుము
నలమహీశ్వరుని నానా దేశములను
దెలియంగ వెదకియే దెస గానలేక
గురువుల యనుమతిఁ గూర్చి నందనకు
వరుస రెండవ స్వయంవరముఁ గావింప
భూపేశ మా భీమ భూపాలకుండు
ధీమంతు లగు సర్వ దేశాధిపతుల
నొరిది పిల్వంగ భూసురు నను బంపె
పొఱసి యీ కార్యంబు మీ కెఱిఁగింప
వచ్చితి మీ స్వయంవరమున కిప్పుఁ
డచ్చుగా వేంచేయుఁ డని చెప్పి వాడ
తరలి వేవేగ విదర్భాపురంబు
పఱతెంచిరంత నా బ్రాహ్మల మాట
విని వేగ ఋతుపర్ణ విభుడు బాహుకునిఁ
గని ప్రీతి జూచి యీ కార్యమంతయును
దెలియంగ వింటివే తెఱగొప్పనిదియు
తెలియంగవలయు నా దెసకేగి మనము
యరదంబునకు మలచి యశ్వరత్నముల
తెఱగొప్ప సవరించి తెమ్ము పొమ్మనిన
సరగ బాహుకుఁ డశ్వశాలకు నరిగి

సరిలేని మేటి యశ్వంబుల దరయ
సరిమురి వార్ష్ణేయుఁ డమ్మోద నుండి
యుపచర యుక్తి బాహుకున కిట్లనియె
నిది యేమి బాహుక యీపుమున్నశ్వ
హృదయము మెఱఁగి నీకేల నేర్పుఁ జుప
ననవుడు బాహుకుం డతని కిట్లనియె
వినవుగా యొక వింత విశ్వంబు దోన
నలరాజుపై భీమ నర నాయకుఁడు
కలవి లేనివి కొన్ని కారులు పలికె
విపిన భూములఁ బుత్త్రి విడువంగఁ దాఁనె
కుపితాత్ముఁ డని తిట్టి కోపించి వాని
నిలలోన వెదుకంగ నేల యటంచు
దలఁచి యాత్మజమైన దమయంతి కిపుడు
వరుస రెండవ స్వయంవరము గావించెఁ
బోరిఁ బోరి రాజులు పోవుచున్నారు
మన రాజు పోవంగ మదిలోనఁ దలఁచి
మన రథంబున తురంగముల నేర్పఱచి
నవరింపు మన్నను నవరింతు ననిన
వివశుఁడై యాఁతడు వెడఁద కన్నీరు
దొఱగ నా బాహుకుతో నిట్టు లనియె
నరలోక సుతుఁడైన నల మహీశ్వరున

వార్ష్ణేయుఁడు శోకించుట

కక్కటా యిట్టి మహాపవారింబు
తక్కక వచ్చె నిద్ధరణిలో నింపు
కేమి సేయగవచ్చు నెవ్వరికైన

నా మహీస్వపతి యెం దరిగెనో కాక
నతని నమ్మినవారి కక్కటా యిట్టి
వెతల నొందఁగఁజేసె విధి మాయమాఁయ
వినుము చెప్పెద నాము వృత్తాంతమెల్ల
నరయఁగ నలుఁడు నన్నేలిన స్వామి
క్షితి తలాధిపులెల్ల సేవింప దనరు
నతనికి సారథినై యున్నవాఁడ
నలుఁడు జూదం బాడినట్టి కాలమున
నతని బిడ్డలను భీమావనీశ్వరుని
కడ నిల్పి భూపతిఁ గానంగలేక
కడుదుఃఖపడుచు నిక్కడ నున్నవాఁడ
ననవుడు నా మాట కాత్మలో వగచి
వెనుకొని కలి యిట్లు వేధింప నతఁడు
మనముఁ జేసెడి దేమి మాట లేమిటికి
ననుచు వార్ష్ణేయుని నప్పుడూ రార్చి
యనిల వేగము గలిగినట్టి గుఱ్ఱములు
గొనివచ్చి యాదిత్య కోటి తేజంబు
గల యరదంబున గ్రక్కునఁగట్టి
పొలుపుమీఱిన టెక్కెములు సవరించి
సకలాయుధంబున సరసత నిలిపి
యకలంక మహిమ నట్లాయత్త పఱచి
ధరణీశునకుఁ దెల్ప తద్దయుమెచ్చి
యరుదెంచి యప్పు డా యందంబుఁ జూచి
చతురంగ బలముల సంఖ్యలు గొలువ
నతివేడ్క రథమెక్కె యా బాహుకుండు

నరదంబు నడిపింప నడుగుచు నడుచు
నరద మెక్కంతయు నటుపోక నిలిచె
నది చూచి బాహుకు డదలింప నృపతి
ఇది యేమి బాహుక యీ వశ్వ హృదయ
మదరంగ నెఱుఁగుదు నని చెప్పి యట్టి
బదుగు గుఱ్ఱముల నేర్పఱచి కట్టితివి
నడుమనె శతయోజనం బులదవ్వు
పడమి భీమునిపురి కీ పురంబునకు
నడపుండు భూనాథ యశ్వరత్నంబు
లనిల వేగంబున నరి గోడిఁ జూడు
డినుఁ డస్తశిఖరికి నేగకమున్నె
మనము విదర్భకు మరి పోద మనుచు
చెలుమ నా రథము భూతల మెల్ల నడఁక
నరిగె ఘోరాటవి నధిక దూరంబు
నీ భంగి నా రథం బేగెడి చోట
నా భూమిపాలకుఁ డాల్యోత్తరీయ
మిలమీరఁ బడుటయు నిట్లనె విభుఁడు
నిలుపుమా హూకతేరు నిమిషమాత్రంబు
అవనిపై నుత్తరీయము జాఱిపడియె
తివిరి నీ వదియెత్తి తెచ్చి యిమ్మనిన
నవ్వి బాహుకుఁడు భూనాథునిఁ జూచి
యెవ్విధి చేలమే నెత్తెత్తి యిత్తు
నుడువేగమున నొక యోజన దూర
మరిగితి ముత్తరీయము చిక్కకెట్టు
లని పల్కుచును రథ మనిల వేగమున

దను వానె మెచ్చుచుఁ దఱుముచు నుండె
నరసి భూపతి వాని నాత్మలో మెచ్చి
యరది వాహక యిది యనుచు నిట్లనియె

ఋతుపర్ణ వాహకుల నొకరి విద్య నొకరు గొనుట

విశ్వంబు లోపల వెలగొందు నట్టి
యశ్వ లక్షణముల కధిపతి నీవు
నిక్కము నీ మాట నీవంటివాని
నెక్కడ గని విని యెఱుఁగ మెన్నడును
గరమర్థితోఁ దురంగంబుల విధము
నెఱిఁగి యీ మర్మంబు నెఱుఁగ నేనయితి
నరుదైన నీయశ్వ లక్షణము
నెఱిగింపు నీ కొక టెఱిగింతుఁ జూడు
మల్లదె ముందఱ నతి రమ్యమైన
పల్లవంబుల చేతఁ బ్రబలిన యొక్క
తాండ్రద్రుమ మున్నది దానిలో రెండు
కూడియున్నవి పెద్ద కొమ్మలం దొక్క
కొమ్మకు నూఱేసి కొమ్మలు గలవు
కొమ్మ కొమ్మకుఁ బువ్వుగుత్తులు రెండు
వెల్గుచున్నవి దాని ప్రేళ్ళైదు నూఱు
లలరుచున్నది దాని యమల పత్రములు
వేలుపులై సొగసులై వెలుగుచున్నవియు
ఫలములు కొమ్మకు బదివేలు గల్గు
నది గూచి రమ్మ నే నవనీరుహముల
హృదయం బెఱుంగుదు నీ విద్య నీకు
వినిపింతు నాకు నీవిద్య యొసంగు

మనమునఁ బెఱగంది యా బాహుకుండు
నరదంబు డిగ్గి పయ్యన దాడిమ్రాను
నరయుట కొరకునై యచటికిఁ జనియె
నరసంబు లుతుపర్ణు దలఁ దోలి కొనుచు
నరుగుచు నుండ నయ్యవనీ నాథుఁ
డాటాడి చెంగట నతివేగ మరిగి
భూతలాధీశుఁ డప్పుడు చెప్పినట్లు
సుండంగ నంతయు నొనరంగఁ జూచి
నిండు వేడుకతోడ నిలచి యున్నంత
ధరణీతలేశుని తల నాఁగు పాము
గరచిన విషమెల్లఁ గలయంగఁ బర్వి
కడఁగి యంతంతకుఁ గమలింప నలుని
మొడలు లోపలనుండ నోర్వంగ లేక
బొనకు బొక్కున రక్తమును గ్రక్కి కొనుచు
నలరాజు ముందఱ నయముగా నిలిచి

కలి పురుషుఁడు నలునితోఁ దన తప్పులు జెప్పి ప్రసన్నుఁ డగుట

కరములు ముకుళించి కలి యిట్టులనియె
నరనాథ చంద్రయో నలమానవేంద్ర
యలనాఁడు నన్నుఁ గాదని దమయంతి
వలనొప్ప వరియింప వచ్చునా యనుచు
నెఱుఁగక నినుఁబట్టి యింత కాలంబు
కరకరిఁ జేసితి గర్వంబుతోడ
నీ సత్య సంపద నెమ్మితో నాకు
వాసవుఁ డప్పుడే వర్ణించి చెప్పె

నవనీతలేశ నే నడియుము వినక
కువలయాక్షిని నిన్ను ఘోరాటవులను
నెడఁబాపి పడరాని యిడుమలఁ బఱపి
కడు తప్పు జేసితి కరుణింపు నన్ను
తరుణి పతివ్రతా ధర్మ మింతైన
నెఱుఁగక మిముఁబట్టి యింత జేసితిని
ధరణీతలేశ యీ తప్పులు మఱచి
కరుణింపవే నన్నుఁ గమలాప్త కులజ
నరనాథ నీ సత్య సంపద కెపుడు
వెఱచి నిన్ను భయంబు వేఁడుచున్నాఁడ
నల నీవు ఋతుపర్ణ నరనాథు చెంతఁ
గలసియు కాలంబు గడుపుచు నుండ
యెఱిగి యా దమయంతి యీవు వచ్చుటకు
వరుస రెండవ స్వయంవరమని తెలిపె
నదియుఁ దప్పనుచు నీయాత్మలో నిటకు
మదిరాక్షి గైకొన మహిత సంపదలు
వరుసలో నెప్పటివలె వచ్చు నిన్నుఁ
గఱచిన పాముచేఁ గైకొన్న కోక
ధరియించి నప్పుడే తనరు నీరూపు
వరమిత్తు నడుగుము వసుధేశ యనినఁ
బరమిడేఁ డప్పుడు భువి సాగి మ్రొక్కి
కడుభక్తి మీఱ నా కలి కిట్టులనియె
కలిదేవ సకల లోకముల నీవంటి
బలవంతమైన దైవము లేదు తెలియ
నది గాన లోకత్రయమున నాపేరు
విదితంబు గావించి విఖ్యాతి నెంచి

చిరకీర్తి నొందఁగఁ జేసితి వరసి
కరుణతో నీ యుపకారంబునకును
గడఁగి యే ప్రత్యుపకారంబు సేతు
వడయక యిది యేను దలఁపు లోపలను
మఱవంక వలంతు సమ్మదమున నొక్క
వరమిమ్ము యది నీకు వరుసఁ జెప్పెదను
వినుము ధారుణి నలోక్షీపుడఁ టంచు
ననుఁ బలఁతురో యట్టి నరుల జేరకుము
వరసతి నెపుడు నాచరిత మెచ్చారు
వరుసఁ జెప్పుదు రట్టివారిఁ జేరకుము
వరభక్తిచే వినువారిఁ జేరకుము
పరమప్రీతిని వ్రాయువానిఁ జేరకుము
మసల కెప్పుడు తాంద్రద్రమానున నీవు
వసియించుచుండి కీ వరము దక్కఁగను
వరుసతో నింకొక్క వరమెల్ల నిపుడు
కరుణాత్మ నీపాద కమలంబు లాన
యనపుడు భూనాథ యాలాగె సేతు
నని తాంద్రద్రమానున నా కలి నిలిచె
మనుజేశయా తాంద్రద్రమానున నెప్పు
పౌనరంగ నా కలి యుండుటఁజేసి
ధరణీసురల్లని తలఁగి పోవుదురు
నరనాథుఁడైన యా నలుని మేనెల్లఁ
బులకసై యుంటపుఁ జోద్యంబు చెంది
కలికి మ్రొక్కియును దాఁగ్రన్నసవచ్చి
యా ఋతుపర్ణుని యరదంబు నెక్కి
యారసి వచ్చిన యా తాంద్రద్రమాను

పందంబుఁ జెప్పి యా జననాథుచేత
నందంద తరుహృదయంబు నెఱింగి
యరుదారఁ దన యశ్వహృదయంబు నతని
కెఱిఁగించి రథము నాయకముగా నడిపి
పరువడి నా విదర్భాపురము చెంత
కరుగంగ నంతంత నా రథ ధ్వనిని

దమయంతి రథధ్వనం విని నలుఁడిదిగాఁ దలంచుట

దమయంతి వినుచు మోదంబును జెంది
క్రమమున మాణిక్య ఖచితమై కనరు
ఘనమైన సౌధంబు గ్రక్కున నెక్కి
యనుపమ గతివచ్చు నరదంబుఁ జూచి
యిట్టి వేగంబున నీ తేరు నడప
నట్టిగా నలమహీకాంతుండు గాక
యితరుల చేతఁగా నేర్పు లనుచు
మతిలోనఁ దలచి ప్రేమంబున మున్ను
మును లానతిచ్చిన మూఁడు వత్సరము
లనుపమ గతి నేటివి కవి పూర్ణమయ్యె
నని తండ్రి తడఁకుఁ జయ్యన నేగుదెంచి
పని బూని యా ఋతుపర్ణుని తేరుఁ
గతపఁగా సూతుఁడై గాడ్పు వేగమున
వడిగ నీ యల్లుఁడు వచ్చుచున్నాఁడు
బోరన నెదురుగాఁ బోయి నీ విపుడు
వారక తోడ్కొనివచ్చి వారలకు
విడిదిఁ జూపు మటన్న విని భీమ నృపతి
తడయక యపు డమాత్య గణంబుతోడ

నెమరేగి వారల నెలమిఁ బోద్కొనుచు
ఓనికమై యొప్పిన విడిదిఁ జూపుటయు
ఋతుపర్ణుఁ డప్పుడా హర్షమోదమున
వివిధ సంపద లొప్పు విడిది నిడిగిరి
మీము దంతటవచ్చి ప్రియమౌ తనూజ
తా మాట రెజీఁగించ సతిని మోదించి

## నలుని పరీక్షించుటకై దమయంతి చెలులను నలునియొద్ద కంపుట

తన చెలికత్తెలఁ దప్పక జూచి
ఓని మీరు ఋతుపర్ణ సారథి గాంచి
సరినాక్షులార నా నాయకుం డతఁడు
నలుఁడు దుర్వేషంబు నయము దాల్చి
బసదెంచె నిటకు నెప్పుట నున్నవాఁడొ
పనిఁ బూని యతనిఁ దప్పక మీరు వెద
కని మాటలాడి వేగమె రండటంచు
ననిచిన జలజాక్షు లా ఋతుపర్ణు
వడిచెకి నరిగి యా వెడ రూపధరునిఁ
బొనఁగాన లేక యప్పుడె యింటి వారి
గనుఁగొని యా ధరాకాంతుని యరద
మనురక్తి నడిపెడి యతని రూపంబుఁ
జూడ వచ్చితిమి యా శూరుఁ డెచ్చోట
వేడుకగ నున్నాఁడొ వినిపింపు డనిన
వాఁడదె వంటలు వండుచున్నాడు
చూడ బొండనిన యా సుదతులు వోయి

## దమయంతి పంపిన చెలికత్తెయు నలునితో మాటలాడుట

వెతరూపదపుఁ గాంచి వికవిక నవ్వి
ఏవయక వార లాకని కెట్టు లనిరి
ఈ యెద కేతెంచి యెన్ని వత్సరము
లాయె నీ నామమే మందురు మున్ను
నలుఁడవు గావె యీ నరనాథునొద్ద
నలమహీనాథుఁ డున్నాఁడంచు జెప్ప
విని భీమ భూపాల విభుడు పుత్రికకుఁ
మనుపొంద రెండవ పెండ్లి గావించు
ననుచు నూరక యయోధ్యా పురీశునకు
వినిపించె నలమహావిభుడు వచ్చుటకు
నింతియ కాని యే నృపునకునైన
నింతయు నింతయు వినిపింప డీ స్వయంవరము
నిట్టి వేషము దాల్చి యీ రాజుమోఁ
నెట్టనఁ గొలువగా నీ కేల యిప్పు
డిటువంటి రూపు నీ కేలాగు గలిగెఁ
చటుకున దమయంతి తగ నిన్నుఁ జూచి
లోడుకి రమ్మని తోతెంచె మమ్ము
వేడుక నిప్పుడు వెంచేయవయ్య
విపినంబులో నీవు వీడిన మొదలు
విపుల దుఃఖముల వేగుచున్నదియుఁ
చెలువుల్లదక్క నీ శిశువె లిద్దఱను
గలఁగుచున్నారు శోకంబున నిపుడు
దమయంతి పడు ఘోర తాపమంతయును

ప్రేమముతో జెప్పెద గరుణతో విను
కుములక కష్టక ఘోరదుఃఖములఁ
ఇపుడు నే వేడ నీ పాదపద్మములఁ
దలఁచి దనలోనఁ దల్లడిల్లుచును
నెలమి నీ రాకకు నెదురు చూచుచును
మన్నది మీ మామ యొక్క నాఁడైన
నన్నుయు పచి మీఱ నారగింపండు
కొలువున నుండక గుందుచున్నాఁడు
తలఁపు లోపల నీవు దమయంతి నింత
దలఁచక ఓర్వల దలఁపక యిట్టి
బలుపైన విరసభావమున నున్నావు
రయమున మది నీవు హాయిఁ జేసికొని
దయలేక యిట్లుండ దగునయ్య నీకు
నవతికి రెండవ పరిణయం బనుచు
నవర భీముఁడు చెప్పెనని తలంపకుమి
నీవు రావలె నంచు నెమ్మి నీ రాజు
యీ విధిఁ జెప్పించె నింతియ కాని
కుండినేశ నీ మీఁద కోపంబు గాదు
హితమొంద మా వెంట నిపుడు రమ్మనిన
వివిధ రాకాంతుండు వెలదుల నపుడు
కని నవ్వి తెలియని గతి నిట్లు పలికెఁ

నలుఁడు పలికె స్త్రీయలారో నలుఁడను నేనుగా ననుట
పోహించు మదియేటి బుద్ధులు మీకు
ప్రాపించె నను జూచి భ్రమ నొందినారో

నలుఁడు నలుఁ డని నయముగా నప్పుఁ
డలికెద రిట్టి రూపంబున నలుఁడు
ఉండునె యిల్లాల నుచితంబు గాదు
పొండిఁక నిందుండఁ బోలదు మీకు
నలుఁ డేడ నేనేడ నాతి వన్నెలి
పిలువ నంపెను నాడు పేరు బాహుకుఁడు
నామెత్త వెలతునే వంటలవాఁడ
నై యుందు ఋతుపర్ణు నడుగుఁడు మీరు
నలుఁడు లేడంచు నలినాక్షి దొరలు
నెలమితో బిలిపించెనని నేఁటి నలుఁడు
వానిఁ దలంపఁగా వలదింక నిపుడు
వానలే కతఁ డేల నగరికి వచ్చు
విపినంబు లోపల విడిచిన విభుని
నిపు డేల తలఁచె మీ యిందీవరాక్షి
యీ రాజవర్తనం బెల్ల మీ యింతి
యారసి రమ్మన్న నటుఁబోక మీరు
వల నొప్ప నిటకేల వచ్చితి రిపుడు
బలవంతుఁడగు ఋతుపర్ణు వరించి
సంతోషమునను మీ చందనగంధి
యెంతయు మది సుఖియించును గాక
నికేతి నగడు సేయింపఁగఁ దగునె
యో రాజముఖులార యూరక నేల
బలికితి రిది తప్పు బట్టుకు డింక
నలుఁడు నేగాను మీ నాతి దగ్గఱకు
నరుగుఁడు మీరన్న నతని కిట్లనిరి
మరుగుగా నిటువంటి మాటలు పల్క—

దలఁచరా యిటువంటి తప్పులు పలుప
సొలవర ఒడ్డలఁ జూడఁగవలదె
నలుఁడు గావునను మానక మీర లిట్లు
పలుకంగఁ దగునయ్య పార్థివనాథ
ఋతుపర్ణు కత మారు రూపంబులోన
నతిమేటియై సారథియై నీవు కొల్చి
యున్నావ టంచు మీ యువిదతో
మునులు పన్నుగా మిన్నె యేర్పడ జెప్పిరనుచ
గొబ్బున దన తండ్రితోఁ జెప్పె నతఁడు
పంపున మీర లిప్పటికి వచ్చుటకు
దమయంతి వల దన్నదా నది వినక
ప్రముదిత మతిని నెప్పమ్ము గల్పించి
యా ఋతుపర్ణుని నిటకు రప్పించె
ధారుణీశ్వరునకు దప్పయ్యెఁ నిదియు
నిరవొంద దమయంతి హృదయంబు నీవు
నెఱిగియు నిటువంటి యెడమాడలాద
వలదని చెప్పి యవ్వనిత లందఱును
గలకంఠి దమయంతి కడకేగుదెంచి
యతఁడు చెప్పిన యట్టి యా చందమెల్ల
నతి వేడ్కతో జెప్ప నా దమయంతి
యతఁడె నలుండని యాత్మలో నెఱిఁగి
మదిలోన సంతోష మగ్నయై యప్పు

దమయంతి బాహుకుం డొనర్చిన వంటకమును దెండని
చెలికత్తియల బంపుట

డతివలఁ జూచి మీ రచ్చటికేగి

యతఁడు వండిన యట్టి యన్నంబు కూర
నొక యింత గైకొని యొయ్యనరంటు
అకలంక మతిలోడ నని చెప్పి పంపె
వారలు చనుదెంచి వంటలవానిఁ
జోరనఁ జూచి యో పుణ్యాత్మ యిపుడు
వారక మఱి నీవు వండిన యట్టి
కూరగా నొక యింతఁ గొని రమ్మటంచు
దమయంతి మమ్ముఁ బంపె దయచేయు మింక
విమలాత్మ నీమతి వేసరఁగాక
వడరంగ నలుఁడకా నన్ను నిన్ను
విడువ మే వేళ నే వెఱపున నయిన
గట్టిగా నినుఁ బట్టి కడఁగి మా యింటి
కట్టె కొంపోయెద మిది కల్ల గాదు
పడఁతు లీ గతి నన్నుఁ బల్కిరటంచుఁ
బుడమి నాయక చిత్తమున నుంపవలదు
పరఁగ నీవును మాకు బావవుగాన
సరస మాడితిమి ముచ్చట దీరననినఁ
జిఱునవ్వు నవ్వి మచ్చిబైఁడిగిన్నెఁ
బరమాన్నములు మంచి పనసలకూర
బెట్టి వారలనెల్ల బెదరించి తఱుమ
నెట్టనఁ జనుదెంచి నీరజాననలు
మరమాన్న శాకముల్ భైమి కొసంగ
నిరువుర బిడ్డల నింత యొసంగి
పొరిఁబొరి నానింత భుజియించి మెచ్చి
తరుణుల కొకయింతఁ దగ బంచి పెట్టి
పరగ నీగతి రుచిపాకంబు సేయ

పుణులకైనను పరముగా దిట్టు
డెక్కడ నేర్చెనో యిటువంటి వంట
లెక్కజంబుగ వండె నవనీతలేశుఁ
డెక్కటా యిట్లు సేయంగ నా కలికిఁ
దక్కక మేమేమి తప్పు జేసితిమొ

బిడ్డలను దమయంతి బాహుకుని చెంతకు పంపుట

యని పల్కి యింతుల నపుడు వీక్షించి
చనుపొంద నిఁక మీరు బిడ్డల నతని
కడకుఁ దోడుక పొండు గ్రక్కున ననిన
వనితలా సతి తనూభవ మదనూజు
నింపుర నాతని చెంతకుఁ గొంపోవ
నపవడి బిడ్డల భావించి చూచి
జననాథు డాత్మలోఁ జాల చింతించి
యెలమి నా బిడ్డల నెత్తి లాలించి
యక్కునఁ గదియించి యౌఁదల నిమిరి
చెక్కిలి నొక్కి మచ్చిక ముద్దుపెట్టి
తొడలపై నిడుకొని దుఃఖించుచుండఁ
బడఁతు లిట్లనిరి యో పావనచరిత
యేమిటి కేడ్చెద వింతలో నీవు
వేమారు నలమహా విభుఁడను నేను
గావంచు బిడ్డలఁ గనుఁగొని యిప్పు
డాదరంబున నెత్తి యుండంద మదిని
శోకించు చున్నావు చూచుచుండగనె
ప్రాకటముగ మిమ్ము బ్రార్థించి దెలియ
నడిగిన నలుడ నేనని చెప్పరాదె

తడయక యింతలో దాచిన నిన్ను
నలుఁడని యెఱుగమే నరనాథచంద్ర
ఒలువైన విరస రూపము దాల్చియున్న
ననవుకు వారితో నాత డిట్లనియె
వనజాక్షులార యీ వడువున నాకు

నలుఁడు సమయోచితముగాఁ జెలులతో మాట్లాడి
వారి నంపుట

బెనుపొంద నిద్దఱు బిడ్డలు గలరు
మునుకొని యిటవచ్చి మూడు వత్సరము
లాయె నా బిడ్డల నతివనుఁ జూడఁ
బోయి వచ్చెదనన్నఁ బోఁగూడ దిప్పు
డనుచుఁ బ్రభుండు నా కానతిచ్చుటయు
మనమున గుందుచే మన కుంటి నిప్పు
డెనయ నీ బిడ్డల నిద్దఱఁ దెలియఁ
గనుగొన్న యంత దుఃఖము వచ్చె నాకు
నీ ముద్దు బిడ్డల నెత్తుక మీరు
తామసింపక పొందు తల్లి దగ్గఱకు
ననిన బిడ్డల గొంచు నా యిందుముఖులు
చని చని దమయంతి సరసను నిలిపి
యతఁడు బిడ్డలఁ జూచి యాత్మలో నప్పు
డతి దుఃఖమొందిన యలమట దెలుప
విని తండ్రి నచటికి వేగ రప్పించి
యెనయంగ దమయంతి యిట్లని పలికె

దమయంతి బాహుకుని బిలిపింపుమని తండ్రితోఁ జెప్పుట

నా విభు చందమంతయుఁ దలోదరులు

ఘావించి యిప్పుడు పరతెంచినారు
ప్రియమొప్ప నాతని బిలిపింపు డనిన
రయమున నా భీమరాజేంద్రుఁ డొక్క
ధరణీశురుని బిలిచి తగ గారవించి
పరువడి నా ఋతుపర్ణుని కడకుఁ
జని నీవు నీ రథసారథిఁ జూడ
ననురక్తి పుట్టి భీమావనీశ్వరుఁడు
వెలయ నీ కెఱిగించి వెడరూపధరుని
నలరంగఁ దోడి తెమ్మనిన నని పలికి
యతని యనుజ్ఞ నాతనిని నిచ్చటికి
నతివేగఁ దోడి తెమ్మనిన నా విప్రు
డరిగి యా నరపతి కవ్విధంబెల్ల
వెరవొప్ప దెలిపిన విని ఋతుపర్ణు
డిది యేమి చిత్రమో యెఱుగంగరాదు
పరువడి రెండవ పరిణయం బనుచు
పిలిపించె నన్ను నీ భీమపాలుఁ
డెలమి భూపతు లెవ్వ రిందు రారైరి
యని పల్కి బాహుకు నపుడు రప్పించి
పెనుపొంద భీముండు పిలిపించె నిన్ను
సరగునఁబోయి యచ్చటి కార్యమెల్ల
నెఱిఁగి రమ్మన భూసురేసుని వెంట
జనియె భీముని జూడ సత్రపు డగుచు
పని బూని నిషధ భూపాలశేఖరుఁడు
సరగున నా భీమజనాయకుండు
పఱతెంచి యట నొక్క బంగారు పీట

పెట్టించి యాతని బిగి గౌగలించి
పట్టి కూర్చుండుము పార్థివ యనిన
విని నవ్వియంత భూవిభు జూచి నలుఁడు
ఘనమైన దొరవు లోకమున నీ విప్డు
డొక రాజు గొల్చిన యాడిగఁబేను
అకలంకమైన సింహాసనం బెక్క
వసుధేశ నీ యంత వానికిఁ గాక
పొసఁగునే నావంటి పుణ్యహీనునకు
నింపుతో మీరు నన్నిప్పుడు పిల్వ
పిల్వ నంపిన పనియెల్ల నానతీ వలయు
నని పల్కుచుండగా నా దమయంతి
చనుదెంచి యాతని చందంబు చూచి

దమయంతితో నలుండు నిష్ఠుర వాక్యము లాడుట

మరు దిందికుంది హాయని యేడ్చుచుండ
ధరణీతలేశుఁడా దమయంతి జూచి
యిందీవరాక్షి నీ వేల యేడ్చెదవు
పొందుగా నీ భీమభూపతి నీకు
ధావింప రెండవ పరిణయం బిపుడు
గావించు నంతలోఁ గళగళ పడుచుఁ
గలగంగ నేలభూకాంత లందఱును
వలనొప్ప నిచటికి వచ్చుచున్నారు
జలజాక్షి నీ మది సరిపోవు నతని
నలరంగ బెండిలి యాడుదుగాక
నాఁ డరణ్యంబున ననుఁడు నిన్నొంటి
వీడెను నీకు నా విభుని పొందేల

## భీమరాజ ప్రార్థన

యని నిషధరాక్తులనాడి నసంత
విని భీముఁ డాతని వీక్షించి పలికె
భూమీశ నేనంత బుద్ధిహీనుండనె
మీ మాట నడిచి నిన్నిటకు రప్పింప
వలసి నేనిట్టి మర్యాద లిక్కాతని
నలమహీనాయక నను దయఁజూడు
మని వేడుచుండగా నవనీశు డనియె
నను నలుడని పల్కె న్యాయమా నీకు
నెఱుఁగవె నలుని నీ విప్పుడు భ్రమసి
మఱి పల్కుచున్నావు మానవాధీశ
హోహొమ్ము పెద్దవై బుద్ధులు లేవె
నీ పుత్రికైన యా నీలాభ్రవేణి
నను బెండ్లి యాడె నేనలిరేగి మున్ను
యెనయ నీవే గతి నిచ్చితి విట్లు
బలువైన వికృతరూపము గలవాని
కలరంగ నాకును నా దమయంతి
నని పల్కె దమయంతి నప్పుడు చూచి
వనజాక్షి నను నీవు వరియించి నావె
తన పతి నెఱుఁగని తఱుణియుఁ గలదె
నను నలుఁడని పల్కె నగరె లోకములఁ
గనకాంగి నలుఁడ గాఁడని వల్క
విని దమయంతి యా విభుఁ జేరవచ్చి
నలుని పాదములపై బడి దమయంతి యేడ్చుట
యతఁడు గట్టిన యట్టి కోకఁ జూచి

మతి నతఁడే తన మగఁడని యెఱిఁగి
పనవుచు దన మహీపాలుని పాద
వనరుహంబుల మీఁద వ్రాలి యేడ్చుచును
రూపకందర్ప యీ రూపంబు నీకుఁ
ప్రాపించెనా నోము ఫలమ దెట్టిదియొ
నీ రూప విభవంబు నీ విలాసంబు
నీ రాజతేజంబు నీ ప్రతాపంబు
నీ రాజ్యభోగంబు నీ మహాత్మ్యంబు
నీ రసికత్వంబు నీరాజసంబు
నెక్కడఁ బోయెనో యెక్కడ నణఁగె
నెక్కడ దాచితి నినకులాధీశ
యని యని శోకింప నమ్మహీవిభుఁడు
తన దేవి శోక మంతయుఁ జూడ లేక
యెలుఁగెత్తి హా యని యేడ్చె నేడ్చుటయు
దలకొని దమయంతి తల్లియు దండ్రి
దమనుండు దాము నందఱు నొక్క రీతి
భ్రమసిన గతివిలాపము నొంద నలుడు

## నలుఁడు దమయంతి చిత్తశుద్ధి నెఱుగుట

తన శోకమడఁచి యా దమయంతి జూచి
విను కలి మాయ నే విధ మయ్యో నిన్ను
విపిన భూములలోను విడిచిపోయినను
విపులాధిపతులకు వినరాని మాట
పలుక వచ్చునె యెంత పని వచ్చియున్న
నిలలోన యీ మాట హీనంబు గాదె
నావుడు భూనాథ నా చిత్తశుద్ధి

నీ వెఱుంగవె నేను నిన్నుఁగా దనుచుఁ
బలికితినేని నా పంతంబు వినుము
ఎలమి భూనభములు నింద్రాదిసురలు
ననఘాత్ములగు మునుల్ హరిహర బ్రహ్మ
లిన చంద్రు లెఱుగంగ నీవు మెచ్చన్గ
ననలంబుఁ జొచ్చెద ననుచు నలుండు
విని యట్లు గావింపు వెలఁది యటన్న

### దమయంతి యగ్నిని ప్రవేశించుట

దమయంతి నా దల్లిదండ్రుల జూచి
క్రమమున ననలంబు గావింపుఁ డనిన
విని భీమభూపతి వేవేగ మంత్రి
జనుల కాజ్ఞాపింపఁ జయ్యన వారు
కనుఁగొను వార లక్కజ మొంది వగవ
ననల గుండమును నెయ్యమున గావింప
భగభగ మండెడు పావకశిఖలు
జగమెల్ల వెలుగ నాశ్చర్యమై యుండె
నప్పు డా దమయంతి యాత్మేశు కడకుఁ
దప్పక వచ్చి యా దహనునిఁ గాంచి
తన పతిపాద పద్మములకు మ్రొక్కి
ఘనభక్తి మీఱంగఁ గరములు మొగిచి
చేరి యగ్నికిఁ బ్రదక్షిణముగా వచ్చి
నారుల కిది ప్రమాణం బని పలికె
యో పావక మహాత్మ యో దయాంభోధి
శ్రీపతి సాక్షిగా జీవితేశునకు

చెప్పిన వాక్కునను జిత్తమునఁ గర్మమున
నొప్పని పనుల నే నూహించి తేనిఁ
బ్రాకటంబుగ నన్నుఁ బట్టి దహింపు
లేకున్న నన్నుఁ బాలింపవే యంచుఁ
జెలువైన కలహంస చెంగల్వకొలను
నలనొప్పఁ జొచ్చిన వడువునఁ జిచ్చు
జొచ్చిన దివి నున్న సుర లది చూచి
యచ్చుగాఁదా మప్పు డలరుల వాన

దమయంతిని మెచ్చి దేవతలు ప్రసన్ను లగుట

లందంద గురియింప నప్పుడయ్యగ్ని
చందమంతయు మాని చల్లనై యుండె
నే వేళ మోదించి యా రమావిభుఁడు
వేవేగఁ బులుగుల విభునిపై నెక్కి
కరముల శంఖచక్రములను దాల్చి
యురమున నిందిర నుంచి బంగారు
వన్నె దుప్పటిమీద వైచియు నుదటఁ
దిన్నఁగాఁ గస్తూరి తిలకంబు దీర్చి
మకర కుండలములు మహిమతో దాల్చి
యకలంక మణిమయంబగు కిరీటంబు
నవరించి వన్నె భూషణములు పెట్టి
యవిరళ దివ్యమాల్యములు ధరించి
యింద్రాది దేవతలెల్ల మోదమున
సాంద్రసైన్యములఁ బార్శ్వముల నేతేర

వనజాసనుండు కైవారంబు సేయ
ఇనచంద్రు లక్షితై యిరుపార్శ్వములను
రయగతి నడరి బరాపరు ల్సేయ
నయముగాఁ దుంబురు నారదాదులును
బంతగించుచు మేటిపాటలఁ బాడ
వింతగాఁ బదివేల వెలఁదుల గొల్వ
సనకస నందను ల్సన్నుతి సేయ
ననురక్తితో ధవళాత పత్రములు
పనిఁబూని వెంట దిక్పతులు గ్రహించి
చనుదేరఁ గింకర జనులు సేవింపఁ
గారుణ్య మలర నీ గతి వచ్చి నిషధ
ధారుణీపతికిఁ బ్రత్యక్షమై నిలిచె

నలుఁడు ప్రసన్నుండగు విష్ణువుని స్తుతించుట

నిలిచి గనుగొని నెమ్మది నలుఁడు
చెలఁగి చేతులు మోడ్చి శ్రీహరి కనియె
జయ పుండరీకాక్ష జయ రమావక్ష
జయ దైత్యకులశిక్ష జయ భక్తరక్ష
జయ కరుణాపాంగ జయ మౌనిసంఘ
జయ సురవినుతాంగ జయ పాపభంగ
జయ సకలాధార జయ కీర్తిహార
జయ నిత్యశృంగార జయ హోదార
మునులందు సురలందు ముక్కంటి యందు
జనులందు నీరేడు జగముల యందు
నగముల యందు సాగరముల యందు

నిగమంబు లందుఁ బానీయము లందుఁ
కమలజు నందు సాగరముల యందుఁ
కమలమిత్రుని యందు కమలారి యందు
సర్వశాస్త్రము లందు సర్వంబు నందు
సర్వమయుండవై సంచరింపుదువు
కావున నీ పాదపద్మముల్ నాకు
సేవింపఁగా దయఁ జేసితి విపుడు
కరుణాత్మ నాదు భాగ్యంబున నీవు
చిరలీల నన్ను రక్షింపఁ దలఁచి
వేడుక లలరంగ వేంచేసినారు
నేఁడిదె నే మహాపుణ్యుండ నైతిఁ
కమలాక్షి నా భాగ్యగరిమ మెట్టిదియొ
విమలతపంబెల్ల వెలయ ఫలించె
నని సన్నుతులు సేయ నా విష్ణుమూర్తి
విని సంతసించి యా విభున కిట్లనియె

## విష్ణుదేవుఁడు నలునకుఁ గర్తవ్యమును తెల్పుట

నలరాజ నీదు మానసముఁ గానకయు
కలియంటి మిమ్మింత కష్టమొందించెఁ
కరకరిఁ జేసెను గర్వంబుచేత
నరనాథ ఘోరకానన భూమిలోనఁ
బడఁతియు నీవును బడలితి రకట
యడవుల నైన గేహంబుల నైన
నెపుఁ జరించెడివేళ నీమీఁద భక్తి
మఱువదు దమయంతి మహిమచే నొప్పు
నట్టి సుగుణవతి నట్టి సుశీల

నట్టి పుణ్యాంగన నక్కటా నీవు
ఈ చిప్పు గోరుమని పెట్టి చూపితివి
యీ చంద్రముఖి మన మెఱుఁగని యట్లు
భూనాథమును నీకు భుజంగ వల్లభుఁడు
మానుగ నిచ్చిన మహితాంబరంబు
ధరియించి నీరూపుఁ దరుణికిఁ జూపు
కెరలి నీ పగతుని గెల్చి రాజ్యంబు
సంపదఁ గయికొని జనులఁ బాలింపు
మిక పాట నడుగు నీ కేవరంబైన
నిచ్చెద నన నలుఁ డిచ్చను పొంగి
యచ్చుగా నెన్నుచు ననియె శ్రీపతికిఁ
బరమాత్మ నీ పాదపద్మంబు లేను
గురుభక్తితోడ సేవించుచుండెదను
సఖుము లింతే చాలు సుదతితోఁగూడ
నఖిలేశ నిను గొల్చి యలరుచు నెంట
నేతెంతు నీ వరం బిచ్చి రక్షింపు
మోతండ్రి యుండుండ నోప మీయాన
ననపుడు మోదించి యా విష్ణుదేవుఁ
డినకులాధిపునకు నిట్లని పలికె

విష్ణువు నలునకు వరమిచ్చి నిజరూపమును దాల్చు మనుట

జననాథ చంద్రమా జనపాళి నెల్ల
ఘనతతో నిటఁ గొంత కాలంబు నేలు
మటమీఁద నీవు స్వర్గాది భోగములు
తటుకున బొందెదు తరుణితోఁ గూడి
లక్షణాకార నీ లావణ్య మిపుడు

వీక్షింపవలె నన్ను విని నలుం డపుడు
భుజగేంద్రుఁ డిచ్చిన పుట్టముఁ గట్టి
నిజరూపు ధరియించె నెమ్మినంతటను
దివినుండి ఘోషించె దేవదుందుభులు
భువిమీదఁ గురిసెను బువ్వులవాన
క్షీరసాగర పుత్త్రి శృంగార గాత్రి
సారంగనిభవేణి సైకత శ్రోణి
సకల జగనాత్మత సద్గుణోపేత
శుకవాహనుని తల్లి శుభకల్పవల్లి
యగు నిందిరాదేవి మా దమయంతి
నగు మోముతోడ మన్ననఁ గౌగిలించి
తిలకించి నీదు పాతివ్రత్య మహిమ
కలకంఠి సకల లోకమ్ముల నిండె
నీవంటి గుణవతి నిఖిల లోకముల
నేవిధిఁ గని విని యెఱుఁగ మెన్నఁడును
పెక్కు కాలంబులు ప్రియుఁడను నీవు
మక్కువ సకల సామ్రాజ్య వైభవము
లనుభవించుచు నుండు డటమీద మీకు
ఘనలీల స్వర్గభోగములు ప్రాప్తించు
నని యూరడించిన నా దమయంతి
మనమున హర్షించె మాధవుఁ డంత
ధరణీతలేశుని దమయంతి నపుడు
కరుణతో దీవించి కమలతోఁ గూడ
హర పద్మజాది మహాత్ములుఁ గొలువఁ
దరమూఁది పరమ పదంబున కరిగె
నంతట నలుఁడు పూర్వాకృతిఁ బ్రబలి

సంతసం బలర నచ్చట నున్న యట్టి
సదుగుణోన్నతుఁ గురు గురువు వసిష్ఠు
పరమ భక్తిని జుట్టివచ్చి కేల్మోగిచి
వేవేల తెరఁగుల వినుతు లొనర్చి
సేవింపంగాను వసిష్ఠుఁ డిట్లనియె

## వసిష్ఠోపదేశము

జననాథ నీ సత్యసంపద కలరి
ఘనకరంబుగ రమాకాంతుఁ డేతెంచి
ప్రత్యక్ష మయ్యె నీ భాగ్యమూలమున
సత్యమే ధర్మము సత్యమే జయము
సత్యమే పెన్నిధి సత్యమే బలిమి
సత్యంబు గలిగినఁ జాలు వెయ్యేల
నటుగాన నీ కీర్తి యఖిల లోకములఁ
పటుతరంబుగ నిండెఁ బ్రబలెను మఱియు
వసుధలో మావంటి వారికి నెల్ల
వసుమతి నాయకా వన్నెఁ దెచ్చితివి
ఇది యొకటే చాలు నిఁక మాటలేల
పొదలి వేడ్కలోఁ బుష్కరాధిపుని
నవలీలఁ గెల్చి యా యవని సంతయును
ప్రవిమల గతితోడఁ బాలింపు మనియె

## నలుని ఋతుపర్ణుండు వేడుకొనుట

నప్పుడు ఋతుపర్ణుఁ డరుదెంచి నలునిఁ
దప్పక కనుఁగొని ధరసాగి మ్రొక్కి
జనకులాధీశ ని న్నెఱుఁగంగ లేక

మునుకొని నీ చేత మ్రొక్కు లోఁగితిని
నీ మహామహిమ వర్ణింప నావంటి
సామాన్యు లగువారు జాలరు ధాత్రి
నీ విద్య మహిమచే నీరజోదరుని
పాదాబ్జములఁ బొందు భాగ్యంబు గలిగె
వనరనే దంపుచే ధన్యుండనైతి
మనుజేశ నా తప్పు మన్నించి నన్నుఁ
గరుణ నీ బంటుగాఁ గాచి కొమ్మనిన
నరనాథుఁడైన యా నలచక్రవర్తి
వెరవొప్ప ఋతుపర్ణు వీక్షించి పలికె
ధరణీశ కలి మాయఁ దగిలి నీ యొద్ద
నెంచిన మాఁడేండ్లు నెమ్మి సౌఖ్యములు
కలిగించి ప్రోచితి కరుణతో నన్ను
నీవు పుణ్యుండవు నిరుపమతేజ
కావున నినుఁ గొల్వఁగ గలిగె భాగ్యములు
వసుధేశ నీ విందు వచ్చుటఁ జేసి
యసదృశకోటి సూర్యప్రభాపటల
కలితుఁడౌ హరి జూడఁ గలిగె సత్కీర్తి
వెలసె సామాన్యుండవే నీ వటన్న
విని ఋతుపర్ణుండు విభునకు మ్రొక్కి
తన బలంబులు గొల్వఁ దన పురి కరిగె

## నలుఁడు నిషధాపురికిఁ జనుట

దమయంతిని గుమార దనయ నారార్చి
క్రమమున బొదలి సుఖంబుండునంత
నలమహీపాలుఁ డున్నత భక్తి మాను

దెలిపిన రిపుని వధింపఁగా దలఁచి
కరులు రథంబులు ఘన తురంగములు
దొరలు సామంత్రులు భటు ల్గొలువ
నాదిత్య సంకాశ మగు రథం బెక్కి
మోదంబుతో వాద్యములు పెక్కు మ్రోయ
దన దేవి నటునుంచి దనర వసిష్ఠ
డనురక్తి దీవింప నతనితోఁ గూడ
రయమున నిషధాపురమున కరిగి
నయమొప్ప పుష్కర నరనాథుఁ గాంచి
ధారుణీనాథుండు తప్పక పలికె
నా పాథేమున్న నే నా కలిదేవు
మాయచే నోడితి మహినెల్ల నీకు
నాయతంబుగా నిప్పు డట్టి జూదంబు
నాడుము నీ వన్న నాతఁ డిట్లనియు
నాడంగ తగ దిప్పు డా కలిదేవు
ననుమతి లేక నరాధిప యనిన
విని నవ్వి నలమహీవిభు డిట్టులనియె
తడయక నీవు జూదం బాడవేని
విడువుము రాజ్యంబు వేగమె యిపుడు
కాకున్న నా తోడఁ గయ్యే మొనర్పు
మా కలి యిట కింక నరుదేర దనిన

## నలునితోఁ బుష్కరుండు జూదమాడి యోడిపోవుట

నలునితోఁ బోడరి యంతట జూదమాడి
కలి తోడులేమి భాగ్యమునెల్ల నోడి

నగరంబు నెడబాసి నాతియుఁ దానుఁ
వెగలుచు బుష్కర భూవిభుఁ డరిగె
నప్పుడు వార్ష్ణేయు డయ్యోడకప్పు
వొప్పుగాఁ జనుదెంచి యొగిఁ గొల్చియుండె
నా వసిష్ఠ మునీంద్రుఁ డపుడు భూసురుల
రావించి భూరమా రమణుని కడకుఁ
జని మీర లిక్కడి చందమంతయును
వినిపించి దమయంతి వేవేగ దెండు
వనుఁడంచు బంపిన జగతీసురేంద్రు
లనురక్తితోఁ బోయి యా విదర్భేశుఁ
గనియది వినిపించి కడు సంతసింప
ననఘాత్మ దమ పుత్రి నంపింపుఁ డనిన
విని భీమభూపతి వేవేగ తనదు
తనయునితోఁ గూడ తగు రథం బెక్కి
సిద్ధంపు వైడూర్యనిగనిగల్గల్గు
పెద్ద పల్లకిలోన బిడ్డలతోడ
దమయంతి నిడికొని తన వారు గొల్వ
రమణతో నిషధాపురంబున కరిగి
నలరాజచంద్రుని నగరికిఁ బోయె
నలరుచు నంతలో నా వసిష్ఠుండు

## నలుని పట్టాభిషేకము

కరమొప్ప పురము శృంగారింపఁ బనిచి
యురయంగ నేఁబదియాఱు దేశముల
రాజుల రప్పించి రహి నదీ నదుల

హా జలనిధి జలం బర్థిఁ దెప్పించి
నలరాజు సింహాసనంబున నిలిపి
యెలమి మంత్రులుఁ బురోహితులును గొలువ
మంగళ తూర్యముల్ మద్దెలల్ మ్రోయ
శృంగారవతులైన చెలులు సేవింప
నరుదైన రత్నసింహాసనంబునను
ధరణీశ్వరుని చెంత దమయంతి నునిచి
హోమాదికృత్యంబు లొనరఁ జేయించి
ప్రేమింపఁగా నభిషేకంబుఁ జేసి
కరమొప్ప పట్టము గట్టిన నంత
జిరలీల రాజ్యంబు సేయుచు నుండె
నా విదర్భేశున కా నలరాజు
వావిరి సాష్టాంగ వందన మిడిన
మన మార దీవించి మన్ననవడసి
తనయుని గూడి విదర్భేశుఁ డరిగె
నలుఁ డంతటను గురునాథుని పాద
జలంబునకు మ్రొక్కి సన్నుతి సేయఁ
గనుఁగొని సంతోష కలితుడై యతఁడు
ఘనకృపారస మొల్కఁగాను దీవించి
వలనొప్ప తన తపోవనమున కరిగె
నలరుచు నపుడు దేశాధి నాయకులు
వినయంబుతో నలవిభునకు మ్రొక్కి
వినుతులు మఱియు గావింప మోదించి
బహురత్న భూషణాంబరము లొసంగ

మహినాథులెల్ల సమ్మోదమును బొంది
పొందుగాఁ దమ దమ పురవరంబులకు
సందడుఁ జనిరంత నా రాజవిభుఁడు
దమయంతి గూడ మోదంబున మించి
సుమబాణకేళిలో సొంపు దీపింప
నా చంద్రధరణి సురేంద్రాదులు పొగడ
భూచక్రమెల్ల నేర్పున నేలుచుండె
నని యిట్లు బృహదశ్వుఁ డా ధర్మజునకు
వినిపించెఁ దాము న్న విన్న మార్గమున
వరుసతో నలచక్రవర్తి చారిత్ర
సరసత గ్రంథ విస్తారంబు గాఁగ
వినుత వాక్యంబుల వెలయంగఁ జెప్పె
ననుచు వాధూల గోత్రాబ్ధి చంద్రుండు
చిరకీర్తిమంతుఁ డాశ్రితహితోదయుడు
కరుణాపయోనిధి కంబాడ దొడ్డ
యాచార్యునకు శిష్యుడై నట్టి వైష్ణ
వాచారమూర్తి సత్య దయాపరుండు
పొలువు మీరిన చక్రపురి దొడ్డ ఘనుడు
వలనొప్ప నతనికి వర కూర్మి తనయు
డకలంక మానసుఁ డతి సత్యధనుఁడు
సకల కవిత్వ వాచావిశారదుఁడు
దనర నాతనికి విద్యాప్రవిలుండు
జనలోక నుతుడు సజ్జనలోక హితుడు
తిరువేంగడాచార్య ధీరాగ్రగణ్యుఁ
డరయ నాతనికి నే నాత్మ సంభవుఁడు

శ్రీమతశ్వానుఁ డవిద్యా విశారదుఁడ
రమణనే వరకవి రాఘవాహ్వయుఁడ
నరహరి ఘటికాద్రి నాథుని పేరఁ
బరువడి నే నాంధ్ర భాషల వెలయ
నవనిలో కవిరాజులై నట్టి సరస
కవుల సత్కృప నాకుఁ గలుగుటఁ జేసి
యలరార నీ నలాహ్వయుని చరిత్రఁ
దలచి చెప్పితిని యుత్తర భాగ మెలమి
వలనొప్పఁ జదివిన వ్రాసిన వినినఁ
...మాయ రహితులై కమలేశుకరుణ
...జను లాయు వృద్ధియు సంపదల్ వడసి
ఘనులనఁ దనరి ప్రఖ్యాతిని గాంతు
రీ చక్రవర్తి నరేంద్రు చారిత్ర
మాచంద్ర తారార్కమై యొప్పుఁగాత.

నలచరిత్ర - ఉత్తరభాగము సర్వము

సంపూర్ణము.

ఆనంద భారతి పవర్ ప్రెస్, గోపాలపురం, మద్రాసు - 600 086.